

శ్రీ చాంద్రమాన 'విజయ'నామ సంవత్సర

# శ్రీభాస్కర పంచాంగమ్

## SHRI BHASKARA PANCHANGAM (Telugu)

*for the year* ***VIJAYA*** *(2013-2014 AD)*




Almanac-maker : "Jyouthisha Sarvabhouma"

**Pundit ANNAPARTHY KRISHNA SHARMA Siddhanthi**



Published by : ADITHYA JYOTHISHALAYAM ASSOCIATION

11-20-14/206, HUDA Complex, Saroor Nagar, HYDERABAD - 500 035.



పంచాంగకర్త : జ్యోతిష సార్వభౌమ **బ్రః శ్రీః అన్నపర్తి కృష్ణశర్మ సిద్ధాన్తి**



పబ్లిషర్స్ : **ఆదిత్య జ్యోతిషాలయం అసోసియేషన్**

11-20-14/206, హుడా కాంప్లెక్స్, సరూర్‌నగర్, హైదరాబాద్ - 500 035.

✆ : 6457 5218, 2404 4759, Mob : 9885 442568

**E-mail: bhaskara.aksind@yahoo.com, www.shribhaskarapeetham.org**

***52nd Issue*** **52-వ పంచాంగము** **వెల రూ. 35**


***2013-'14 AD***

## OUR GRATEFUL THANKS

To the Director, Positional Astronomy Centre, Kolkata, Government of India, for providing us the necessary Astronomical Data for preparation of this Panchang. Accordingly, the timings of Tithi, Nakshatras etc. and rising-setting-retrogression of the Planets, Eclipses of the Sun and the Moon given in this Panchang agree with those shown in the Rashtriya Panchang and the Indian Astronomical Ephemeris.

Hyderabad – Pundit Annaparthy Krishna Sharma "Siddhanthi"
Date : 1-3-2013 Mobile: 98854-42568

## విషయసూచిక

పేజి



## బ్ర॥ శ్రీ॥ అన్నపర్తి కృష్ణశర్మ సిద్ధాన్తి గారు

శ్రీభాస్కర పంచాంగకర్త అయిన బ్ర॥శ్రీ॥ అన్నపర్తి కృష్ణశర్మ సిద్ధాన్తి గారు **భారత ప్రభుత్వము వారిచే గుర్తింపు పొందిన పంచాంగకర్తలలో** నొకరు. తంజావూరు "శాస్త్రా" విశ్వవిద్యాలయమునకు, తెలుగు విశ్వవిద్యాలయమునకు (జ్యోతిష విభాగము బోర్డు మెంబరు) - జ్యోతిషములో బి.ఏ. సిలబసు, పుస్తకములు వ్రాసినారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారి 'అర్చక పౌరోహిత్య సిలబస్ కమిటీ' సభ్యులుగా నున్నారు. ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు (ఎండోమెంట్స్ డిపార్టుమెంటు) వారి **ఆగమ ఎడ్వైజరీ బోర్డు మెంబరుగా** నున్నారు.

శ్రీ శర్మగారు మంచి సాంప్రదాయక కుటుంబమున 1936 సం॥ జనవరి 4వ తేదీన శ్రీ యువ సం॥ర ముక్కోటి ఏకాదశీ శుక్రవారమున అన్నపఱ్ఱు గ్రామము (గుంటూరు జిల్లా)లో జన్మించినారు. వీరి తండ్రి గారైన కీ॥శే॥ రామకోటేశ్వరశర్మగారు షోడశ కర్మాధికారి, జ్యోతిష-హస్త సాముద్రికవేత్త. శ్రీ కృష్ణశర్మ గారు తమ తండ్రి గారి వద్ద జ్యోతిష శాస్త్రము, హస్తసాముద్రికాలు, స్మార్తము, మంత్ర శాస్త్రములు అభ్యసించినారు. వీనితో పాటు ప్రాక్-పశ్చిమ జ్యోతిష శాస్త్రాలను కూడ బలపరిచినారు. వేదాంత సాహిత్యము, ఉపనిషత్తులు, సంస్కృతాంధ్ర భాషలలో పంచకావ్యాలు చదివినారు. ఆంధ్రా యూనివర్సిటీ పట్టభద్రులు. ఆంధ్ర దేశములోని ప్రముఖ సంస్కృత విద్వాంసులలో నొకరుగా వీరిని కేంద్ర ప్రభుత్వము గుర్తించినది. వీరికి వివాహము 1959 సం॥న జరిగినది. వీరి ధర్మపత్ని సౌ॥ లక్ష్మీపార్వతీదేవి పిన్ననాటనే సంగీత, భరతనాట్యాలు నేర్చినారు. "నాట్యశాస్త్ర పరిచయము" అను గ్రంథమును వ్రాసినారు; 1972-73 సం॥లలో ఆలిండియా డ్యాన్స్ కాంపిటీషన్స్‌కు (YMCA) జడ్జిగా ఉన్నారు.

శ్రీ శర్మగారు, శ్రీకృష్ణ రాయబారము, చింతామణి మొదలగు పౌరాణిక, సాంఘిక నాటకములలో పాత్రలు ధరించి పేరు గడించినారు. 1962 సం॥ నుండి 'శ్రీ భాస్కర పంచాంగము' గుణించి, ప్రచురించుచున్నారు. **జ్యోతిష బాలబోధిని, దేవీ పూజాకల్పము, ముహూర్త పారిజాతము, కాళీశతకము, శ్రీ సూర్య సిద్ధాన్తము, జ్యోతిష విజ్ఞాన చంద్రిక** అను గ్రంథాలు రచించినారు. జాతక-ముహూర్త-సాముద్రిక-వాస్తు-ప్రశ్న-గ్రహ శాంతి విధానములలో మంచి అనుభవజ్ఞులు. ఆకాశవాణి - విజయవాడ, హైదరాబాదు కేంద్రముల వారు, వీరి జ్యోతిష ప్రసంగాలను, వేదపఠనము ప్రసారము చేసియున్నారు. 1984



సం॥లో జ్యోతిష విద్యాలయము స్థాపించి, హైదరాబాదు శంకరమఠములోను, ఇతరత్ర ఉచిత జ్యోతిష తరగతులను నిర్వహించినారు. 100 సం॥ల పంచాంగము తయారుచేసినారు (అముద్రితము).

1982 సం॥ ఢిల్లీలో జరిగిన **"జ్యోతిశ్శాస్త్ర సదస్సు"**లోను, అనేక జాతీయ, అంతర్జాతీయ సదస్సులలోను పాల్గొనినారు. దేవాదాయ శాఖలో "ఆరాధన" పత్రిక ఎడిటర్‌గా (1990) పనిచేసినారు. పెక్కుసార్లు ఉగాది పండుగ నాడు హైదరాబాదు దూరదర్శన్‌లో, ఢిల్లీలోను పంచాంగ శ్రవణము చేసినారు. జగత్కల్యాణము కొఱకు, ప్రత్యక్ష దైవమైన శ్రీ సూర్య భగవానుని గూర్చి 1996 సం॥ డిసెంబరు 15-29 వఱకు నవగ్రహ మఖ-మహారుద్ర యజ్ఞ సహిత **'శ్రీ సౌర మహాయాగము'** చేసినారు. శ్రీ లక్ష్మీ గణపతి, సుబ్రహ్మణ్య, హనుమత్ప్రతిష్ఠలు మొదలగునవి చేయించుటలో సిద్ధహస్తులు. శ్రీ సూర్య సమ్మతమైన గ్రహ గణిత సిద్ధాన్తము, పంచాంగ సిద్ధాన్తము, భారతదేశములో పంచాంగముల ఏకీకరణ విధానములపై సిద్ధాంతిగారు పరిశోధన చేయుచున్నారు.

జాతక ఫలితాంశముల కొరకు, వారివారి జాతకరీత్యా అభీష్టసిద్ధి కొఱకు చేయవలసిన గ్రహశాంతులు, జపములు, హోమములను సిద్ధాంతిగారు స్వయముగా నిర్వహించెదరు. కావలసినవారు సంప్రదించవచ్చును.

శ్లో॥ అన్నపర్త్యన్వయాంభోధి రాకాపూర్ణ సుధాంశునా ।
ప్రోక్తం భాస్కర పంచాంగం, విదుషా కృష్ణశర్మణా ॥

హైదరాబాద్ సెల్ : 9885 442568
1-3-2013 ఫోన్ : (040) 2044 4759

## శ్రీ విజయనామ సం॥ర శ్రీభాస్కర పంచాంగ వివరణము (2013-'14 AD)

ఈ పంచాంగము, గత 51 సంవత్సరముల నుండి ప్రచురింపబడుచు విశేష ప్రజాదరణను పొందియున్నది. ప్రస్తుతము ఈ విజయ సంవత్సర శ్రీభాస్కర పంచాంగములో అనేక నూతనాంశములు చేర్పబడినవి.

ఈ పంచాంగము నవీన దృగ్గణిత రీత్యా, భారత ప్రభుత్వము వారిచే ఆమోదింపబడిన శకమానముతో, భారత కాలమానపు గంటలు, నిమిషములలో వ్రాయబడినది. ఉదయము గం. 5-30 ని॥ల నుండి తిథి, నక్షత్ర, యోగ, కరణముల సమాప్తి కాలములు, వర్జ్యము యొక్క ఆద్యంతములును పట్టికలో చూపబడినవి. "వ్రతాది విశేషః" అను శీర్షికలో సహస్రాధికముగా పండుగలు, వ్రతములు, పుణ్యకాలములు, సెలవు దినములు, జయంతులు, పుణ్యతిథులు, ఆరాధనలు, ఉత్సవములు మొదలగునవి వ్రాయబడినవి. ప్రభుత్వమువారి సెలవు దినములే గాక, ఇస్లాము, క్రిస్టియను మతములకు సంబంధించిన మాసారంభ దినములు, పండుగలును వ్రాయబడినవి.

చైత్రాది ద్వాదశ మాసములకు అశ్విన్యాది కార్తెలకును ప్రత్యేకముగ వర్షయోగాది ఫలితాంశములే గాక, గ్రహముల పాదచారములు, దైనందిన లగ్నసారణియును ప్రదర్శింప బడినవి.

**పంచాంగ వివరణము :** 1. తిథి, 2. వారము, 3. నక్షత్రము, 4. యోగము, 5. కరణము - వీనిని పంచాంగము అందురు. తిథి వలన శ్రేయస్సు, వారము వలన ఆయుస్సు, నక్షత్రము వలన పాపక్షయము, యోగము వలన రోగ నివారణము, కరణము వలన కార్యసిద్ధియు కల్గునని చెప్పబడినది.

**వేదములు, కర్మకాండ :** వేదములోని పూర్వభాగమంతయు కర్మాచరణను విధించును. అట్టి కర్మలు కాలవిశేషము నాశ్రయించి అనుష్ఠింపదగినవి. ఆయా కాల విశేషములను దెలుపునది జ్యోతిశ్శాస్త్రము. ఈ కర్మార్థ కాల విశేషములు జ్యోతిశ్చలనము వలన గలుగును. జ్యోతిస్సులనగా : 1. సూర్య చంద్రులు (బింబ గ్రహములు), 2. కుజాది పంచ (తారా) గ్రహములు, 3. మందోచ్చలు, 4. విలోమగతికల పాతలు, 5. నక్షత్రములు. ఈ పంచవిధ జ్యోతిస్సుల చలనము వలన కాలవిశేషము లేర్పడుచున్నవి.



**ఈ కాల విశేషములు :** 1. ప్రజాపతిలోకము, 2. బృహస్పతిలోకము, 3. దేవలోకము, 4. పితృలోకము, 5. మనుష్యలోకము నను నైదు లోకములకును సంబంధించియున్నవి. కావుననే, మనుష్యలోకమున శాస్త్రోక్త కాలములందనుష్ఠింపబడిన యాగాది కర్మలందలి హవ్య కవ్యములు తత్తల్లోకవాసులగు దేవతలకు సంక్రమించుట వలన, మనుజులకు ఇహపర సౌఖ్యములు లభించుచున్నవి. ఇట్టి విషయపంచకముతో నొప్పు పంచాంగము ప్రతి గృహస్థునింట నుండవలయును.

**కాలస్వరూపము :** కాలము పరబ్రహ్మస్వరూపము. ఇదిరెండు విధములు: ఒకటి సంహారాత్మకమైనది. రెండవది కలనాత్మకమైనది. ఈ కలనాత్మకమైన కాలము స్థూలము, సూక్ష్మము అని మఱల రెండు విధములు. కల్పములు, మన్వంతరములు, యుగములు, సంవత్సరములు మొదలగునవి స్థూల కాలము. ఱెప్పపాటు కంటె తక్కువ గల కాలమును సూక్ష్మకాల మందురు.

**సంవత్సర కాల విభాగము :** కాల విభాగములో సంవత్సర కాలము అత్యంత ప్రాముఖ్యము గలది. సంవత్సరమునకు అయనములు రెండు : 1. ఉత్తరాయణము, 2. దక్షిణాయనము. సంవత్సరమునకు ఋతువులు ఆఱు. ఋతువునకు మాసములు రెండు. మాసమునకు పక్షములు రెండు - శుక్లపక్షము, కృష్ణపక్షము. పక్షమునకు వారములు రెండు. వారమునకు దినములు ఏడు. దినమనగా అహోరాత్రము - పగలు, రాత్రి. పగలు, రాత్రికి రెండేసి పూటలు. పూటకు జాములు రెండు. జామునకు గంటలు మూడు. దినమునకు 24 గంటలు లేదా 60 గడియలు. సంవత్సరములో లెస్సగా నిమిడిన కాలస్వరూపము తిథి, వార, నక్షత్రాదులతో గూడినదై పంచాంగము నందు ప్రదర్శింపబడును.

## పంచాంగము చూచు పద్ధతి

పంచాంగము మానవులకు శుభాశుభ ఫలములను సూచించుచున్నది. ప్రతి మాసమునందును తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి అన్ని పనులకు శుభప్రదమైనవి; చవితి, నవమి, చతుర్దశి మంచివి కావు. వారములలో బుధ, గురు, శుక్రవారము ఉత్తమమైనవి. మంగళవారము క్రూరమైనది. యోగములలో శూల, పరిఘ, వ్యతీపాత, వైధృతి యోగములు కూడనివి. కరణములలో విష్టికరణము చెడ్డది. ఇదే విధముగా నా యా

కార్యములకు తగిన నక్షత్రములను గూడ చూచుకొనవలసి యున్నది. శంకుస్థాపనాది ముహూర్తములకు శుభమైన తిథి - వార - నక్షత్రాదులను ప్రత్యేకముగా నిర్ణయించుకొనవలెను. వర్జ్యమనగా వర్జింపదగినదని అర్థము. వర్జ్యకాలము జప, పూజా, ధ్యానాదికము నకు మంచిది. సాధారణముగా రాహు కాల మశుభము, గుళిక కాలము శుభము. రాహుకాలము యాత్రా వివాహాదు లందు వర్జింపదగినది.

సంవత్సరములు 60 : వాని పేర్లు - ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోద, ప్రజోత్పత్తి, అంగీరస, శ్రీముఖ, భావ, యువ, ధాత, ఈశ్వర, బహుధాన్య, ప్రమాథి, విక్రమ, వృష, చిత్రభాను, స్వభాను, తారణ, పార్థివ, వ్యయ, సర్వజిత్, సర్వధారి, విరోధి, వికృతి, ఖర, నందన, విజయ, జయ, మన్మథ, దుర్ముఖి, హేవళంబి, విళంబి, వికారి, శార్వరి, ప్లవ, శుభకృత్, శోభకృత్, క్రోధి, విశ్వావసు, పరాభవ, ప్లవంగ, కీలక, సౌమ్య, సాధారణ, విరోధికృత్, పరీధావి, ప్రమాది, ఆనంద, రాక్షస, నళ, పింగళ, కాళయుక్తి, సిద్ధార్థి, రౌద్రి, దుర్మతి, దుందుభి, రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన, అక్షయ. వీనికి నారద సంతానమని జగత్ప్రసిద్ధి కలదు.

ఋతువులు 6 : అవి - వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర ఋతువులు.

మాసములు 12 : అవి - చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తికము, మార్గశిరము, పుష్యము, మాఘము, ఫాల్గునము. మాసములు, ఋతువులు, సంవత్సరములును సూర్యచారము వలన నేర్పడుచున్నవి.

తిథులు 30 : అవి 1. శుక్లపక్షమున - పాడ్యమి, విదియ, తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, పూర్ణిమ, 2. కృష్ణపక్షమున - పాడ్యమి, విదియ, ...... చతుర్దశి, అమావాస్య. శుక్ల పక్షమునే శుద్ధ పక్షమనియు, కృష్ణ పక్షమునే బహుళ పక్షమనియు వ్యవహరింతురు. విధులను తెలుపునవి తిథులు - ఇవి బ్రహ్మ స్వరూపము.

వారములు 7 : అవి - ఆదివారము, సోమవారము, మంగళవారము, బుధవారము, గురువారము, శుక్రవారము, శనివారము. ఈ వారములకు



ప్రతివారములు : భాను వాసరము, ఇందు వాసరము, భౌమ వాసరము, సౌమ్య వాసరము, బృహస్పతి వాసరము, భృగు వాసరము, మంద వాసరము. 'సంకల్పము' చెప్పునపుడు ప్రతివారములు చెప్పవలెను.

నక్షత్రములు 27 : అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఘ, పూర్వఫల్గుని (పూ.ఫ.), ఉత్తరఫల్గుని (ఉ.ఫ.), హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ (పూ.షా.), ఉత్తరాషాఢ (ఉ.షా.), శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర (పూ.భా.), ఉత్తరాభాద్ర (ఉ.భా.), రేవతి. ఇవన్నియు దక్ష ప్రజాపతి కుమార్తె లని చెప్పబడినది.

యోగములు 27 : విష్కంభము, ప్రీతి, ఆయుష్మాన్, సౌభాగ్య, శోభన, అతిగండ, సుకర్మ, ధృతి, శూల, గండ, వృద్ధి, ధ్రువ, వ్యాఘాత, హర్షణ, వజ్ర, సిద్ధి (అసృక్), వ్యతీపాత, వరీయాన్, పరిఘ, శివ, సిద్ధ, సాధ్య, శుభ, శుక్ల (శుక్ర), బ్రాహ్మ, ఐంద్ర, వైధృతి యోగములు. ఇవి విష్ణు స్వరూపములు.

కరణములు 11 : చర కరణములు ఏడు - బవ, బాలవ, కౌలవ, తైతుల, గరజి, వణిజి, విష్టి (భద్ర). స్థిర కరణములు నాలుగు - శకుని, చతుష్పద, నాగవ, కింస్తుఘ్నములు. ఇవన్నియు శివ స్వరూపములు.

సంవత్సర ఋతు, మాస, తిథ్యాదుల పేర్లు అనేక గ్రంథకర్తల చేతను కొందఱు పంచాంగకర్తలచే గూడ అపభ్రంశముగ వాడబడుచున్నవి. ఉదా : జ్యోతిషం, జ్యోతిష్యుడు, రాసి, రాశులు, ఉచ్ఛ, జ్యేష్ఠమాసం, ఆశ్వీజం, ఆశ్వీయుజం, కార్తీకం, ఫాల్గుణం, అశ్వని, ఆరుద్ర, మఖ, జ్యేష్ట, గురుడు, అరుణగ్రహం, శనీశ్వరుడు, గ్రహసంచారం, నిర్బీజ రవి చంద్రులు, గ్రహ నయనం, నిరయనము, నిరాయణము, ఘడియలు, నిముషము, చతుష్పాత్ (యోగము), యమగండం, ఆశౌచము, మేలాపకం, శుభముహూర్తం, అశుభ శకునం, బ్రహ్మ(యోగం), మిధునం, ధనస్సు, ఉ.షాఢ, ఉ.భాద్ర, హిమవంత ఋతువు, కాలశాస్త్రం, గ్రహశాస్త్రం, మహర్దశ, వరఫలం. అగ్రహాయణ, ప్రమాదీచ, క్షయ సం॥, ధర్మార్థకామ్యమోక్ష, కిరణ్మయి, దహోత్రుడు, గ్రహ సంచారము ఈ విధముగా సంప్రదాయ విరుద్ధముగా తప్పులుగా వాడబడు చున్నవి. కాని, యీ పంచాంగములోని పదములు శాస్త్రీయముగా, శుద్ధముగా వ్రాయబడినవి.

## శ్రీ గౌరీ పంచాక్షరీ మహామంత్రము

అస్య శ్రీగౌరీపంచాక్షరీ మహామన్త్రస్య పర్వతరాజ ఋషిః, గాయత్రీ ఛందః, గౌరీ దేవతా, హ్రాం బీజం, సాః శక్తిః, ఈం కీలకం శ్రీగౌరీ ప్రీత్యర్థే మమ శాశ్వత సౌమంగళ్యాభివృద్ధ్యర్థే అష్టైశ్వర్య సిద్ధ్యర్థే జపే వినియోగః ॥

**కరన్యాసః :** హ్రీం అంగుష్ఠాభ్యాం నమః, సౌః తర్జనీభ్యాం నమః, ఈం మధ్యమాభ్యాం నమః, ఈం అనామికాభ్యాం నమః, సౌః కనిష్ఠికాభ్యాం నమః, హ్రీం కరతల కరపృష్ఠాభ్యాం నమః ॥

**అంగన్యాసః :** హ్రీం హృదయాయ నమః, సౌః శిరసే స్వాహా, ఈం శిఖాయైవషట్, ఈం కవచాయ హుం, సౌః నేత్రత్రయాయ వౌషట్, హ్రీం అస్త్రాయ ఫట్, భూర్భు వస్సు వరోమితి దిగ్బంధః ॥

### ధ్యానమ్

శ్లో॥ సకుంకుమ విలేపనా మళికచుంబి కస్తూరికామ్
సమంద హసితేక్షణాం సశర చాప పాశాంకుశామ్ ।
అశేషజన మోహినీ మరుణమాల్య భూషాంబరామ్
జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరే దంబికామ్ ॥

### లమిత్యాది పంచపూజా

లం - పృథివీ తత్త్వాత్మికాయై గౌర్యై నమః గంధం పరికల్పయామి
హం - ఆకాశ తత్త్వాత్మికాయై గౌర్యై నమః పుష్పం పరికల్పయామి
యం - వాయు తత్త్వాత్మికాయై గౌర్యై నమః ధూపం పరికల్పయామి
రం - తేజస్తత్త్వాత్మికాయై గౌర్యై నమః దీపం పరికల్పయామి
వం - అమృత తత్త్వాత్మికాయై గౌర్యైనమః అమృతనైవేద్యం పరికల్పయామి నమః॥

**మంత్రము : "హ్రీం శ్రీం శివాయై నమః"**

ఈ మంత్రమును ప్రతిదినమును అష్టోత్తర శతముగాని, సహస్రమును గాని జపించవలయును. జపానంతరము, మఱల ఆచమనము, న్యాసము, దిఙ్మోకము, ధ్యానము చేయవలయును. దీనిని జపించుట వలన దీర్ఘ సౌమంగళ్యము, సత్సంతానము, అష్టైశ్వర్యములును సిద్ధించును.



## వ్రతాది విశేషముల వివరణము

ఈ పంచాంగములో సహస్రాధికముగా వ్రతాది విశేషములు వ్రాయబడినవి. వానిలో కొన్నింటిని గూర్చి యీ దిగువ వివరింపబడుచున్నవి.

**అహర్గణము :** ఈ కలియుగము ప్రారంభమునుండి యున్నవ దినమని అర్థము.

**జయంతులు :** జయంతి అనఁగా పుట్టిన రోజు పండుగ అని యర్థము. అవతార పురుషులకు, మహాపురుషులకు, సిద్ధపురుషులకు మాత్రమే జయంతులు జరుపుట పరిపాటి. ఇతరుల కందఱకు, సన్యాసులతో సహా, పుణ్యతిథులే జరుపుదురు. పుణ్యతిథులనఁగా చనిపోయిన దినములు. సన్యాసులు చనిపోయిన దినమున ప్రతి సంవత్సరము 'ఆరాధన' చేయుదురు. ఇతరుల విషయమున 'ప్రత్యాబ్దికము' జరుపుదురు.

**వర్ధంతులు :** వర్ధంతి అనఁగా పుట్టిన రోజు పండుగ. వర్ధతి - వర్ధతిః వర్ధన్తి అని ధాతుపాఠము. పాత్రికేయుల పుణ్యమా అని దీనిని 'చచ్చిన రోజు పండుగ'గా మార్చినారు. అసలు "పాత్రికేయులు" అను పదమే అపభ్రంశమైనది. ద్రౌపదేయులు, కౌంతేయులు, మాద్రేయులు అను వరుసలో చూచినచో, యీ పాత్రికేయుల పదమునకు అర్థమేమి!

**అవమ :** ఇనోదయద్వయాంతరమున మూఁడు తిథులున్నచో, అవమ తిథియందురు. అవమ తిథియున్న దినమున శుభకార్యములు, నూతన కార్యములు జరుపరాదు.

**త్రిద్యుస్పృక్ :** ఒక తిథి, దినము యొక్క (రెండు సూర్యోదయముల మధ్యకాలము) పూర్వాపరములం దతిక్రమించి యున్నచో, త్రిద్యుస్పృక్కు అనఁబడును. ఇది శుభ కార్యములకు అవమతిథివలె నిషిద్ధము.

**శూన్యతిథి :** శూన్యతిథి అని వ్రాసిన రోజున ఆబ్దికములు పెట్టరాదు.

**తిథి ద్వయము :** తిథి ద్వయము అని యున్న రోజున, ఆ రెండు తిథులకు సంబంధించిన ఆబ్దికములను అదే రోజున (అపరాహ్ణకాలమున) పెట్టవలెను.

**ద్విపుష్కరయోగము, త్రిపుష్కరయోగములు :** ఈ యోగములున్న దినములలో వివాహాది శుభకార్యములు చేయరాదు; చేసినచో పునఃపునః వివాహయోగము పట్టును. అందువల్ల, యీ యోగములలో దేవతా దర్శనము, సముద్రస్నానము, యజ్ఞయాగములును చేయుదురు.

**మాసశూన్య నక్షత్రములు :** ఈ దినములందు గృహప్రవేశము, వివాహాది శుభ కార్యములు, నూతన వ్యాపార ప్రారంభమును చేయరాదు. చేసినచో ధనము నష్టమై, అరిష్టములు కలుగును.

**గమననిషిద్ధము, యాత్రావర్జ్యము :** అని వ్రాసియున్న దినములందు ప్రయాణములు, యాత్రలు చేయరాదు. ఉదాహరణకు : శ్రీ తారణనామ సం॥ర భాస్కర పంచాంగములో మార్గశిర శు॥ చతుర్దశీ, శనివారము, 25-12-2004 తేదీన (పేజీ : 89) వ్రతాది విశేషములలో "యాత్రావర్జ్యం" అని యున్నది. ఆ రోజున సముద్రస్నానమునకై వెళ్ళిన వారందఱు సునామీ (tsunami) నామక సముద్ర కెరటములలో లక్షలాదిగా మరణించినారు. ఆ విధముగా వెళ్ళిన వారందఱును మరణింపకపోవచ్చును; కాని ఆ ప్రమాదము పొంచియున్నదని శాస్త్రము హెచ్చరించినది. ట్రాఫిక్ నిబంధనల వలె శాస్త్రసూత్రముల ననుసరించుట శ్రేయస్కరము.

**ప్రయాణములు :** అష్టమి నవములు, చతుర్దశి, అమావాస్యలు, సంక్రాంతి దినములు, కనుము, మంగళవారము, శనివారము ప్రయాణములకు మంచివి కావు. వార శూలలు, దిక్ శూలలు కూడ చూచుకొనవలయును.

ప్రయాణ విషయమై అష్టమి కష్టము, నవమి నష్టము అని నానుడి. ఇఁక బ॥ చతుర్దశి, అమావాస్య, శు॥ పాడ్యమి తిథుల క్షీణచంద్ర సంబంధములగుటచే ప్రయాణములకు, సర్వశుభకార్యములకు నిషేధింపఁబడినవి. ఉదాహరణకు : శ్రీ తారణ సం॥ మార్గశిర బ॥ అమావాస్య సోమవారము, 10-1-2005 తేదీన గుల్బర్గా నుండి బయల్దేరిక కర్ణాటక బస్సు, ఆ రాత్రి గం. 2-30 సమయములో ఆల్మట్టి ఎడమగట్టు కాలువలో బోల్తాపడి 57 మంది జలసమాధి కాగా, ఎనిమిది మంది మాత్రము ప్రాణాలతో బయటపడినారు.

**గ్రహణములు :** ఈ పంచాంగము నందలి వ్రతాది విశేషములలో గ్రహణ ప్రారంభ సమాప్తి కాలములు స్పష్టముగ తెలుపఁబడినవి. గ్రహణము కనఁబడని ప్రదేశములందు ఆచరింపనక్కరలేదు. గ్రహములన్నియు అరిష్ట ప్రదములే. ఎవరి జన్మనక్షత్రములో గ్రహణము సంభవించునో, వారికి కష్టనష్టములు అపమృత్యుభయము కలుగును కావున, వారి వారి జాతక ప్రకారము శాంతి జరిపించుకొనవలెను.

**శాంతులు :** శాంతులంటే యెవరికి వారు చేసుకొనునవి గావు; మంత్రవేత్తలైన వారు చేయవలసినవి. తామే చేసికొన్నచో నిష్ఫలమగును. ఆ శాంతి విధానముగూడ, జాతకములోని గ్రహ సంపుటీకరణము ననుసరించి యుండవలెను.

హైదరాబాద్,
22-3-2006

– పంచాంగకర్త



**నక్షత్ర సంధి :** రేవతీ అశ్వినుల మధ్యను, ఆశ్లేషా మఘ మధ్యను, జ్యేష్ఠా మూల తారల మధ్యను - 4 గడియల కాలము నక్షత్ర సంధి.

**లగ్న సంధి :** మీన మేషములు, కర్కాట సింహములు, వృశ్చిక ధనుస్సులు - వీని నడుమ 1 గడియ లగ్న సంధి.

**కనుములు :** మరణము, శవదహనము, సపిండీకరణము, జాతర, సంక్రమణము, గ్రహణము - ఇవి జరిగిన మఱుసటి రోజును 'కనుమ' అందురు. కనుమ రోజున ప్రయాణములు చేయరాదు.

**నిషిద్ధ నవమీ త్రయము :** ఏదైనా ఒక ప్రయాణము చేసిన 9వ రోజున గాని, ఆ తిథికి 9వ తిథిని గాని, ప్రవేశము చేయరాదు. ప్రవేశించిన నాటి 9వ నాడు గాని, 9వ తిథిని గాని - అటునుండి బయలుదేరరాదు. వీనినే ప్రయాణ నవమి, ప్రవేశ నవమి, ప్రత్యక్ష నవమి అందురు. ఈ మూడు నవములు తిరుగు ప్రయాణమునకు నిషిద్ధములు.

**పక్షచ్ఛిద్ర తిథులు:** 4, 6, 8, 9, 12, 14 - తిథులు.

**పరామర్శకు :** ద్విపాద త్రిపాద తారలు, ధనిష్ఠా పంచకము పనికిరావు. సంఘటించినదాది సంవత్సరము లోపల ఏదో ఒక బేసినెల పరామర్శకు శుభము.

**తిస్రోష్టకలు :** మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గున మాసములలోను, కృష్ణ పక్షాన వచ్చు 7, 8, 9 తిథులతో కూడిన దినములను తిస్రోష్టకము లందురు. ఇవి అనధ్యాయములు.

**విసర్జించవలసిన కాలము :** గ్రహణాది 7 రోజులు, లగ్నాంతమును 1/2 గడియ, నక్షత్రాంతపు 2 1/2 గడియలు, మాసాంతపు 3 రోజులు, సంవత్సరాంతమున 15 రోజులు వర్జనీయాలు; శుభకార్యములు చేయరాదు.

**చుక్క ఎదురు దోషము :** శుక్ర మూఢములో ప్రయాణమునే చుక్కెదురు దోషమందురు. నవవధువు, గర్భిణీ, బిడ్డతో కలసి బాలెంత - వీరు ముగ్గురును శుక్రాభిముఖముగా ప్రయాణము చేయరాదు. శ్రీవత్సగోత్రము వారికీ చుక్కెదురు (పురశ్శుక్ర) దోషము లేదు.

**శన్యుషః కాలము :** శనివారము సూర్యోదయమునకు ముందు (సుమారు 30 ని॥లు) సమయమునకు శన్యుషః కాలమగును. ఈ సమయములో ప్రయాణమై వెళ్ళినను, మరి ఏ పని ప్రారంభించినను దిగ్విజయమగును.

**అభిజిత్ ముహూర్తము :** సూర్యోదయ లగ్నము నుండి నాల్గవ లగ్నము, సుమారు 12 గంటల వేళ అభిజిన్ముహూర్త మనబడును. ఇది సర్వదోష నివారణము, యత్న కార్యసిద్ధిని కలిగించును.

**పంచ పర్వములు :** బహుళ అష్టమి, చతుర్దశి, అమావాస్య, పూర్ణిమ, సంక్రమణ ప్రవేశకాల తిథి - ఇవి పంచపర్వములు. వీనియందు స్త్రీసంగమము కూడదు.

**సర్వార్థ సాధక చక్రము:** ఈ దిగువ చక్రము ప్రకారము వార నక్షత్రములున్నచో సర్వకార్యారంభములకును శుభప్రదము.

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| అశ్వి | శ్రవ | అశ్వి | - | అశ్వి | అశ్వి | శ్రవ |
| పుష్య | పుష్య | ఆశ్లే | - | పుష్య | - | - |
| ఉత్తర | రోహి | - | రోహి | - | - | రోహి |
| హస్త | - | - | హస్త | రేవ | రేవ | - |
| మూల | మృగ | - | మృగ | పున | పున | - |
| ఉ.షా. | - | కృత్తి | కృత్తి | - | - | స్వాతి |
| ఉ.భా. | - | ఉ.భా. | అనూ | అనూ | అనూ | - |

**విభూతి ధారణ విధిః**

శ్లో॥ తేన భావనయా బ్రహ్మభూతేన సితభస్తనా ।
లలాటవక్ష స్కంధేషు, స్వామోచిత మంత్రతః ॥
మధ్యమాఽనామికాంగుష్ఠై, రనులోమ విలోమతః ।
త్రిపుండంధారయే న్నిత్యం, త్రికాలేష్వపి భుక్తితః ॥

మం॥ మానస్తోకే తనయే మాన ఆయుషిమానో గోషుమానో అశ్వేషురీరిషః ।
వీరాన్మానో రుద్రభామితోఽ వధీర్హవిష్మన్తో నమసా విధేమ తే॥

మం॥ త్ర్యాయుషం జమదగ్నేః । కశపస్య త్ర్యాయుషం । తన్మే అస్తు త్ర్యాయుషమ్ ॥

మం॥ త్రంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుకమివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ మాఽమృతాత్॥

శ్లో॥ భూతి ర్భూతకరీ పవిత్రజననీ పాపౌఘ విధ్వంసినీ
సర్వోపద్రవనాశినీ సదాశుభకరీ సర్వార్థ సంపత్కరీ ।
భూత ప్రేత పిశాచ రాక్షసగణా న్రక్షోప సంహారిణీ.
తేజో రాజ్య విశేష మోహనకరీ భూతి స్సదా ధార్యతామ్ ॥





## తారలకు అధిపతులు - శాంతులు

**1. జన్మతార :** సామాన్యం, అధిపతి రవి, వాహనం నెమలి, దోషకాలం గం. 2-48 నిమిషములు. ఆకుకూర శాంతి.

**2. సంపత్తార :** కార్యజయం, అధిపతి బుధుడు, ద్రవ్యలాభం, సుఖశాంతులు. గుఱ్ఱం వాహనము.

**3. విపత్తార :** కార్యనాశనం, అధిపతి రాహువు. కలహం, మేక వాహనం, బెల్లం దానం శాంతి గం. 1-12 నిమిషములు దోషకాలము.

**4. క్షేమతార :** కుశలం. అధిపతి గురుడు, ధైర్యం, రాజ్యలాభం, సుఖశాంతులు, కార్యసిద్ధి, గజవాహనము.

**5. ప్రత్యక్తార :** కార్యహాని, అధిపతి కేతువు, మరణం, వాయస వాహనం, శాంతి : ఉప్పుదానం. దోషకాలం : గం. 3-12 నిమిషములు.

**6. సాధన తార :** కార్యసాధనం, అధిపతి చంద్రుడు, కీర్తి, సౌఖ్యం, ధనలాభం, నక్క వాహనము.

**7. నైధన తార :** నాశనం. అధిపతి శని, యుద్ధభయం, మరణం, వాహనం - సింహం, శాంతి: తిలసహిత సువర్ణదానము.

**8. మిత్రతార :** సుఖ సంపద, అధిపతి : శుక్రుడు, విశేష సౌఖ్యం, ధనలాభం, వాహనం - గరుడ.

**9. పరమిత్ర తార :** సుఖమును కలుగచేయుట, అధిపతి కుజుడు. ధనలాభం శ్రమమీద జయం. వాహనం - హంస.

1వ నవకమునందు జన్మతారయు, 2వ నవకములో విపత్తారయు, 3వ నవకమునందు ప్రత్యక్తారయు, మూడు నవకములందును నైధన తారయు పనికిరావు.

**జన్మ నక్షత్రమున చేయదగిన పనులు**

చెవులు కుట్టుట, అన్నప్రాశన, అక్షరాభ్యాసము, ఉపనయనము, నిషేకము, యాగము, పట్టాభిషేకము, వ్యవసాయము, భూ సంపాదన చేయవచ్చును.

**జన్మ నక్షత్రమున చేయరాని పనులు**

సీమంతము, పుంసవనం, పెండ్లి, గర్భాధానము, ప్రయాణము, క్షౌరము, ఔషధ సేవనము జన్మ నక్షత్రములో చేయరాదు.

**స్త్రీలు కుంకుమ ధరించునపుడు ధ్యానము**

శ్లో॥ ఓంకారపంజరశుకీం, ఉపనిషదుద్యాన కేళికలకంఠీమ్ ।
ఆగమవిపిన మయూరీ/మంతర్విభావయే గౌరీమ్ ॥

# దినాధిపతి - తారాబల - చంద్రబలము చూచు విధాన చక్రము

నిత్య నక్షత్రమునకు, జన్మ లేక నామ నక్షత్రమునకు ఎదురు గడిలో ఉన్న దినాధిపతిని, తెలుసుకొని, దినాధిపతి వద్ద మన్న అంకె ద్వారా తారాబలము తెలుసుకొనవలెను.

| పంచాంగములోని నక్షత్రములు → | జన్మనామ నక్షత్రము ↓ | | అశ్విని మఘ మూల | భరణి పూ.ఫల్గుని పూ.షాఢ | కృత్తిక ఉత్తర ఉ.షాఢ | రోహిణి హస్త శ్రవణ | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ.భాద్ర | పుష్యమి అనూరాధ ఉ.భాద్ర | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మఘ | మూల | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 |
| భర | పుబ్బ | పూ.షా. | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 |
| కృత్తి | ఉత్తర | ఉ.షా. | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 |
| రోహి | హస్త | శ్రవణ | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 |
| మృగ | చిత్త | ధని | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 |
| ఆర్ద్ర | స్వాతి | శత | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 |
| పున | విశాఖ | పూ.భా | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 |
| పుష్య | అనూ | ఉ.భా. | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 |
| ఆశ్రే | జ్యేష్ఠ | రేవ | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 |

**తారాబలం** : 1. జన్మతార, 2. సంపత్తార, 3. విపత్తార, 4. క్షేమతార, 5. ప్రత్యక్తార, 6. సాధనతార, 7. నైదనతార, 8. మిత్రతార, 9. పరమ మిత్ర తార. ఈ తొమ్మిదింటిలో 1, 3, 5, 7 మంచివి కావు. 2, 4, 6, 8, 9 మంచివి.

**చంద్రబలం** : శుక్ల పక్షములో చంద్రుడు - జన్మరాశికి 2-5-9 స్థానాలలోను, కృష్ణ పక్షములో 4-8-12 స్థానాలలోనూ, ఉభయ పక్షములందూ, 1-3-6-7-10-11 రాసులయందు ఉన్న చంద్రుడు బలవంతుడు.

ఏ నక్షత్రానికి ఆ నక్షత్రం ఏ గ్రహానికి ఆ గ్రహం అన్నీ మంచివే - ఏది ఉండే స్థానంలో అది ఉంటే



# వింశోత్తరీ దశాక్రమము

| → మహాదశలు | రవి 6 | చంద్ర 10 | కుజ 7 | రాహు 18 | గురు 16 | శని 19 | బుధ 17 | కేతు 7 | శుక్ర 20 | మొత్తము 120 సం॥ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| భుక్తుల వివరణ ↓ | కృత్తిక ఉత్తర ఉ.షా. | రోహిణి హస్త శ్రవణం | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ.భా. | పుష్యమి అనూరాధ ఉ.భా. | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి | అశ్విని మఘ మూల | భరణి పుబ్బ పూ.షా. | శాంతికై జప సంఖ్య |
| | నె రో | నె రో | నె రో | నె రో | నె రో | నె రో | నె రో | నె రో | | |
| 1. రవి | 3 18 | 6 0 | 4 6 | 10 24 | 9 18 | 11 12 | 10 6 | 4 6 | 12 0 | 7,000 |
| 2. చంద్ర | 6 0 | 10 0 | 7 0 | 18 0 | 16 0 | 19 0 | 17 0 | 7 0 | 20 0 | 11,000 |
| 3. కుజ | 4 6 | 7 0 | 4 27 | 12 18 | 11 6 | 13 9 | 11 27 | 4 27 | 14 0 | 10,000 |
| 4. రాహు | 10 24 | 18 0 | 12 18 | 32 12 | 28 24 | 34 6 | 30 18 | 12 18 | 36 0 | 18,000 |
| 5. గురు | 9 18 | 16 0 | 11 6 | 28 24 | 25 18 | 30 12 | 27 6 | 11 6 | 32 0 | 19,000 |
| 6. శని | 11 12 | 19 0 | 13 9 | 34 6 | 30 12 | 36 3 | 32 9 | 13 9 | 38 0 | 23,000 |
| 7. బుధ | 10 6 | 17 0 | 11 27 | 30 18 | 27 6 | 32 9 | 28 27 | 11 27 | 34 0 | 8,000 |
| 8. కేతు | 4 6 | 7 0 | 4 27 | 12 18 | 11 6 | 13 9 | 11 27 | 4 27 | 14 0 | 7,000 |
| 9. శుక్ర | 12 0 | 20 0 | 14 0 | 36 0 | 32 0 | 38 0 | 34 0 | 14 0 | 40 0 | 11,000 |

**నవరత్న ధారణ విధి :** రవి ప్రీతికై మధ్యను మాణిక్యమును, శుక్రునకుఁ దూర్పున వజ్రమును, చంద్రున కాగ్నేయమున ముత్యమును, కుజునకు దక్షిణమునఁ బ్రవాళమును రాహువునకు నైర్రుతిని గోమేధికమును, శనికి పశ్చిమమున ఇంద్రనీలమును, కేతువునకు వాయవ్యమున వైడూర్యమును, గురునకు యుత్తరమున పుష్యరాగమును, బుధునకు ఈశాన్యమున మరకతమును (గరుడపచ్చ) యథావిధిగఁ జేయించిన యంగుళీయకమును సదా ధరించుచుండిన గ్రహపీడలు తొలగి ఆయురారోగ్యైశ్వర్య ప్రాప్తి నొందుదురు.

శాస్త్రమంటే శాసించేదీ, శాశ్వతమైనది

## జనన శాంతి విషయములు

అశ్వి 1, భర 4, కృత్తిక 3, పుష్యమి 2-3, మఘ 3, ఉత్తర 1, ఉ.షా. 1, ఈ నక్షత్ర పాదములందు పురుషజననమైనచో పితృగండము, స్త్రీజననమైనచో మాతృగండము. అశ్విని 1, మఘ 2, రేవతి 4 ఈ నక్షత్రపాదములందు జన్మించిన శిశువునకు బాలారిష్టము. హస్త 3, చిత్త 1-2, పూషా 3, రోహిణి 1-2 పాదములు తల్లికిని మేనమామకును గండములు. రోహిణీ నక్షత్రమునందు సాధారణముగ మేనమామకు గండము. 1-2 పాదములు తల్లికిని, 3-4 పాదములు మేనమామకు గండమును సూచించును. ఆశ్లేష 2వ పాదము శిశువునకు, 3వ పాదము తల్లికిని, 4వ పాదము తండ్రికిని గండము. విశాఖలో పురుషజన్మయైన మేనమామకు, స్త్రీజన్మయైన పినతండ్రికి అరిష్టము. జ్యేష్ఠా నక్షత్రము మిక్కిలి అరిష్టప్రదమయినది. 3-4 పాదములు విశేషముగా దుష్ఫలము నిచ్చును. మూల 1వ పాదము తండ్రికిని, 2వ పాదము తల్లికిని గండము.

జన్మలగ్నమునకు రవి 5ట, చంద్రుడు 8ట, అంగారకుడు 7ట, బుధుడు 4ట, గురువు 3ట, శని లగ్నమున రాహువు 9ట, కేతువు 1టను ఉన్నచో బాలారిష్టము కలుగును. మఱియు లగ్నసంధులలో, అనగా కర్కట వృశ్చిక మీనరాసులందు చివరి అర్ధభాగలో జననమైనచో, శిశువునకు ప్రబల గండము. బాలారిష్టము ఒక 'బృహస్పతి భగణము' లేక 12 సంవత్సరములుండును.

దుష్ట నక్షత్రమున శిశువు జన్మించిన యెడల నవగ్రహ జపము, రుద్రాభిషేకము, మృత్యుంజయ జపము, దానములు శాస్త్రోక్తవిధిగా చేసినచో బాలారిష్టము తొలగి శిశువునకు పూర్ణాయువు కలుగును. శిశువునకు 21వ రోజున మాయలలో వేయవలెను.

## ప్రథమ రజస్వలకు ఫలము

చవితి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి, అమావాస్య - ఈ తిథులందును, ఆది మంగళ శని వారములందును, భరణి కృత్తి ఆర్ద్ర పుబ్బ చిత్త జ్యేష్ఠ పూషా పూభా నక్షత్రములందును ప్రథమ రజస్వల యైనచో శాంతి చేయవలయును. విష్కంభ, అతిగండ, శూల, గండ, వ్యాఘాత్ర, వజ్ర, వ్యతీపాత, పరిఘ, వైధృతి యోగములందును; బవ, గరజి, విష్టి, శకుని, చతుష్పద, కింస్తుఘ్న కరణములందును రజస్వలయైన శాంతి గావింపవలయును. అపరాహ్ణము, సాయంకాలము, సంధ్యలందును, అర్ధరాత్రి, నిశాంత సమయమందును; గ్రామ బహిఃప్రదేశములందును, పరగృహములందును మంచిది కాదు. జీర్ణ మలిన వస్త్రములు, రక్తవస్త్రము, నల్లనివస్త్రములు ధరించినను, దిగంబరియై యున్నను అశుభము. మేష, కర్కట, వృశ్చిక, ధను: పూర్వార్ధ, మకర లగ్నములు మంచివి కావు. యధావిధిగా శాంతి చేయవలెను.





## నక్షత్ర రాశి గణకూటాది చక్రమ్

| నక్షత్రములు | రాశి | వర్ణం | వశ్యం | యోని | గణం | నాడి | రాశీశః | ద్రవ్యం |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మేష | క్షత్రి | చతు | అశ్వ | దేవ | ఆది | కుజ | స్వర్ణ |
| భర | మేష | క్షత్రి | చతు | గజ | మను | మధ్య | కుజ | " |
| కృత్తి 1పా | మేష | క్షత్రి | చతు | మేక | రాక్ష | అంత్య | కుజ | " |
| కృత్తి 2-3-4 | వృష | వైశ్య | చతు | మేక | రాక్ష | అంత్య | శుక్ర | " |
| రోహి | వృష | వైశ్య | చతు | సర్ప | మను | అంత్య | శుక్ర | " |
| మృగ 1-2 | వృష | వైశ్య | చతు | సర్ప | దేవ | మధ్య | శుక్ర | " |
| మృగ 3-4 | మిథు | శూద్ర | మను | సర్ప | దేవ | మధ్య | బుధ | " |
| ఆర్ద్ర | మిథు | శూద్ర | మను | శునక | మను | ఆది | బుధ | రజత |
| పున 1-2-3 | మిథు | శూద్ర | మను | మార్జా | దేవ | ఆది | బుధ | " |
| పున 4వ పా॥ | కర్కా | బ్రాహ్మ | జలచర | మార్జా | దేవ | ఆది | చంద్ర | " |
| పుష్య | కర్కా | బ్రాహ్మ | జలచర | మేక | దేవ | మధ్య | చంద్ర | " |
| ఆశ్రే | కర్కా | బ్రాహ్మ | జలచర | మార్జా | రాక్ష | అంత్య | చంద్ర | " |
| మఘ | సింహ | క్షత్రి | చతు | మూష | రాక్ష | అంత్య | రవి | " |
| పూ.ఫ. | సింహ | క్షత్రి | చతు | మూష | మను | మధ్య | రవి | " |
| ఉఫ 1 పా॥ | సింహ | క్షత్రి | చతు | గోవు | మను | ఆది | రవి | " |
| ఉఫ 2-3-4 | కన్య | వైశ్య | మను | గోవు | మను | ఆది | బుధ | " |
| హస్త | కన్య | వైశ్య | మను | దున్న | దేవ | ఆది | బుధ | " |
| చిత్ర 1-2 పా | కన్య | వైశ్య | మను | వ్యాఘ్ర | రాక్ష | మధ్య | బుధ | " |
| చిత్ర 3-4 పా | తుల | శూద్ర | మను | వ్యాఘ్ర | రాక్ష | మధ్య | శుక్ర | " |
| స్వాతి | తుల | శూద్ర | మను | దున్న | దేవ | అంత్య | శుక్ర | " |
| విశా 1-2-3 | తుల | శూద్ర | మను | వ్యాఘ్ర | రాక్ష | అంత్య | శుక్ర | లోహ |
| విశా 4వ పా | వృశ్చి | బ్రాహ్మ | కీట | వ్యాఘ్ర | రాక్ష | అంత్య | కుజ | " |
| అనూ | వృశ్చి | బ్రాహ్మ | కీట | లేడి | దేవ | మధ్య | కుజ | " |
| జ్యేష్ఠ | వృశ్చి | బ్రాహ్మ | కీట | లేడి | రాక్ష | ఆది | కుజ | " |
| మూల | ధను | క్షత్రి | మను | శునక | రాక్ష | ఆది | గురు | " |
| పూ.షా. | ధను | క్షత్రి | చతు | వానర | మను | మధ్య | గురు | తామ్ర |
| ఉషా 1వ పా॥ | ధను | క్షత్రి | చతు | ముంగిస | మను | అంత్య | గురు | " |
| ఉషా 2-3-4 | మకర | వైశ్య | చతు | ముంగిస | మను | అంత్య | శని | " |
| శ్రవ | మకర | వైశ్య | చతు | వానర | దేవ | అంత్య | శని | " |
| ధని 1-2 | మకర | వైశ్య | జలచర | సింహ | రాక్ష | మధ్య | శని | " |
| ధని 3-4 | కుంభ | శూద్ర | మను | సింహ | రాక్ష | మధ్య | శని | " |
| శత | కుంభ | శూద్ర | మను | అశ్వ | రాక్ష | ఆది | శని | " |
| పూ.భా. 1-2-3 | కుంభ | శూద్ర | మను | సింహ | మను | ఆది | శని | " |
| పూ.భా.4వ పా | మీన | బ్రాహ్మ | మను | సింహ | మను | ఆది | గురు | " |
| ఉ.భా. | మీన | బ్రాహ్మ | జలచర | గోవు | మను | మధ్య | గురు | " |
| రేవ | మీన | బ్రాహ్మ | జలచర | గజ | దేవ | అంత్య | గురు | స్వర్ణ |

**నూతన వధువు :** నూతన వధువు ఆషాఢ మాసమున అత్తవారింట నున్నచో తానే మరణించును. జ్యేష్ఠమాసమున బావకు, పుష్యమాసమున మామకు, అధిక మాసమున పతికి గండము. నూతన వధువు చైత్రమాసమున పుట్టింటిలో నున్నచో తండ్రికి గండము. ఇతర మాసములు శుభప్రదములు.

## తారాబలము చూచు విధము

జన్మ నక్షత్రము మొదలు, నిత్య నక్షత్రము వఱకు లెక్కించి, 9చే భాగింపగా శేషము 1. జన్మతార, 2. సంపత్తార, 3. విపత్తార, 4. క్షేమ తార, 5. ప్రత్యక్ తార, 6. సాధన తార, 7. నైధన తార, 8. మిత్ర తార, 9. పరమ మైత్రతార. జన్మ, విపత్, ప్రత్యక్, నైధన తారలు అశుభకరములు. జన్మతారకు శాకమును, విపత్తారకు గుడమును, ప్రత్యక్ తారకు లవణమును, నైధన తారకు తిలసహిత హిరణ్యదానమును చేసినచో శుభకరమగును.

**అక్షర సంధిగల పేర్లు :** కృష్ణ - మృగ 3, హృష్ణ - స్వాతి 1, శ్రీధర - చిత్త 4, క్షేత్రపాల - హస్త 2, జ్ఞాన - ఆర్ద్ర 3, భీమ - మూల 4, భైరవ - పూ.షా. 3, బ్రహ్మ - చిత్త 3, ప్రభాకర - చిత్త 4, ద్రోణ, ద్రౌపది - స్వాతి 3, ఫణి - ఉ.ఫ. 3.

## వివాహ విషయమై ఏకర్క్ష దోషము

సాధారణముగా వధూవరుల జన్మనక్షత్రములు ఒకటే అగుట దోషము. అయితే, యీ క్రింది నక్షత్రములకు ఏకర్క్ష (ఒకే నక్షత్ర) దోషము లేదు :

రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, మఘ, విశాఖ, శ్రవణ, ఉత్తరాభాద్ర, రేవతి.

వధూవరులకు ఏక నక్షత్రమై రాశి భేదమున్నను, ఏకరాశియై యుండి భిన్న నక్షత్రములైనను శుభము.

## కుజ దోషము

శ్లో॥ ధనే వ్యయే చ పాతాళే, జామిత్రే చాఽష్టమే కుజే ।
స్త్రీణాం భర్తృ వినాశాయ, పుంసాం భార్యా వినాశనమ్ ॥

వధూవరుల జన్మలగ్నములకు కుజుడు 2, 12, 4, 7, 8 స్థానములలో నున్నచో "కుజ దోషము". ఇద్దఱకు కుజదోషమున్నచో వివాహము చేయవచ్చును. అథవా, ఒకరికే ఉన్నచో, తక్కిన వారికి మరణభయము చెప్పబడినది. కదాచిత్తు, కుజునకు గురు దృగ్యోగములున్నచో, దోషము లేదు.

శ్లో ॥ బద్ధపృష్ఠ శిరోగ్రీవః, స్తబ్ధదృష్టి రధోముఖః ।
కష్టేన లిఖితం గ్రంథ మాద్రియతాం తు సజ్జనాః ॥ అ.కృ.శ.



4. **గరుడపచ్చ :** బుధుని నక్షత్రములు, లగ్నములలోను, బుధవారమునాడు, 5-14-23 తేదీలలోను పుట్టినవారు పచ్చలను ధరించవలెను.

5. **పుష్యరాగము :** బృహస్పతి నక్షత్రములు, లగ్నములలోను, పుష్యమిలోను, గురువారము నాడు, 3-12-21-30 తేదీలలోను, గురువు 1-5-9 స్థానములలోను, గురుపూర్ణమి రోజునను పుట్టినవారు, వేదశాస్త్రములను చదివిన వారును, ఆచారవంతులు, సత్యధర్మపరాయణులును యీ రత్నమును ధరింపవలెను.

6. **వజ్రము :** శుక్రుని నక్షత్రములలోను, లగ్నములలోను, శుక్రవారమునాడు, 6-15-24 తేదీలలోను, శుక్రోదయ కాలమునందును, శుక్రమౌఢ్యము లేని కాలమందును జన్మించినవారు, కవులు, గాయకులు, నాట్యశాస్త్రవేత్తలు, సౌందర్యవంతులును యీ రత్నమును ధరించవలెను.

7. **నీలము :** సాధారణముగా నీలమణి అదృష్టమునివ్వదు. అయినను, శని నక్షత్రములు లగ్నములలోను, శనివారము నాడు, 8-17-26 తేదీలలోను శని ఉషస్సులోను, శని ప్రదోషకాలములోను, శని ఆయుః స్థానములోను, శనిత్రయోదశినాడును పుట్టినవారి రత్నమును ధరించుట మంచిది.

8. **గోమేధికము :** రాహు నక్షత్రములలోను, రాహుకాలములోను, సింహరాశిలో రాహు వుండగాను, దశమములో రాహువుండగాను, 4-13-22-31 తేదీలలోను పుట్టినవారు గోమేధికరత్నమును ధరించవచ్చును.

9. **వైడూర్యము :** కేతు నక్షత్రములలోను, కేతువు లాభముననుండగాను, 9-18-27 తేదీలలోను పుట్టినవారి రత్నమును ధరించవలెను.

నవగ్రహముల ప్రీతి కొఱకు, ఆయా గ్రహములకు చెప్పఁబడిన మంత్రజపములు, హోమములు చేయించి, సంతర్పణము చేసి, నవరత్నములను దానము చేయవలెనని శాస్త్రములో చెప్పఁబడినది గాని, ఆ రత్నములను ధరించవలెనని యెచ్చటను గానరాదు. ఐనను, రత్నపుటుంగరములను ధరించుట తప్పుగాదు.

వెనుక చెప్పినట్లు నవరత్నపుటుంగరమును గాని, వారి జాతకరీత్యా ఒక్క రత్నమును గాని బంగారముతో చేయించి ధరించవలెను. రత్నపుటుంగరము నందు ఆయా గ్రహదేవతల నావాహనచేసి, పూజా-జప-దానములు సలిపి ఉంగరమును ధరించినచో మేలు కలుగును. అవి చేయింపక, వట్టిగా ధరించినచో నిష్ఫలమగునని తెలియవలెను.

(వారివారి జాతకరీత్యా ఏ ఉంగరము ధరించవలెనో తెలియగోరువారు, పంచాంగకర్తను సంప్రదించవచ్చును.)

## VIMSOTTARI DASA AND ANTARDASA

| Antardasa | Sun (Ravi)—6 | | | | | | Moon (Chandra)—10 | | | | | | Mars (Mangala)—7 | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | Sub Periods | | | Total | | | Sub Periods | | | Total | | | Sub Periods | | | Total | | |
| | *y* | *m* | *d* | *y* | *m* | *d* | *y* | *m* | *d* | *y* | *m* | *d* | *y* | *m* | *d* | *y* | *m* | *d* |
| Sun | 0 | 3 | 18 | 0 | 3 | 18 | | — | | | — | | | — | | | — | |
| Moon | 0 | 6 | 0 | 0 | 9 | 18 | 0 | 10 | 0 | 0 | 10 | 0 | | — | | | — | |
| Mars | 0 | 4 | 6 | 1 | 1 | 24 | 0 | 7 | 0 | 1 | 5 | 0 | 0 | 4 | 27 | 0 | 4 | 27 |
| Rahu | 0 | 10 | 24 | 2 | 0 | 18 | 1 | 6 | 0 | 2 | 11 | 0 | 1 | 0 | 18 | 1 | 5 | 15 |
| Jupiter | 0 | 9 | 18 | 2 | 10 | 6 | 1 | 4 | 0 | 4 | 3 | 0 | 0 | 11 | 6 | 2 | 4 | 21 |
| Saturn | 0 | 11 | 12 | 3 | 9 | 18 | 1 | 7 | 0 | 5 | 10 | 0 | 1 | 1 | 9 | 3 | 6 | 0 |
| Mercury | 0 | 10 | 6 | 4 | 7 | 24 | 1 | 5 | 0 | 7 | 3 | 0 | 0 | 11 | 27 | 4 | 5 | 27 |
| Ketu | 0 | 4 | 6 | 5 | 0 | 0 | 0 | 7 | 0 | 7 | 10 | 0 | 0 | 4 | 27 | 4 | 10 | 24 |
| Venus | 1 | 0 | 0 | 6 | 0 | 0 | 1 | 8 | 0 | 9 | 6 | 0 | 1 | 2 | 0 | 6 | 0 | 24 |
| Sun | | — | | | — | | 0 | 6 | 0 | 10 | 0 | 0 | 0 | 4 | 6 | 6 | 5 | 0 |
| Moon | | — | | | — | | | — | | | — | | 0 | 7 | 0 | 7 | 0 | 0 |

| Antardasa | Rahu—18 | | | | | | Jupiter (Brihaspati)—16 | | | | | | Saturn (Sani)—19 | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | Sub Periods | | | Total | | | Sub Periods | | | Total | | | Sub Periods | | | Total | | |
| | *y* | *m* | *d* | *y* | *m* | *d* | *y* | *m* | *d* | *y* | *m* | *d* | *y* | *m* | *d* | *y* | *m* | *d* |
| Rahu | 2 | 8 | 12 | 2 | 8 | 12 | | — | | | — | | | — | | | — | |
| Jupiter | 2 | 4 | 24 | 5 | 1 | 6 | 2 | 1 | 18 | 2 | 1 | 18 | | — | | | — | |
| Saturn | 2 | 10 | 6 | 7 | 11 | 12 | 2 | 6 | 12 | 4 | 8 | 0 | 3 | 0 | 3 | 3 | 0 | 3 |
| Mercury | 2 | 6 | 18 | 10 | 6 | 0 | 2 | 3 | 6 | 6 | 11 | 6 | 2 | 8 | 9 | 5 | 8 | 12 |
| Ketu | 1 | 0 | 18 | 11 | 6 | 18 | 0 | 11 | 6 | 7 | 10 | 12 | 1 | 1 | 9 | 6 | 9 | 21 |
| Venus | 3 | 0 | 0 | 14 | 6 | 18 | 2 | 8 | 0 | 10 | 6 | 12 | 3 | 2 | 0 | 9 | 11 | 21 |
| Sun | 0 | 10 | 24 | 15 | 5 | 12 | 0 | 9 | 18 | 11 | 4 | 0 | 0 | 11 | 12 | 10 | 11 | 3 |
| Moon | 1 | 6 | 0 | 16 | 11 | 12 | 1 | 4 | 0 | 12 | 8 | 0 | 1 | 7 | 0 | 12 | 6 | 3 |
| Mars | 1 | 0 | 18 | 18 | 0 | 0 | 0 | 11 | 6 | 13 | 7 | 6 | 1 | 1 | 9 | 13 | 7 | 12 |
| Rahu | | — | | | — | | 2 | 4 | 24 | 16 | 0 | 0 | 2 | 10 | 6 | 16 | 5 | 18 |
| Jupiter | | — | | | — | | | — | | | — | | 2 | 6 | 12 | 19 | 0 | 0 |

| Antardasa | Mercury (Budha)—17 | | | | | | Ketu—7 | | | | | | Venus (Sukra)—20 | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | Sub Periods | | | Total | | | Sub Periods | | | Total | | | Sub Periods | | | Total | | |
| | *y* | *m* | *d* | *y* | *m* | *d* | *y* | *m* | *d* | *y* | *m* | *d* | *y* | *m* | *d* | *y* | *m* | *d* |
| Mercury | 2 | 4 | 27 | 2 | 4 | 27 | | — | | | — | | | — | | | — | |
| Ketu | 0 | 11 | 27 | 3 | 4 | 24 | 0 | 4 | 27 | 0 | 4 | 27 | | — | | | — | |
| Venus | 2 | 10 | 0 | 6 | 2 | 24 | 1 | 2 | 0 | 1 | 6 | 27 | 3 | 4 | 0 | 3 | 4 | 0 |
| Sun | 0 | 10 | 6 | 7 | 1 | 0 | 0 | 4 | 6 | 1 | 11 | 3 | 1 | 0 | 0 | 4 | 4 | 0 |
| Moon | 1 | 5 | 0 | 8 | 6 | 0 | 0 | 7 | 0 | 2 | 6 | 3 | 1 | 8 | 0 | 6 | 0 | 0 |
| Mars | 0 | 11 | 27 | 9 | 5 | 27 | 0 | 4 | 27 | 2 | 11 | 0 | 1 | 2 | 0 | 7 | 2 | 0 |
| Rahu | 2 | 6 | 18 | 12 | 0 | 15 | 1 | 0 | 18 | 3 | 11 | 18 | 3 | 0 | 0 | 10 | 2 | 0 |
| Jupiter | 2 | 3 | 6 | 14 | 3 | 21 | 0 | 11 | 6 | 4 | 10 | 24 | 2 | 8 | 0 | 12 | 10 | 0 |
| Saturn | 2 | 8 | 9 | 17 | 0 | 0 | 1 | 1 | 9 | 6 | 0 | 3 | 3 | 2 | 0 | 16 | 0 | 0 |
| Mercury | | — | | | — | | 0 | 11 | 27 | 7 | 0 | 0 | 2 | 10 | 0 | 18 | 10 | 0 |
| Ketu | | — | | | — | | | — | | | — | | 1 | 2 | 0 | 20 | 0 | 0 |



## Balance of Vimsottari Dasa by Longitude of Moon

| Long. of Moon | | Moon in Mesha Simha, Dhanus | | | | Moon in Vrisha Kanya, Makara | | | | Moon in Mithuna Tula, Kumbha | | | | Moon in Karkata Vrischika, Mina | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ° | ′ | | *y* | *m* | *d* | | *y* | *m* | *d* | | *y* | *m* | *d* | | *y* | *m* | *d* |
| 0 | 0 | **Ketu** | 7 | 0 | 0 | **Sun** | 4 | 6 | 0 | **Mars** | 3 | 6 | 0 | **Jupiter** | 4 | 0 | 0 |
| 0 | 20 | | 6 | 9 | 27 | | 4 | 4 | 6 | | 3 | 3 | 27 | | 3 | 7 | 6 |
| 0 | 40 | | 6 | 7 | 24 | | 4 | 2 | 12 | | 3 | 1 | 24 | | 3 | 2 | 12 |
| 1 | 0 | | 6 | 5 | 21 | | 4 | 0 | 18 | | 2 | 11 | 21 | | 2 | 9 | 18 |
| 1 | 20 | | 6 | 3 | 18 | | 3 | 10 | 24 | | 2 | 9 | 18 | | 2 | 4 | 24 |
| 1 | 40 | | 6 | 1 | 15 | | 3 | 9 | 0 | | 2 | 7 | 15 | | 2 | 0 | 0 |
| 2 | 0 | | 5 | 11 | 12 | | 3 | 7 | 6 | | 2 | 5 | 12 | | 1 | 7 | 6 |
| 2 | 20 | | 5 | 9 | 9 | | 3 | 5 | 12 | | 2 | 3 | 9 | | 1 | 2 | 12 |
| 2 | 40 | | 5 | 7 | 6 | | 3 | 3 | 18 | | 2 | 1 | 6 | | 0 | 9 | 18 |
| 3 | 0 | | 5 | 5 | 3 | | 3 | 1 | 24 | | 1 | 11 | 3 | | 0 | 4 | 24 |
| 3 | 20 | | 5 | 3 | 0 | | 3 | 0 | 0 | | 1 | 9 | 0 | **Saturn** | 19 | 0 | 0 |
| 3 | 40 | | 5 | 0 | 27 | | 2 | 10 | 6 | | 1 | 6 | 27 | | 18 | 6 | 9 |
| 4 | 0 | | 4 | 10 | 24 | | 2 | 8 | 12 | | 1 | 4 | 24 | | 18 | 0 | 18 |
| 4 | 20 | | 4 | 8 | 21 | | 2 | 6 | 18 | | 1 | 2 | 21 | | 17 | 6 | 27 |
| 4 | 40 | | 4 | 6 | 18 | | 2 | 4 | 24 | | 1 | 0 | 18 | | 17 | 1 | 6 |
| 5 | 0 | | 4 | 4 | 15 | | 2 | 3 | 0 | | 0 | 10 | 15 | | 16 | 7 | 15 |
| 5 | 20 | | 4 | 2 | 12 | | 2 | 1 | 6 | | 0 | 8 | 12 | | 16 | 1 | 24 |
| 5 | 40 | | 4 | 0 | 9 | | 1 | 11 | 12 | | 0 | 6 | 9 | | 15 | 8 | 3 |
| 6 | 0 | | 3 | 10 | 6 | | 1 | 9 | 18 | | 0 | 4 | 6 | | 15 | 2 | 12 |
| 6 | 20 | | 3 | 8 | 3 | | 1 | 7 | 24 | | 0 | 2 | 3 | | 14 | 8 | 21 |
| 6 | 40 | | 3 | 6 | 0 | | 1 | 6 | 0 | **Rahu** | 18 | 0 | 0 | | 14 | 3 | 0 |
| 7 | 0 | | 3 | 3 | 27 | | 1 | 4 | 6 | | 17 | 6 | 18 | | 13 | 9 | 9 |
| 7 | 20 | | 3 | 1 | 24 | | 1 | 2 | 12 | | 17 | 1 | 6 | | 13 | 3 | 18 |
| 7 | 40 | | 2 | 11 | 21 | | 1 | 0 | 18 | | 16 | 7 | 24 | | 12 | 9 | 27 |
| 8 | 0 | | 2 | 9 | 18 | | 0 | 10 | 24 | | 16 | 2 | 12 | | 12 | 4 | 6 |
| 8 | 20 | | 2 | 7 | 15 | | 0 | 9 | 0 | | 15 | 9 | 0 | | 11 | 10 | 15 |
| 8 | 40 | | 2 | 5 | 12 | | 0 | 7 | 6 | | 15 | 3 | 18 | | 11 | 4 | 24 |
| 9 | 0 | | 2 | 3 | 9 | | 0 | 5 | 12 | | 14 | 10 | 6 | | 10 | 11 | 3 |
| 9 | 20 | | 2 | 1 | 6 | | 0 | 3 | 18 | | 14 | 4 | 24 | | 10 | 5 | 12 |
| 9 | 40 | | 1 | 11 | 3 | | 0 | 1 | 24 | | 13 | 11 | 12 | | 9 | 11 | 21 |
| 10 | 0 | | 1 | 9 | 0 | **Moon** | 10 | 0 | 0 | | 13 | 6 | 0 | | 9 | 6 | 0 |
| 10 | 20 | | 1 | 6 | 27 | | 9 | 9 | 0 | | 13 | 0 | 18 | | 9 | 0 | 9 |
| 10 | 40 | | 1 | 4 | 24 | | 9 | 6 | 0 | | 12 | 7 | 6 | | 8 | 6 | 18 |
| 11 | 0 | | 1 | 2 | 21 | | 9 | 3 | 0 | | 12 | 1 | 24 | | 8 | 0 | 27 |
| 11 | 20 | | 1 | 0 | 18 | | 9 | 0 | 0 | | 11 | 8 | 12 | | 7 | 7 | 6 |
| 11 | 40 | | 0 | 10 | 15 | | 8 | 9 | 0 | | 11 | 3 | 0 | | 7 | 1 | 15 |
| 12 | 0 | | 0 | 8 | 12 | | 8 | 6 | 0 | | 10 | 9 | 18 | | 6 | 7 | 24 |
| 12 | 20 | | 0 | 6 | 9 | | 8 | 3 | 0 | | 10 | 4 | 6 | | 6 | 2 | 3 |
| 12 | 40 | | 0 | 4 | 6 | | 8 | 0 | 0 | | 9 | 10 | 24 | | 5 | 8 | 12 |
| 13 | 0 | | 0 | 2 | 3 | | 7 | 9 | 0 | | 9 | 5 | 12 | | 5 | 2 | 21 |
| 13 | 20 | **Venus** | 20 | 0 | 0 | | 7 | 6 | 0 | | 9 | 0 | 0 | | 4 | 9 | 0 |
| 13 | 40 | | 19 | 6 | 0 | | 7 | 3 | 0 | | 8 | 6 | 18 | | 4 | 3 | 9 |
| 14 | 0 | | 19 | 0 | 0 | | 7 | 0 | 0 | | 8 | 1 | 6 | | 3 | 9 | 18 |
| 14 | 20 | | 18 | 6 | 0 | | 6 | 9 | 0 | | 7 | 7 | 24 | | 3 | 3 | 27 |
| 14 | 40 | | 18 | 0 | 0 | | 6 | 6 | 0 | | 7 | 2 | 12 | | 2 | 10 | 6 |
| 15 | 0 | | 17 | 6 | 0 | | 6 | 3 | 0 | | 6 | 9 | 0 | | 2 | 4 | 15 |
| 15 | 20 | | 17 | 0 | 0 | | 6 | 0 | 0 | | 6 | 3 | 18 | | 1 | 10 | 24 |
| 15 | 40 | | 16 | 6 | 0 | | 5 | 9 | 0 | | 5 | 10 | 6 | | 1 | 5 | 3 |
| 16 | 0 | | 16 | 0 | 0 | | 5 | 6 | 0 | | 5 | 4 | 24 | | 0 | 11 | 12 |
| 16 | 20 | | 15 | 6 | 0 | | 5 | 3 | 0 | | 4 | 11 | 12 | | 0 | 5 | 21 |
| 16 | 40 | | 15 | 0 | 0 | | 5 | 0 | 0 | | 4 | 6 | 0 | **Mercury** | 17 | 0 | 0 |
| 17 | 0 | | 14 | 6 | 0 | | 4 | 9 | 0 | | 4 | 0 | 18 | | 16 | 6 | 27 |
| 17 | 20 | | 14 | 0 | 0 | | 4 | 6 | 0 | | 3 | 7 | 6 | | 16 | 1 | 24 |
| 17 | 40 | | 13 | 6 | 0 | | 4 | 3 | 0 | | 3 | 1 | 24 | | 15 | 8 | 21 |
| 18 | 0 | | 13 | 0 | 0 | | 4 | 0 | 0 | | 2 | 8 | 12 | | 15 | 3 | 18 |
| 18 | 20 | | 12 | 6 | 0 | | 3 | 9 | 0 | | 2 | 3 | 0 | | 14 | 10 | 15 |
| 18 | 40 | | 12 | 0 | 0 | | 3 | 6 | 0 | | 1 | 9 | 18 | | 14 | 5 | 12 |
| 19 | 0 | | 11 | 6 | 0 | | 3 | 3 | 0 | | 1 | 4 | 6 | | 14 | 0 | 9 |

**Balance of Vimsottari Dasa by Longitude of Moon—contd.**

| Long. of Moon | | Moon in Mesha Simha, Dhanus | | | | Moon in Vrisha Kanya, Makara | | | | Moon in Mithuna Tula, Kumbha | | | | Moon in Karkata Vrischika, Mina | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ° | | | y | m | d | | y | m | d | | y | m | d | | y | m | d |
| 19 | 0 | **Venus** | 11 | 6 | 0 | **Moon** | 3 | 3 | 0 | **Rahu** | 1 | 4 | 6 | **Merc.** | 14 | 0 | 9 |
| 19 | 20 | | 11 | 0 | 0 | | 3 | 0 | 0 | | 0 | 10 | 24 | | 13 | 7 | 6 |
| 19 | 40 | | 10 | 6 | 0 | | 2 | 9 | 0 | | 0 | 5 | 12 | | 13 | 2 | 3 |
| 20 | 0 | | 10 | 0 | 0 | | 2 | 6 | 0 | **Jupiter** | 16 | 0 | 0 | | 12 | 9 | 0 |
| 20 | 20 | | 9 | 6 | 0 | | 2 | 3 | 0 | | 15 | 7 | 6 | | 12 | 3 | 27 |
| 20 | 40 | | 9 | 0 | 0 | | 2 | 0 | 0 | | 15 | 2 | 12 | | 11 | 10 | 24 |
| 21 | 0 | | 8 | 6 | 0 | | 1 | 9 | 0 | | 14 | 9 | 18 | | 11 | 5 | 21 |
| 21 | 20 | | 8 | 0 | 0 | | 1 | 6 | 0 | | 14 | 4 | 24 | | 11 | 0 | 18 |
| 21 | 40 | | 7 | 6 | 0 | | 1 | 3 | 0 | | 14 | 0 | 0 | | 10 | 7 | 15 |
| 22 | 0 | | 7 | 0 | 0 | | 1 | 0 | 0 | | 13 | 7 | 6 | | 10 | 2 | 12 |
| 22 | 20 | | 6 | 6 | 0 | | 0 | 9 | 0 | | 13 | 2 | 12 | | 9 | 9 | 9 |
| 22 | 40 | | 6 | 0 | 0 | | 0 | 6 | 0 | | 12 | 9 | 18 | | 9 | 4 | 6 |
| 23 | 0 | | 5 | 6 | 0 | | 0 | 3 | 0 | | 12 | 4 | 24 | | 8 | 11 | 3 |
| 23 | 20 | | 5 | 0 | 0 | **Mars** | 7 | 0 | 0 | | 12 | 0 | 0 | | 8 | 6 | 0 |
| 23 | 40 | | 4 | 6 | 0 | | 6 | 9 | 27 | | 11 | 7 | 6 | | 8 | 0 | 27 |
| 24 | 0 | | 4 | 0 | 0 | | 6 | 7 | 24 | | 11 | 2 | 12 | | 7 | 7 | 24 |
| 24 | 20 | | 3 | 6 | 0 | | 6 | 5 | 21 | | 10 | 9 | 18 | | 7 | 2 | 21 |
| 24 | 40 | | 3 | 0 | 0 | | 6 | 3 | 18 | | 10 | 4 | 24 | | 6 | 9 | 18 |
| 25 | 0 | | 2 | 6 | 0 | | 6 | 1 | 15 | | 10 | 0 | 0 | | 6 | 4 | 15 |
| 25 | 20 | | 2 | 0 | 0 | | 5 | 11 | 12 | | 9 | 7 | 6 | | 5 | 11 | 12 |
| 25 | 40 | | 1 | 6 | 0 | | 5 | 9 | 9 | | 9 | 2 | 12 | | 5 | 6 | 9 |
| 26 | 0 | | 1 | 0 | 0 | | 5 | 7 | 6 | | 8 | 9 | 18 | | 5 | 1 | 6 |
| 26 | 20 | | 0 | 6 | 0 | | 5 | 5 | 3 | | 8 | 4 | 24 | | 4 | 8 | 3 |
| 26 | 40 | **Sun** | 6 | 0 | 0 | | 5 | 3 | 0 | | 8 | 0 | 0 | | 4 | 3 | 0 |
| 27 | 0 | | 5 | 10 | 6 | | 5 | 0 | 27 | | 7 | 7 | 6 | | 3 | 9 | 27 |
| 27 | 20 | | 5 | 8 | 12 | | 4 | 10 | 24 | | 7 | 2 | 12 | | 3 | 4 | 24 |
| 27 | 40 | | 5 | 6 | 18 | | 4 | 8 | 21 | | 6 | 9 | 18 | | 2 | 11 | 21 |
| 28 | 0 | | 5 | 4 | 24 | | 4 | 6 | 18 | | 6 | 4 | 24 | | 2 | 6 | 18 |
| 28 | 20 | | 5 | 3 | 0 | | 4 | 4 | 15 | | 6 | 0 | 0 | | 2 | 1 | 15 |
| 28 | 40 | | 5 | 1 | 6 | | 4 | 2 | 12 | | 5 | 7 | 6 | | 1 | 8 | 12 |
| 29 | 0 | | 4 | 11 | 12 | | 4 | 0 | 9 | | 5 | 2 | 12 | | 1 | 3 | 9 |
| 29 | 20 | | 4 | 9 | 18 | | 3 | 10 | 6 | | 4 | 9 | 18 | | 0 | 10 | 6 |
| 29 | 40 | | 4 | 7 | 24 | | 3 | 8 | 3 | | 4 | 4 | 24 | | 0 | 5 | 3 |
| 30 | 0 | | 4 | 6 | 0 | | 3 | 6 | 0 | | 4 | 0 | 0 | | 0 | 0 | 0 |

**PROPORTIONAL PARTS FOR DASA OF PLANETS**

(To be subtracted from the balance of *dasa* for increase by minutes of the longitude of Moon)

| | Ketu (7y) | | Venus (20y) | | Sun (6y) | | Moon (10y) | | Mars (7y) | | Rahu (18y) | | Jupiter (16y) | | Saturn (19y) | | Merc. (17y) | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | m | d | m | d | m | d | m | d | m | d | m | d | m | d | m | d | m | d | |
| 1 | 0 | 3 | 0 | 9 | 0 | 3 | 0 | 5 | 0 | 3 | 0 | 8 | 0 | 7 | 0 | 9 | 0 | 8 | 1 |
| 2 | 0 | 6 | 0 | 18 | 0 | 5 | 0 | 9 | 0 | 6 | 0 | 16 | 0 | 14 | 0 | 17 | 0 | 15 | 2 |
| 3 | 0 | 9 | 0 | 27 | 0 | 8 | 0 | 14 | 0 | 9 | 0 | 24 | 0 | 22 | 0 | 26 | 0 | 23 | 3 |
| 4 | 0 | 13 | 1 | 6 | 0 | 11 | 0 | 18 | 0 | 13 | 1 | 2 | 0 | 29 | 1 | 4 | 1 | 1 | 4 |
| 5 | 0 | 16 | 1 | 15 | 0 | 14 | 0 | 23 | 0 | 16 | 1 | 11 | 1 | 6 | 1 | 13 | 1 | 8 | 5 |
| 6 | 0 | 19 | 1 | 24 | 0 | 16 | 0 | 27 | 0 | 19 | 1 | 19 | 1 | 13 | 1 | 21 | 1 | 16 | 6 |
| 7 | 0 | 22 | 2 | 3 | 0 | 19 | 1 | 2 | 0 | 22 | 1 | 27 | 1 | 20 | 2 | 0 | 1 | 24 | 7 |
| 8 | 0 | 25 | 2 | 12 | 0 | 22 | 1 | 6 | 0 | 25 | 2 | 5 | 1 | 28 | 2 | 8 | 2 | 1 | 8 |
| 9 | 0 | 28 | 2 | 21 | 0 | 24 | 1 | 11 | 0 | 28 | 2 | 13 | 2 | 5 | 2 | 17 | 2 | 9 | 9 |
| 10 | 1 | 1 | 3 | 0 | 0 | 27 | 1 | 15 | 1 | 1 | 2 | 21 | 2 | 12 | 2 | 26 | 2 | 17 | 10 |
| 15 | 1 | 17 | 4 | 15 | 1 | 11 | 2 | 8 | 1 | 17 | 4 | 2 | 3 | 18 | 4 | 8 | 3 | 25 | 15 |
| 20 | 2 | 3 | 6 | 0 | 1 | 24 | 3 | 0 | 2 | 3 | 5 | 12 | 4 | 24 | 5 | 21 | 5 | 3 | 20 |

శ్రీ మహాగణాధిపతయే నమః

ఓం నమో బ్రహ్మాదిభ్యో, బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో వంశర్షిభ్యో నమో గురుభ్యః ॥

శ్రీ హనుమద్గురవే నమః

శ్రీ సీతారామాభ్యాం నమః । శ్రీమతే రామానుజాయ నమః ॥

# శ్రీ చాంద్రమాన విజయనామ సం॥ర పంచాంగమ్

## ప్రార్థనా

శ్లో॥ అగజానన పద్మార్కం, గజానన మహర్నిశమ్ ।
అనేకదం తం భక్తానాం, ఏకదన్త ముపాస్మహే ॥ 1

అరుణాయ శరణ్యాయ, కరుణారససింధవే ।
అసమానబలాయ, ఆర్తరక్షకాయ నమోనమః ॥ 2

అచిన్త్యాఽ వ్యక్తరూపాయ, నిర్గుణాయ గుణాత్మనే ।
సమస్తజగదాధారమూర్తయే, బ్రహ్మణే నమః ॥ 3

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ, తస్మై శ్రీగురవే నమః ॥ 4

గురవే సర్వలోకానాం, భిషజే భవరోగిణామ్ ।
నిధయే సర్వవిద్యానాం, దక్షిణామూర్తయే నమః ॥ 5

వ్యాసాయ విష్ణురూపాయ, వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే, వాసిష్ఠాయ నమోనమః ॥ 6

శ్లో॥ మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్టమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శరణం ప్రపద్యే ॥ 7

శ్లో॥ ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ
నారాయణ స్సరసిజాసనసన్నివిష్టః ।
కేయూరవా న్కనకకుండలవా న్కిరీటీ
హారీ హిరణ్మయవపు ర్ధృతశంఖచక్రః ॥ 8

శ్లో॥ ఆదిత్యాయ చ సోమాయ, మంగళాయ బుధాయ చ ।
గురు శుక్ర శనిభ్యశ్చ, రాహవే కేతవే నమః ॥ 9

## మంగళాచరణమ్

శ్లో॥ ఆదిత్యాదినవగ్రహా శ్శుభఫలా మేషాదయో రాశయో
ర్నక్షత్రాణి సయోగకాశ్చ తిథయ స్తద్దేవతా స్తద్గణాః ।
మాసాఽబ్దా ఋతవ స్తథైవ దివసా స్సంధ్యాదయో రాత్రయో
స్సర్వే స్థావరజంగమాః ప్రతిదినం కుర్యు స్సదా మంగళమ్ ॥

శ్లో॥ శ్రీకళ్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్నదోషాపహం
గంగాస్నానవిశేషపుణ్యఫలదం గోదానతుల్యం నృణామ్ ।
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతానసంపత్ప్రదం
నానాకర్మసుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్ ॥

## సంవత్సరాది కృత్యమ్

శ్లో॥ అబ్దాదౌ బంధుసంయుక్తో, మంగళస్నాన మాచరేత్
వస్త్రై రాభరణై ర్దేహ, మలంకృత్య తత శ్శుచిః ।
విఘ్నేశం భారతీం ఖేటాన్, దైవజ్ఞ మభిపూజ్య చ
సంవత్సర ఫలం సమ్యక్ఛ్రుత్వా, విప్రాన్ సమర్చయేత్ ॥

సంవత్సరాదియందు కాలకృత్యములు దీర్చుకొని, మంగళస్నాన మాచరించి, పట్టువస్త్రములు ధరించి, గణాధిపతిని, నవగ్రహములను, శారదాదేవిని పూజించి, బంధుమిత్రులతో గూడి వేపపువ్వు, మామిడి పిందెలు, క్రొత్త చింతపండు, బెల్లము, పంచాఽమృతములతో చేసిన ప్రసాదమును స్వీకరించి మృష్టాన్నమును భుజింప వలెను. సాయంకాలమున సూర్యదేవుని, దైవజ్ఞుని పూజించి, పంచాంగ శ్రవణము చేయవలెను.

## కాల ప్రభావః

శ్లో॥ కాలః సృజతి భూతాని, కాల స్సంహరతే ప్రజాః ।
కాల స్స్వపితి జాగర్తి, కాలో హి దురతి క్రమః ॥
కాలే దేవా వినశ్యన్తి, కాలే చాఽసురపన్నగాః ।
నరేన్ద్రజన్తవ స్సర్వే, సర్వం కాలే చ నశ్యతి ॥
కాలో హి భగవాన్విష్ణుః, స్వయం కాలో మహేశ్వరః ।
బ్రహ్మాఽపి కాలరూపీ చ, వర్తన్తే కాలసంజ్ఞయా ॥



కాలము ప్రాణులను సృష్టించుచున్నది. కాలమే ప్రాణులను సంహరించు చున్నది. కాలము వల్లనే జనులు నిద్రించుట, మేల్కొనుట మొదలగు వ్యాపారములను (పనులను) చేయుచున్నారు. కాలము నతిక్రమించుట కెవ్వరికిని సాధ్యము గాదు. దేవతలు, రాక్షసులు, సర్పములు, రాజులు మొదలగు సర్వజంతువులు (ప్రాణులు) కాలవశముననే నశించుచున్నవి. భగవానుడగు విష్ణువు, మహేశ్వరుడు, బ్రహ్మ - వీరందఱు కాలస్వరూపులు గావున కాలులని చెప్పబడుచున్నారు.

## దైవజ్ఞలక్షణమ్

శ్లో॥ అద్వేషీ నిత్యసంతోషీ, గణితాగమపారగః ।
ముహూర్తగుణదోషజ్ఞో, వాగ్మీ కుశలబుద్ధిమాన్ ॥
శాన్త శ్చామృతవా క్సౌమ్యః, త్రికాలజ్ఞో జితేంద్రియః ।
నిత్యకర్మరతో యో వై, స దైవజ్ఞః ప్రకీర్తితః ॥

శ్లో॥ దశదినకృతదోషం హన్తి సిద్ధాన్తవేత్తా
త్రిదివసకృతదోషం తన్త్రవేత్తా నరాణామ్ ।
కరణభగణవేత్తా చైకరాత్రోత్థదోషమ్
జనయతి బహుపాపం తత్ర నక్షత్రసూచీ ॥

ఇతరులను ద్వేషింపనివాడు, ఎల్లప్పుడు సంతోషముగ నుండువాడు, గణిత శాస్త్రమును చక్కగా నెఱింగినవాడు, ముహూర్తగుణ దోషములను దెలిసినవాడు, యుక్తియుక్తముగ మాటలాడువాడు, అమృతవాక్కు (వాక్శుద్ధి) కలవాడు, తిన్ననివాడు (అక్రూరుడు), భూత భవిష్య ద్వర్తమానముల నెఱింగినవాడు, ఇంద్రియములను జయించినవాడు, సంధ్యావన్దనాది నిత్య కర్మలయం దాసక్తి కలవాడు "దైవజ్ఞుడని" చెప్పబడినది.

సిద్ధాన్త మెఱింగిన వానిని దర్శించిన, పది దినములలో చేసిన పాపము పరిహార మగును. తంత్రజ్ఞుడగు జ్యోతిష్కుని దర్శించిన, మూఁడుదినములలో చేసిన పాపమును, కరణవేత్తను దర్శించిన నొక్కదినములలో చేసిన పాపమును నశించును. మిడిమిడి జ్ఞానముతో జాతకములు చెప్పువానిని దర్శించినచో పాపము సంభవించునని శాస్త్రవాక్యము.

## జ్యోతిశ్శాస్త్ర ప్రశంసా

శ్లో॥ జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం, ప్రత్యక్షమపి గోపితమ్ ।
చంద్రాఽర్కౌ సాక్షిణౌ తత్ర, శ్రౌతస్మార్తాది సాధనమ్ ॥

శ్లో॥ స్కంధ త్రయాత్మకం శాస్త్ర, మాద్యం సిద్ధాన్తసంజ్ఞికమ్ ।
ద్వితీయం జాతకస్కంధం, తృతీయం సంహితాహ్వయమ్ ॥

శ్లో॥ ఛందఃపాదౌ శబ్దశాస్త్రం చ వక్త్రమ్, శిక్షా ఘ్రాణం శ్రోత్రముక్తం నిరుక్తమ్ ।
కల్పం పాణి ర్జ్యౌతిషం చక్షుషీ చ, వేదస్థానా న్యాహు రేతాని షట్సు ॥

సూర్యచంద్రులు ప్రత్యక్ష సాక్షులుగా గల జ్యోతిష శాస్త్రము మహాపుణ్య ప్రదమై, రహస్యముగ నున్నది. వేదపురుషునకు ఛందస్సు పాదములు, శబ్దశాస్త్రము (వ్యాకరణము) వక్త్రము, శిక్ష నాసిక, నిరుక్తము శ్రోత్రము, కల్పము హస్తము, జ్యోతిషము నేత్రము. ఈ వేదాంగములలో జ్యోతిశ్శాస్త్రము వేద పురుషునకు నేత్ర స్థానీయమగుటచే నత్యంత ప్రాముఖ్యము వహించినది.

## పంచాంగ గణిత కేంద్రమ్

ఈ పంచాంగము భారత కాలమాన రేఖాంశ అయిన భాగాది $82^0$ -30' (గ్రీనిచ్ - లండను నగరమునకు) తూర్పునకు గుణింపబడినది. కావున యీ పంచాంగములోని గంటలు, నిమిషములు "భారత కాలమానము" (ఇండియన్ స్టాండర్డ్ టైము)లో నున్నవని గ్రహించవలెను. ఈ భారత కాలమాన రేఖాంశ, లంకోజ్జయినీ రేఖాంశకు 67 వినాడికల దేశాంతరములో నున్నది:

శ్లో॥ లంకాపుర్యాస్తు ప్రాగ్దేశే, యత్రాఽగర్తు వినాడికాః ।
తద్భారతస్య కేంద్రస్య, పంచాంగం రవి సమ్మతమ్ ॥ (అ.కృ.శ.)

## సృష్ట్యాది గతకాల నిరూపణమ్

శ్రీ చాంద్రమాన విజయనామ సంవత్సరమునకు సృష్ట్యాది గతకాలము నిరూపింపఁబడుచున్నది: శ్రీమదాది నారాయణ నాభికమలోద్భవస్య, పద్మజ నామకస్య, అద్యబ్రహ్మణో, ద్వితీయ పరార్థే, శ్వేతవరాహ కల్పే, షట్సు మన్వంతర గతేషు, సప్తమే వైవస్వత మన్వంతరే, అష్టావింశ న్మహాయుగే, కల్యాది గతాబ్దాః 5114.

| | |
|---|---|
| సృష్ట్యాది గతాబ్దాః | 195,58,85,114 |
| హరిశ్చంద్ర మహారాజాబ్దాః | 2,38,34,254 |
| నల మహారాజాబ్దాః | 1,36,23,961 |
| కార్తవీర్యార్జునాబ్దాః | 1,28,35,164 |
| రావణాబ్దాః | 1,25,69,114 |



| | |
|---|---|
| రామ-రావణ యుద్ధ కాలాబ్దాః | 1,25,25,114 |
| శ్రీరామచంద్ర రాజ్యాంత వత్సరాః | 1,25,14,114 |
| భరతస్య రాజ్యపాలనాబ్దాః (దుష్యన్త పుత్రః) | 5,362 |
| విక్రమార్క శకాబ్దాః | 2,070 |
| శాలివాహన శకాబ్దాః | 1,935 |
| క్రీస్తు సంవత్సరః | 2013-2014 |
| భారత స్వాతంత్ర్య వత్సరాః | 66 |

## అహర్గణము

అహర్గణ మనగా దినసంఖ్య. సృష్ట్యారంభము నుండి, 28వ మహాయుగము నందలి ద్వాపరయుగాంతము వఱకు (శ్రీకృష్ణుని యవతారసమాప్తి వఱకు) అహర్గణము 71440,22,96,627. గత షష్టి (ప్రభవాది) చక్రములు 3,25,98,000.

ఈ కలియుగము, (13వ) ప్రమాథి సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి శుక్రవారము నాడు ప్రారంభమైనది. కడచిన "అక్షయ" సంవత్సరమునకు గతషష్టి 84.8 అగుటచే, ఈ కలియుగమున నిప్పటివఱకు 85 షష్ట్యబ్ద చక్రములు పూర్తియైనవి.

వర్తమాన "విజయ" సంవత్సరము 86వ షష్ట్యబ్ద చక్రములో 27వది. ఈ విజయ సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి, గురువారము, 11-4-2013 తేదీ, సూర్యోదయ కాలమునకు కల్యాది అహర్గణము 1867928, జూలియన్ దినము 2456393.5, స్ఫుట అయనాంశ 24°-02'-45".

## అథ అబ్దత్రయ నిరూపణమ్

**1. చాంద్రమానాబ్దః :** అస్మిన్ దేశే లోకవ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యః । చాంద్రమానేన చైత్ర శుద్ధ ప్రతిపది, బృహస్పతివాసరే, 11-4-2013 తారికాయాం, ప్రభవాది సప్తవింశతమ (27-వ) విజయనామ వత్సరః ॥

**2. సౌరమానాబ్దః :** శేషాచలస్య దక్షిణదేశే (ద్రవిడదేశే-తమిళ్‌నాడు) సౌర మానాబ్దో గ్రాహ్యః । సౌరమానేన చైత్ర శు॥ పంచమీ భానువాసరే 14-4-2013 తారికాయాం సౌరవత్సరారంభః ॥

- చాంద్ర సౌరమానాభ్యాం శ్రీ విజయనామ వత్సరః ॥

**3. బార్హస్పత్యమానాబ్దః :** వింధ్యస్యోత్తర దిగ్భాగే సింధు, ఘూర్జరాది (గుజరాత్ మొ॥) దేశేషు బార్హస్పత్యమానాబ్దో గ్రాహ్యః । స్ఫుటగురో ర్మిథునరాశిప్రవేశ వశాత్ (31-5-2013 గం.06-49) ఏతత్సంవత్సర వైశాఖ బ॥ సప్తమీ భృగువాసరే, బార్హస్పత్యమానేన 15-వ ప్లవంగనామ వత్సరారంభః ॥

4. గురూదయవశాత్ (2-7-2013, గం.22-53) "మార్గశీర్షాబ్దః" (ఆర్ద్రానక్షత్రేణ సహ గురూదయః ॥).

## అథ రాజాది నవనాయకాః

అస్మిన్వర్తమానస్య, సమస్త కల్యాణభాజనస్య, సకల శ్రౌత - స్మార్త - నిత్య - నైమిత్తిక - కామ్యకర్మానుష్ఠాన క్రియాతన్త్ర వ్యవహార హేతుభూతస్య, చాంద్ర మానేన సప్తవింశతితమ శ్రీ విజయనామ సంవత్సరస్య :

1. రాజా గురుః
2. మన్త్రీ రవిః
3. సేనాధిపశ్శుక్రః
4. సస్యాధిపః కుజః
5. ధాన్యాధిపశ్చన్ద్రః
6. అర్ఘాధిపశ్శనిః
7. మేఘాధిపశ్శనిః
8. రసాధిపో గురుః
9. నీరసాధిపః కుజః

## చాంద్రమానేన శ్రీ విజయనామ సంవత్సర ఫలమ్

శ్లో॥ స్త్రీపుంసో ర్మదవృద్ధిః స్యాత్, పాపకర్మరతాః ప్రజాః ।
రాజ్యే పరస్పరాఘాతం, విజయాబ్దే జయావహమ్ ॥

ఈ విజయ సంవత్సరమున స్త్రీపురుషులకు మదము వృద్ధియగును. ప్రజలు పాపకర్మలందు ఆసక్తి కలిగియుందురు. రాజ్యమందు ప్రజలు పరస్పరము కొట్టుకొనుచుందురు. కొందఱకు జయప్రదముగ నుండును.

### 1. రాజ్ఞః గురోః ఫలమ్

శ్లో॥ ద్విజాతయః కర్మరతా స్వధర్మాః, సన్మార్గగా నీతివిదో నరేంద్రాః ।
సుభిక్ష మారోగ్యసుఖం ప్రజానాం, సువృష్టి రబ్దాధిపతౌ సురేజ్యే ॥

బ్రాహ్మణులు స్వధర్మతత్పరులై యజ్ఞకర్మలను ఆచరింతురు. రాజులు నీతికోవిదులై సన్మార్గమునందు ప్రవర్తించెదరు. సువృష్టి కలిగి, ప్రజలు ఆరోగ్యము సుఖము గలిగియుందురు. దేశము సుభిక్షముగ నుండును.

### 2. రవేః మంత్రిత్వ ఫలమ్

శ్లో॥ రాజ్ఞా మన్యోన్యవైరత్వం, అనావృష్టి ర్నిరంతరమ్ ।
అధర్మనిరతా మర్త్యాః, భాస్కరస్య చ మన్త్రితః ॥

సూర్యుఁడు మంత్రియగుటచే, రాజులకు పరస్పర వైరముండును. అనావృష్టి యుండును. జనులు అధర్మప్రవృత్తి కలిగియుందురు.



3. ఆషాఢ శుక్ల పక్షమున స్వాతీనక్షత్రయుక్త తిథి - నవమి యగుటచే వాయుపీడ కలుగును; విత్తనములు చల్లరాదు.
4. ఆషాఢ బహుళ పక్షమున రోహిణీ నక్షత్రయుక్త తిథి - దశమి యగుటచే సువృష్టి కలిగి, సర్వసస్యములు సమృద్ధిగా పండును.
5. పుష్య బహుళ అమాయుక్తవారము - గురువారమైనందున ప్రజాసౌఖ్య ముండును.

## అథ కర్తరీ నిర్ణయః

ఈ సంవత్సరము చైత్ర బ॥ దశమీ శనివారము, 4-5-2013 తేదీ నుండి, వైశాఖ బ॥ చతుర్థీ మంగళవారము, 28-5-2013 వఱకు వాస్తుకర్తరి.

కర్తరిలో వృక్షములు నఱకుట, వ్యవసాయము ప్రారంభించుట, విత్తనములు చల్లుట, వాపీ-కూప-తటాక నిర్మాణములు చేయరాదు. కర్తరీ ప్రవేశ దినములలో దేవాలయ నిర్మాణము చేయవచ్చును.

శ్లో॥ మౌంజీబంధే వివాహే చ, ప్రవేశే యజ్ఞకర్మణి ।
భరణీ కృత్తికా చైవ, న దోషా మండపాదిషు ॥

కర్తరిలో ఉపనయనము, వివాహము, గృహప్రవేశము, యజ్ఞయాగాదులును చేయవచ్చును.

## అథ మౌఢ్య నిర్ణయః

1. గురుమౌఢ్యము : ఈ సంవత్సరము వైశాఖ బ॥ చతుర్దశీ గురువారము 6-6-2013 నుండి, జ్యేష్ఠ బ॥ దశమీ మంగళవారము, 2-7-2013 వఱకు - పశ్చాదస్తమిత గురుమౌఢ్యము.
2. శుక్రమౌఢ్యము : ఉగాది నుండి చైత్ర శు॥ ఏకాదశీ ఆదివారము, 21-4-2013 వఱకు - శుక్రమౌఢ్యము.

తిరిగి, పుష్య శు॥ అష్టమీ బుధవారము, 8-1-2014 నుండి, పుష్య శు॥ త్రయోదశీ సోమవారము, 13-1-2014 వఱకు - పశ్చాదస్తమిత శుక్రమౌఢ్యము.

### గురు, శుక్రులకు వృద్ధత్వ, బాలత్వ దోషములు

గురు, శుక్రులు అస్తమించుటకు ముందు మూఁడేసి రోజులు వృద్ధులు గను, ఉదయించిన పిమ్మట మూఁడేసి రోజులు బాలురుగను నుందురు. ఈ కాలములను గూడ శుభకార్యములకు వర్జింపవలెను.

### మౌఢ్యవర్జ్యములు

గురు, శుక్రుల మౌఢ్యకాలములో బావులు, బోరింగులు, చెఱువులు త్రవ్వుట; తోఁటపనులు, యజ్ఞములు, తీర్థయాత్రలు, పదవీ స్వీకారము, క్షౌరము, ప్రతిష్ఠలు, నూతన మంత్రానుష్ఠానము, దీక్షాస్వీకరణము, విద్యారంభము, అక్షరాభ్యాసము, తులాపురుషాది మహాదానములు, వివాహోపనయనాది శుభకార్యములు చేయరాదు.

జనన గండదోష శాంతులు, గ్రహశాంతులు, వ్యాధి నివారణకై జప-హోమాది శాంతులు, గ్రహణ శాంతులు, రుద్రాభిషేక, రజస్వలా, ప్రాయశ్చిత్త, ఉత్పాత శాంతులును చేసికొనవచ్చును. గురుశుక్రులలో నొకరు అస్తమించగా మఱియొక రుచ్ఛయందున్నచో, శుభకార్యములు చేయవచ్చును.

## అథ పుష్కర నిర్ణయః

ఈ సంవత్సరము వైశాఖ బ॥ సప్తమీ శుక్రవారము, 31-5-2013 తేదీ ఉదయము గం. 6-50 ని॥లకు సరస్వతీనదికి పుష్కర ప్రారంభము (స్ఫుట గురోః మిథునరాశి ప్రవేశ వశాత్ ॥)

అలహాబాద్ వద్ద త్రివేణీసంగమములో స్నానము చేసినచో, సరస్వతీనదీ పుష్కరస్నానఫలము లభించును.

పుష్కరనదీతీరవాసులు, పుష్కర ప్రారంభము నుండి ఒక సంవత్సర కాలము వివాహోపనయనాది శుభకార్యములు చేయరాదు. ఇతర ప్రాంతములకు వెళ్ళి, శుభకార్యములను జరుపుకొనవచ్చును.

## పుష్కర విధులు

పుష్కరమనఁగా నేమి? పుష్కరమనఁగా పుణ్యకాలము. పుణ్యము చేసిన వారు సుఖాలను, పాపము చేసినవారు కష్టాలను అనుభవించెదరు.

సూర్యోదయకాలము నుండి మధ్యాహ్నము లోగా పుష్కరనదిలో స్నానము చేసి, బ్రాహ్మణులకు యథాశక్తి దానములు చేయవలెను. అపరాహ్ణకాలమున, అనఁగా మధ్యాహ్నము 1 గంట నుండి 4 గంటల వఱకు పుష్కరస్నానము చేసి, పితృదేవతల తృప్తికై శ్రాద్ధ-తర్పణ-దానములు చేయవలెను.

### పుష్కర దానములు

**1వ రోజున** : బంగారము, భూమి, వెండి, ధాన్యదానములు; హిరణ్య శ్రాద్ధము.

**2వ రోజున** : గోవులు, మణులు, వస్త్రములు, లవణ దానములు.



**3వ రోజున** : అశ్వము, బెల్లము, ఫలములు, శాకములు.

**4వ రోజున** : నెయ్యి, నూనె, పాలు, తేనె, పానకములు.

**5వ రోజున** : ధాన్యశకటము, నాగలి, ఎద్దు, మహిషములు.

**6వ రోజున** : కస్తూరి ఘనసార చందనౌషధములు.

**7వ రోజున** : గృహము, శయ్య, ఊయల, పీఁటలు.

**8వ రోజున** : శ్రీచందనము, కందమూలములు, పుష్పములు.

**9వ రోజున** : కన్యాదానము; దాసీ, కంబళదానములు; అన్నశ్రాద్ధము.

**10వ రోజున**: వెండి, ముత్యాలహారము, పుష్పములు.

**11వ రోజున** : అన్నవస్త్రములు, యజ్ఞోపవీతము, తాంబూలము, పుస్తక దానములు.

**12వ రోజున**: షోడశ మహాదానములు, ఆమశ్రాద్ధము చేయవలెను.

### పుష్కరకాల ప్రమాణము

ఈ పుష్కరదినములు 12 రోజులలో నదీస్నానము చేయలేనివారు, పుష్కర దినములు గడచిన పిమ్మట, మధ్యాహ్నకాలమునందలి రెండు గడియలలో స్నానము చేసి, దానములు చేసినచో, పుష్కరస్నాన ఫలము లభించును.

## అథ గ్రహణ నిర్ణయః

ఈ విజయనామ సంవత్సరమున (2013-14 AD) ఒక్క చంద్రగ్రహణము మాత్రమే భారతదేశములో కనఁబడును.

### (1) చంద్రగ్రహణము

చైత్ర శు॥ పూర్ణిమా గురువారము **25-4-2013** రా. గం. 1-22 నుండి 1-53 వఱకు - రాహుగ్రస్త సోమోపరాగము. గ్రహణ మధ్యకాలము : రాత్రి గం. 1-38 ని॥

ఇది భారతదేశములో కనబడును. స్వాతీనక్షత్రమువారు ఈ గ్రహణమును చూడరాదు; యథావిధిగా గ్రహణశాంతి చేయించుకొనవలెను.

### (2) సూర్యగ్రహణము (ఇది భారతదేశములో కనఁబడదు.)

చైత్ర బ॥ అమావాస్య, 9-5-2013 తేదీ గురువారం (భారతకాలమానములో) రాత్రి గం. 2-55 లకు కేతుగ్రస్త సూర్యగ్రహణము. ఇది కంకణ గ్రహణము (Annular).

| | |
|---|---|
| గ్రహణ స్పర్శకాలము | గం. 26-55 |
| గ్రహణ నిమీలనకాలము | గం. 28-03 |

| | |
|---|---|
| గ్రహణ మధ్యకాలము (పూర్తి గ్రహణము) | గం. 29-55 |
| గ్రహణ ఉన్మీలనకాలము | గం. 07-48 (శుక్రవారం) |
| గ్రహణ మోక్షకాలము | గం. 08-55 (శుక్రవారం) |

(Magnitude 0.956)

ఇది సెంట్రల్ ప్యాసిఫిక్ ప్రాంతము నందును; న్యూజిల్యాండ్ - ఆస్ట్రేలియా - ఇండొనీషియా దేశములలోను కన్పించును.

భరణీ నక్షత్రజాతకులు (ప్రపంచమందు అంతటా) యీ గ్రహణమును చూడరాదు; యథావిధిగా శాంతి చేయించుకొనవలెను.

### (3) సంపూర్ణ సూర్యగ్రహణము (ఇది భారతదేశములో కనఁబడదు.)

ఆశ్వయుజ బ॥ అమావాస్య 3-11-2013 తేదీ ఆదివారం (భారత కాలమాన ప్రకారము) పగలు గం. 3-35 ని॥లకు రాహుగ్రస్త సంపూర్ణ సూర్యగ్రహణము.

| | |
|---|---|
| గ్రహణ స్పర్శకాలము | గం. 15-35 |
| గ్రహణ నిమీలనకాలము | గం. 16-35 |
| గ్రహణ మధ్యకాలము (పూర్తి గ్రహణము) | గం. 18-17 |
| గ్రహణ ఉన్మీలనకాలము | గం. 19-58 |
| గ్రహణ మోక్షకాలము | గం. 20-59 |

(Magnitude 1.017)

ఇది మిడిల్ ఈస్ట్, ఆఫ్రికా, దక్షిణ యూరప్, ఈస్టరన్ నార్త్ అమెరికా, సౌత్ అమెరికాలోని ఈశాన్య భాగములోను కన్పించును.

గర్భిణీ స్త్రీలు, గ్రహణ నిమీలనకాలము నుండి ఉన్మీలనకాలము వఱకు కదలక విశ్రాంతిగా పరుండియుండవలెను.

స్వాతీనక్షత్రములో పుట్టినవారు (ప్రపంచమంతటా) గ్రహణశాంతి జరిపించుకొనవలెను. వారు యీ గ్రహణమును చూడరాదు.

### గ్రహణకాలే కర్తవ్యా_కర్తవ్య నిర్ణయః

గ్రహణకాలమున ఆహారము తీసుకొనుట, నిద్రించుట, మైథునము, మూత్ర, పురీష విసర్జనములు చేయరాదు. గర్భిణీ స్త్రీలు కదలక పరుండవలెను. పాలు, పెరుఁగు, నెయ్యి, ఉప్పు, కూరగాయల పచ్చళ్ళలో దర్భ, లేదా గరికపోచ వేయవలెను. గ్రహణకాలమున స్నానము చేసి, గో-భూ-తిల-హిరణ్య దానములు చేసినచో పుణ్యము వచ్చును. ఈ పుణ్యఫలమే మానవుల వెంట వచ్చును గాని, గృహారామ ధనాదులు వెంట రావు. పొరుగు దేశములకు వలస వెళ్ళువారు,



స్వగ్రామమున తమకు గల ఆస్తులను అమ్మి, ధనమును వెంట తీసుకొని వెళ్ళు రీతిగా, పై లోకములకు వెళ్ళునపుడు పుణ్య, పాప ఫలమును మాత్రమే తమ వెంట తీసికొని పోవుదురు. శాస్త్ర వాక్యమును నమ్మి ఆచరించువాని జన్మ సార్థకము కాగలదు. "దాన్లో యేముందీ, దీన్లో యేముంది?" అని ఒడ్డున కూర్చుని విమర్శించువాని జీవితము అటులనే నిరర్థకము కాగలదు. కావున ధర్మాచరణము శ్రేయోదాయకమని చెప్పబడినది.

గ్రహణకాలమున సాధకులు సంమీలనము నుండి ఉన్మీలనము వఱకు గాని, గ్రాసాది ముక్తి పర్యంతము గాని ఇష్టదేవతా జప, ధ్యానములు, హోమమును చేయవలెను. ఇతరులు (అర్హులు) గాయత్రీ జపము చేయవలెను. ఉన్మీలన కాలము నుండి మోక్ష కాలము వఱకు దానములు చేయవలెను. స్పర్శ, మోక్ష కాలముల పూర్వాపరములందు స్నాన మాచరింపవలయును.

### బింబదాన విధిః

వెండితో చంద్రబింబమును, బంగారముతో రవిబింబము, నాగప్రతిమను చేయించి, వానిని ఆవునేతితో నింపిన కంచుపాత్ర యందుంచి తిల-వస్త్ర-దక్షిణలతో గ్రహణానంతరము బ్రాహ్మణునకు దానమీయవలెను. **అపుడు** సంకల్పము : "మమ జన్మరాశి జన్మనక్షత్రాద్యరిష్టస్థాన సంభవిత సూర్యోపరాగ, అథవా సోమోపరాగ సూచిత సర్వారిష్ట శాంత్యర్థం, శుభఫలావాప్త్యర్థం బింబదానం కరిష్యే" ॥ తదాదౌ ధ్యానమ్ :

శ్లో॥ తమోమయ మహాభీమ ! సోమసూర్యవిమర్దన ! ।
హేమతారాప్రదానేన, మమ శాంతిప్రదో భవ ॥
విధుంతుద నమస్తుభ్యం, సింహికానందనాచ్యుత! ।
దానేనానేన నాగస్య, రక్ష మాం వేధజాద్భయాత్ ॥

- ఏకాదశవారం జపేత్ ॥

## అథ మకర సంక్రాంతిః

### సంక్రాంతి పురుష లక్షణము

శ్లో॥ త్రిశీర్షం ద్విముఖం చైవ, చతుర్వక్త్రం త్రినేత్రకమ్
లంబకర్ణం రక్తదంతం, లంబభ్రూ దీర్ఘనాసికమ్ ।
అష్టబాహుం ద్విపాదం చ, వికృతం కృష్ణవర్ణకమ్
శతయోజన మౌన్నత్యం, విస్తీర్ణం ద్వాదశ స్మృతమ్
ఏవం రూపం చ విజ్ఞేయం, సంక్రాంతేః పురుషస్య తు ॥

| సంక్రాంతి పురుషునకు |
|---|
| గజ వాహనము |

ఏత త్సంవత్సర పుష్య శు॥ చతుర్దశీ భౌమవాసరే **14-1-2014** తారికాయాం, సూర్యోదయాది (ఘ. ౧౫-౫౮) అష్టపంచాశద్విఘటికాధిక పంచదశ ఘటికాసమయే (పగలు గం. 1-13 ని॥లకు) భానోర్మకరరాశి ప్రవేశః। తత్తత్ఫలాని లిఖ్యంతే ॥

సంక్రాంతి పురుషుడు మహోదర నామకుఁడు - చోరులకు హాని. బిల్వ స్నానము - మహాభీతి. నీలవస్త్రధారణము - మహద్భయము. లాక్షాగంధ (పారాణిపూత) లేపనము - రాక్షసస్త్రీలకు నాశము. జపాపుష్పధారణము (దాసాని పువ్వు) - యుద్ధభీతి. గోమేధిక భూషణము - మహాభయము. సీసపాత్ర - యుద్ధ భీతి. క్షీరపానము - కీర్తిహాని. బదరీఫలము (రేఁగుపండు) - చోరనాశము. కోదండాయుధము - క్షత్రియులకు హాని. కాంచన ఛత్రము - రోగనాశము. గజవాహనము - రాజయుద్ధము. విస్మయచేష్ట - అశుభము. నివిష్టావస్థ - మధ్యార్ఘ. ఆగ్నేయ దిగ్యానము : తద్దేశానామరిష్టమ్ - ఆగ్నేయ దిక్కుననున్న దేశములకు హాని.

మకర సంక్రమణ తిథ్యాదులకు ఫలము : శుక్లపక్షము - దుర్భిక్షము. చతుర్దశీ తిథి - జయము, సువృష్టి. మంగళవారము - వ్యాధిభయము, తస్కరభయము, దుర్భిక్షము. మధ్యాహ్నకాలము - విప్రులకు హాని. మేషలగ్నము - జగత్ప్రమోదము. సూర్యోదయాది నవమ ముహూర్తము - అపకీర్తి. మంగళవారమున సంక్రమణ మైనందున పగడములు, రాగి, రక్తచందనము, ఎఱ్ఱని వస్త్రములకును ధరలు హెచ్చును ("ప్రవాళ రక్తవాససాం। రక్తచందన తామ్రాణాం, అర్ఘవృద్ధి ర్దినేదినే ॥")

సంక్రమణ పుణ్యకాలము : 14-1-2014 తేదీ మంగళవారము మధ్యాహ్నము గం. 1-13 ని॥ల నుండి రాత్రి గం. 9-13 ని॥ల వఱకు మకరసంక్రాంతి పుణ్య కాలము.

## మకర సంక్రాంతి విధులు

శ్లో॥ రవి సంక్రమణే ప్రాప్తే, న స్నాయాద్యస్తు మానవః।
సప్తజన్మసు రోగీ స్యాత్, నిర్ధనశ్చైవ జాయతే ॥

మనుష్యమాత్రునకు సంక్రాంతి సమయమున స్నానము విధింపబడినది. అట్లు స్నానము చేయని నరుడు యేడు జన్మములు రోగి, నిర్ధనుడును అగునని శాస్త్రవాక్యము.

శ్లో॥ యదన్నం సంక్రమే ప్రోక్తం, తదన్నైః ప్రీణయే ద్రవిమ్।
ఆయుధం యచ్చ తద్రాజ్ఞా, పూజనీయం జయార్థినా ॥

సంక్రాంతి పురుషుడు ధరించిన ఆయుధమును రాజులు అనఁగా



## రాజపూజ్య, రాజాఽవమానములు

| రాశిః | పూజ్య॥ | అవ॥ | రాశిః | పూజ్య॥ | అవ॥ |
|---|---|---|---|---|---|
| 1. మేషస్య | 2 | 4 | 7. తులాయాః | 6 | 3 |
| 2. వృషభస్య | 5 | 4 | 8. వృశ్చికస్య | 2 | 6 |
| 3. మిథునస్య | 1 | 7 | 9. ధనుషః | 5 | 6 |
| 4. కర్కటకస్య | 4 | 7 | 10. మకరస్య | 1 | 2 |
| 5. సింహస్య | 7 | 7 | 11. కుంభస్య | 4 | 2 |
| 6. కన్యాయాః | 3 | 3 | 12. మీనస్య | 7 | 2 |

శ్లో॥ రోగాఽరోగ్యా పుణ్యపాపౌ, లాభాఽలాభౌ జయాఽజయౌ।
సుఖదుఃఖే వృద్ధిహీనే, వాఽఽదాయ వ్యయసంజ్ఞికౌ ॥
రోగాఽరోగ్యే వృద్ధి హీనే, ధనాఽఽగమన నాశనే।
మేషా ద్యేకాధిపత్యే తు, నిర్ణేయమితి సూరిభిః ॥

పైని చెప్పఁబడిన సంఖ్యలవల్ల ఆదాయ, వ్యయములేగాక, లాభనష్టములు, సుఖదుఃఖములు, వృద్ధిహీనములు, ధనప్రాప్తి, ధననష్టము, రోగము, అరోగము (ఆరోగ్యము), పుణ్యపాపములు, జయాఽపజయములు, మానాఽవమానములను గుఱించి తెలిసికొనవచ్చును.

## అగస్తి పూజనము

ఈ సంవత్సరము అగస్త్య నక్షత్రము, వైశాఖ బ॥ చతుర్థీ, 27-5-2013 తేదీ, సోమవారము రా. గం.12-56 ని॥లకు (హైదరాబాద్ గణిత కేంద్రముగా) అస్తమించి, మఱల శ్రావణ శు॥ దశమీ, 16-8-2013 తేదీ, శుక్రవారము ప. గం.2-06 ని॥లకు ఉదయించును.

అగస్త్య నక్షత్రము రాత్రి అస్తమించి, వర్షాకాలమున (శ్రావణ మాసములో) పగలుదయించుటచే, సర్వధాన్యవృద్ధి కలిగి, దేశము సుభిక్షముగ నుండును; కొన్నిచోట్ల దుర్భిక్షము.

**అగస్త్యేశ్వరాలయములు :** ఆంధ్రప్రదేశ్‌లోని కడప జిల్లాయందలి ప్రొద్దుటూరు పట్టణపు నడిబొడ్డున అగస్త్యేశ్వరాలయము గలదు. అంతేగాక, విజయవాడకు 70 కి.మీ దూరములోనున్న "ఘంటసాల" గ్రామములో అగస్త్యునిచే ఏకపీఠముపై ప్రతిష్ఠింపఁబడిన పార్వతీపరమేశ్వరుల ఆలయము గలదు.

అగస్త్య నక్షత్రము యొక్క యుదయాస్తమయ కాలములందు సూర్యునకు వలె అర్ఘ్యప్రదానము గావించి, అగస్త్యుని పూజింపవలెను. అంతేగాక, ఆదిత్య హృదయాది స్తోత్రములను పారాయణ గావింపవలెను. అట్లు చేయువారికి అయురారోగ్య, ఐశ్వర్యములు గలుగును.

శ్లో॥ లోపాముద్రాపతిం దేవం, అగస్త్యమృషిసత్తమమ్ ।
దక్షిణాశాపతిం, రామతారకప్రియ మూర్జితమ్ ॥

## సౌరసంక్రమణ పుణ్యకాలములు

జగన్నియామకుండగు పరమేశ్వరుఁడు సూర్యరూపుఁడై, నెలకొక రాశి వంతున మేషాది ద్వాదశ రాసులలో - ఇంద్రుఁడు, ధాత, పర్జన్యుఁడు, త్వష్ట, పూషుఁడు, అర్యముఁడు, భగుఁడు, వివస్వంతుఁడు, విష్ణువు, అంశుమంతుఁడు, వరుణుఁడు, మిత్రుఁడు అను పండ్రెండు నామములతో చరించుచు, కర్మ సాక్షియై, జీవులకు శుభాఽశుభ కర్మఫలప్రదాత యగుచున్నాఁడు. సూర్యుని రాశి ప్రవేశమునకు "సూర్య సంక్రమణము"ని పేరు. అయా సంక్రమణ సమయములను బట్టి శాస్త్రోక్తముగ నిర్ణయింపఁబడిన పుణ్యకాలములందు స్నానముచేసి, సత్పాత్రు లగు బ్రాహ్మణులకు గోదానము, భూదానము, హిరణ్యదానము మొదలగు దానములు చేసినచో, మానవులు పుణ్యవంతు లగుదురని చెప్పఁబడినది. పుణ్యము లేనివారు దరిద్రులై కష్టముల ననుభవింతురు. పుణ్యవంతులు సుఖసంపదలు గల్గి వర్ధిల్లుదురు.

సంక్రమణ కాలములందు దరిద్రులు, ధనవంతులు అందఱును దానములు చేయవలెను. అట్లు చేసినచో, దరిద్రులకు భాగ్యమబ్బును; ధనవంతులకు సుఖ సంపదలు స్థిరముగా నుండును.

### విషువత్ పుణ్యకాలములు

సూర్యుఁడు భూమధ్యరేఖ పైకి వచ్చినపుడు (ప్రతి సంవత్సరము మార్చ్ 21వ తేదీ) పగలు, రాత్రి సమానముగా నుండును. దీనిని వసంతకాలపు విషువత్తు (Vernal Equinox) అందురు. మఱల, సెప్టెంబర్ 23వ తేదీన భూమధ్యరేఖ పైకి వచ్చినపుడు గూడ, పగలు రాత్రి కాలములు సమానముగ నుండును. దీనిని శరత్కాలపు విషువత్తు (Autumnal Equinox) అందురు. ఈ రెండింటిని విషువత్పుణ్య కాలము లందురు.

పూర్వకాలమున, సూర్యుఁడు అశ్వినీ నక్షత్రమును ప్రవేశించినపుడు (ఏప్రిల్



14) వసంత విషువత్తును, చిత్రా నక్షత్రము 3-వ పాదమును ప్రవేశించినపుడు శరద్ విషువత్తును వచ్చెడివి. కాఁగా, నేఁటి పంచాంగకర్తలు వీనిని గూడ విషువత్పుణ్య కాలములుగా వ్రాయుట తప్పని యెఱుంగుదురు గాక.

ఈ పంచాంగములో మేషాది సౌర సంక్రమణములును, మేషాయనము, వృషభాయనము, మిథునాయనము మొదలగు అయనప్రవేశకాలములును - అయా దినములందు స్పష్టముగ వ్రాయఁబడినవి. ఈ అయనప్రవేశ పుణ్యకాలము లందు గూడ స్నానమొనర్చి, పాత్రులగువారికి యథాశక్తి తిల-గో-భూ-హిరణ్య దానములొనర్చిన వారికి శ్రేయస్సు కలుగును.

మేషాది రాశిసంక్రమణ, అయనప్రవేశ పుణ్యకాలములందు, యీ దిగువ వ్రాసినట్లుగా ప్రత్యేకముగ దానములు చేయవలయును. మేషము - మేక దానము, వృషభము - గోదానము, మిథునము - అన్నవస్త్రములు, కర్కాటకము - నెయ్యి, గోవు; సింహము - ఛత్రము, సువర్ణము; కన్య - పాలు, నెయ్యి, నువ్వులు; తుల - దండము, వృశ్చికము - దీపదానము, ధనుస్సు - వస్త్రవాహనములు, మకరము - కఱ్ఱలు, అగ్ని; కుంభము - గోవు, జలము, తృణము, మీనము - భూమి, మాలికలు. దాన సాద్గుణ్యార్థము దక్షిణలీయవలెనని వేఱుగ చెప్పనక్కఱలేదు. అయా వస్తువులు లభింపనిచో, వానికి ప్రత్యామ్నాయముగ రొక్కమివ్వవచ్చును.

గ్రహణమాస ఫలము : ఈ సంవత్సరము చైత్ర పూర్ణిమనాడు చంద్ర గ్రహణము సంభవించుటచేత, వర్తక వ్యాపారస్థులకు, హాస్య- శిల్పి-చిత్రలేఖక-గాయకులకును శుభము గలుగును.

### మౌఢ్యము,పుష్కరములు

సంవత్సరాది నుండి ఏప్రిల్ 21 వఱకు శుక్రమౌఢ్యము. మఱల, 2014 సం॥ జనవరి 8 నుండి 13 వఱకును శుక్రమౌఢ్యము. గురుమౌఢ్యము - 2013 సం॥ జూన్ 6 నుండి జూలై 2 వఱకు గురుమౌఢ్యము. వైశాఖ బ॥ సప్తమీ, శుక్రవారము, 2013 సం॥ మే 31-వ తేదీన సరస్వతీనదికి పుష్కర ప్రారంభము. ఈ సంవత్సరము నాలుగు తూముల వర్షము, ఏడు వీసముల పంట పండును. శుభం భూయాత్ ॥

### స్వస్తి వాచకము

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతామ్, న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః।
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం, లోకా స్సమస్తా స్సుఖినో భవంతు ॥

శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః, పృథివీ సస్యశాలినీ ।
దేశోఽయం క్షోభరహితః, బ్రాహ్మణాస్సంతు నిర్భయాః ॥

శ్లో॥ అపుత్రాః పుత్రిణ స్సంతు, పుత్రిణ స్సంతు పౌత్రిణః ।
అధనా స్సధనా స్సంతు, జీవంతు శరదాం శతమ్ ॥

మం॥ స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః । స్వస్తి నః పూషా విశ్వవేదాః ।
స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః । స్వస్తి నో బృహస్పతి ర్దధాతు ॥
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥

---

శ్లో॥ బద్ధ పృష్ఠ శిరో గ్రీవః, స్తబ్ధదృష్టి రథోముఖః ।
కష్టేన లిఖితం గ్రంథ, మాద్రియన్తు విచక్షణాః ॥ (అ.కృ.శ.)

---

*గమనిక : శాస్త్ర గ్రంథములను ఆధారము చేసికొని, యీ పంచాంగములో శుభాశుభ ఫలితాంశములు వ్రాయబడినవి. వీనినే ఆధారము చేసికొని వర్తించువారి లాభనష్టములకు, ఈ పంచాంగకర్తగాని, ప్రచురణకర్తలు గాని యెంత మాత్రము బాధ్యులు గారని తెలియపరచుచున్నాము. - పంచాంగకర్త*



## వివాహ సుముహూర్తయోగ్య తిథినక్షత్రాదులు

శుభ నక్షత్రములు : రోహి, మృగ, మఘ, ఉ.ఫ., హస్త, స్వాతి, అనూ, మూల, ఉ.షా., ఉ.భా., రేవతి (11 శుభ నక్షత్రములు).

కన్యావరణమునందు : శ్రవ, పూ.ఫ., పూ.షా., పూ.భా., ధని, కృతిక నక్షత్రములు గూడ పనికి వచ్చును.

పైని చెప్పిన రోహిణ్యాది నక్షత్రములు (1) బ్రాహ్మము, (2) దైవము, (3) ఆర్షము, (4) ప్రాజాపత్య వివాహములకు పనికివచ్చును. శేషించిన, (5) అసురము, (6) గాంధర్వము, (7) రాక్షసము, (8) పైశాచికములను వివాహములకు - పైని చెప్పిన 11 శుభనక్షత్రములేగాక, అదనముగ : అశ్వి, చిత్ర, శ్రవ, ధనిష్ఠలు గూడ పనికివచ్చును.

స్త్రీపునర్వివాహమునకు, అనగా ఘర్షణము, ఖండమంగళము (ఖడ్గ వివాహమైన కన్యకు భర్త మరణించినచో, పునర్వివాహము)నకు - అశ్వి, చిత్ర, శ్రవ, ధని, పుష్య, పూ.ఫ. - ఈ ఆఱు నక్షత్రములు గూడ చెప్పఁబడినవి.

నిషిద్ధ తిథ్యాదులు : రిక్తతిథులు (౪, ౯, ౧౪), ద్వాదశి, అమా, అష్టమి, షష్ఠి తిథులును; పరిఘ పూర్వార్థము, వ్యతీపాత, వైధృతి యోగములు, భద్ర (విష్టి) కరణము, అవమ, అర్ధరాత్రి, యుగాదులు, మన్వాదులును వివాహమునకు నిషిద్ధములు. శుద్ధ పాడ్యమి వివాహమునకు నిషిద్ధము.

శూన్యమాసములు, మాసశూన్యనక్షత్రములు, గురు శుక్ర మౌఢ్యము లును వివాహమునకు నిషిద్ధములు.

ఏకవింశతి మహాదోషములను పరిహరించి, అష్టమశుద్ధి మొదలగు ఇతరాంశములను చూచుకొని వివాహలగ్నమును నిర్ణయింపవలెను.

---

### బాల వైధవ్యయోగ పరిహారము

కన్యక జాతకమునుబట్టి బాలవైధవ్యయోగ ముండెనేని ఆ కన్యకయొక్క తండ్రి ఆ కన్యక చేతనే సావిత్రీవ్రతమును గాని, పిప్పలవ్రతమును గాని చేయించి ఆ కన్యను విష్ణుప్రతిమ అశ్వత్థఘటములకు రహస్యముగా నిచ్చి వివాహమును చేసి చిరంజీవియైన వరునికిచ్చి వివాహము చేయవలయును. అట్లు రెండుమార్లు పెండ్లి చేసినందున ఏ దోషమును లేకపోవును.

## శ్రీ విజయనామ సంవత్సరమున వివాహ సుముహూర్తములు (2013–'14 AD)

| సంఖ్య | తేదీ | మాసము-తిథి | వారము | నక్షత్రము | లగ్నకాలము |
|---|---|---|---|---|---|
| 1. | 01-05-2013 | చైత్ర బ. ౭ | బుధ | ఉ.షా. | సింహ ప 2-30 |
| 2. | 12-05-2013 | వైశా శు. ౩ | ఆది | రోహి | సింహ ప 1-48 |
| 3. | 23-05-2013 | వైశా శు. ౧౩ | గురు | స్వాతి | సింహ ప 1-03 |
| 4. | 29-05-2013 | వైశా బ. ౪ | బుధ | ఉ.షా. | వృష ఉ 6-40 |
| 5. | 02-06-2013 | వైశా బ. ౯ | ఆది | ఉ.భా. | మిథు ఉ 8-15 |
| 6. | 05-07-2013 | జ్యేష్ఠ బ. ౧౩ | శుక్ర | రోహి | కర్కా ఉ 7-03 |
| 7. | 08-08-2013 | శ్రావ శు. ౨ | గురు | మఘ | సింహ ఉ 8-03 |
| 8. | 11-08-2013 | శ్రావ శు. ౫ | ఆది | హస్త | సింహ ఉ 7-50 |
| 9. | 17-08-2013 | శ్రావ శు. ౧౧ | శని | మూల | కన్య ఉ 8-30 |
| 10. | 23-08-2013 | శ్రావ బ. ౩ | శుక్ర | ఉ.భా. | కుంభ రా 7-26 |
| 11. | 24-08-2013 | శ్రావ బ. ౫ | శని | రేవ | మిథు రా 2-51 |
| 12. | 23-10-2013 | అశ్వ బ. ౫ | బుధ | మృగ | కన్య తె 4-38 |
| 13. | 07-11-2013 | కార్తి శు. ౫ | గురు | మూల | ధను ఉ 9-40 |
| 14. | 09-11-2013 | కార్తి శు. ౭ | శని | ఉ.షా. | వృశ్చి ఉ 8-30 |
| 15. | 13-11-2013 | కార్తి శు. ౧౧ | బుధ | ఉ.భా. | ధను ప 10-14 |
| 16. | 15-11-2013 | కార్తి శు. ౧౩ | శుక్ర | రేవ | వృశ్చి ఉ 6-56 |
| 17. | 19-11-2013 | కార్తి బ. ౩ | మంగళ | మృగ | కన్య రా 2-52 |
| 18. | 28-11-2013 | కార్తి బ. ౧౦ | గురు | ఉ.ఫ. | ధను ఉ 9-15 |
| 19. | 29-11-2013 | కార్తి బ. ౧౧ | శుక్ర | హస్త | ధను ఉ 9-11 |
| 20. | 12-12-2013 | మార్గ శు. ౧౧ | గురు | రేవ | మకర ఉ 9-50 |
| 21. | 09-02-2014 | మాఘ శు. ౧౦ | ఆది | రోహి | కుంభ ఉ 8-16 |
| 22. | 14-02-2014 | మాఘ శు. ౧౫ | శుక్ర | మఘ | ధను తె 4-09 |
| 23. | 07-03-2014 | ఫాల్గు శు. ౭ | శుక్ర | రోహి | కన్య రా 7-44 |



ఈ సుముహూర్తముల విషయమై, "నక్షత్రం శతగుణం భవేత్త"ను నట్లు శాస్త్రోక్త నక్షత్రము లందే వివాహలగ్నములు నిర్ణయింపఁబడినవి. తిథుల విషయమై, శూన్య తిథులు (చవితి-నవమి-చతుర్దశి), షష్ఠి, అష్టమి, ద్వాదశి తిథులు పరిహరింపఁబడినవి. సోమ మంగళ వారములందు వివాహము నిషిద్ధము గనుక, మధ్యమ పక్షములో "న వారదోషాః ప్రభవన్తి రాత్రౌ" అనునట్లు రాత్రి కాలములందు మాత్రమె సుముహూర్త నిర్ణయము చేయఁబడినది.

వధూవరులకు తారాబల, చంద్రబలములు; ఏకర్క్ష-త్రిజ్యేష్ఠ-లగ్నాష్ట మాద్యనేక విషయములను పరిశీలించి, చక్రశుద్ధిని యితరాంశములను చూచు కొనవలయును. వధూవరులకు గ్రహబలము చాలనిచో, యథావిధి శాంతి జరిపించి, వివాహము చేయవలయును.

వివాహమునకు పరస్పర వేధ నక్షత్రములు : అశ్వి-జ్యేష్ఠ, భర-అనూ, కృత్తి-విశా, రోహి-స్వాతి, ఆర్ద్ర-శ్రవ, పున-ఉషా, పుష్య-పూషా, ఆశ్లే-మూల, మఘ-రేవ, పూఫ-ఉభా, ఉఫ-పూభా, హస్త-శత, మృగ-చిత్త-ధని ఈ నక్షత్రములకు పరస్పర వేధ యుండును గావున వివాహము చేయరాదు. మేనమామ కూతురైనచో, నిషిద్ధము గాదు.

**కుజదోషము :** శ్లో॥ ధనవ్యయే చ పాతాళే, జామిత్రే చాఽష్టమే కుజే ।
స్త్రీణాం భర్తృవినాశాయ, పుంసాం భార్యా వినాశనమ్ ॥

**లగ్నబలము :** శ్లో॥ శుక్రః పంచసహస్రాణి, బుధః పంచశతాని చ ।
లక్షమేకం తు దోషాణాం, కేంద్రే గురుర్వ్యపోహతి ॥

### పునర్వివాహ విషయము

స్త్రీ పునర్వివాహ విషయమై, శాస్త్రోక్తములైన 11 నక్షత్రములతో పాటు అశ్వి, చిత్ర, శ్రవ, ధని, పుష్య, పూ.ఫ. నక్షత్రములు కూడ పనికివచ్చునని చెప్పఁబడినది. కాని, కొందఱు పంచాంగకర్తలు ఈ పునర్వివాహ నక్షత్రములందే సుముహూర్తములు నిర్ణయించుచున్నారు. అది తప్పని వారెఱుంగుదురు గాక.

### సర్వజనావశ్యకములు

పిల్లవాఁడు లేని ఉయ్యెలను ఊఁచినయెడల పిల్లవానికి కడుపునొప్పి కలుగును. పసిపాపను గర్భిణిస్త్రీ తాఁకినయెడల ఆ పసిపాప కృశించిపోవును. పాదుకలకు, పీటలకు, మంచమునకు, మేజాబల్లలకు, బెంచిబల్లలకు యెదురు నాలుక గల కొయ్యలు తగవు. ౩-౧౩-౮-౧౮ ఈ తేదులయందు యేకార్యములను చేయఁగూడదు. శిఖరము లేని దేవస్థానమం దున్న దేవునికి నమస్కరింపరాదు.

శ్రీ గణేశాయనమః । శ్రీ హనుమతే నమః । శ్రీ గురుభ్యోనమః । శ్రీరస్తు । శుభమస్తు । అవిఘ్నమస్తు ॥

**శ్రీ చాంద్రమాన (27-వ) విజయనామ సం॥రే, ఉత్తరాయణే, వసన్తఋతౌ, చైత్రమాసః, కలిగతం 5113, శక సం॥ 1935**

శు క్ల ప క్షః

| క్రీ॥శ॥ 2013 | శకసం॥ ౧౯౩౫ | తిథిః - శుక్లపక్షః | వాసరః | నక్షత్రమ్ | యోగః | కరణమ్ | వర్జ్యకాలః | వ్రతాది విశేషాః |
|---|---|---|---|---|---|---|---|---|
| ఏప్రిల్ 11 | చైత్ర ౨౧ | ప్రతిపత్ ప 3-59 | గురు | అశ్విని రా 11-07 | విష్కంభం రా 2-49 | బవ ప 3-59 | సా 6-52 ల 8-35 వ | ఉగాది పండుగ - తెలుగు సంవత్సరాది శ్వేతవరాహ కల్పాది, చంద్ర వ్రతం మాసశూన్య నక్షత్రం |
| 12 | ౨౨ | ద్వితీయ సా 5-24 | శుక్ర | భరణి రా 1-15 | ప్రీతి రా 3-03 | కౌలవ సా 5-24 | ఉ 9-33 ల 11-18 వ | ముద్గరయోగం - కార్యహాని |
| 13 | ౨౩ | తృతీయ రా 7-18 | శని | కృత్తిక రా 3-49 | ఆయుష్మాన్ రా 3-38 | తైతుల ఉ 6-21 | ప 2-32 ల 4-19 వ | డోలాగౌరీ వ్రతం, శ్రీమత్స్య జయన్తి అరుంధతీ వ్రతం, ఉత్తమమన్వాది జుమాదుస్సాని నెల-6 (1434 హిజరీ సం॥) **అశ్వి 1 మేష రవిః రా 1-29** |
| 14 | ౨౪ | చతుర్థి రా 9-35 | ఆది | రోహిణి పూర్తి | సౌభాగ్య తె 4-29 | వణిజ ఉ 8-26 | రా 9-45 ల 11-33 వ | గణేశ దమనపూజ, తమిళ సంవత్సరాది మాసశూన్యనక్షత్రం, కల్యాది గతాబ్దాః 5114 సౌర సం॥ ప్రారంభము, గమన నిషిద్ధం మేషసంక్రమణ పుణ్యకాలం, విషు, వైశాఖి |
| 15 | ౨౫ | పంచమి రా 12-06 | సోమ | రోహిణి ఉ 6-43 | శోభన తె 5-28 | బవ ప 10-50 | ప 1-03 ల 2-51 వ | శ్రీపంచమి, నాగవ్రతం, హయవ్రతం పంచ మహాభూతవ్రతం, కూర్మ కల్పాది |
| 16 | ౨౬ | షష్ఠి రా 2-38 | మంగళ | మృగశిర ఉ 9-46 | అతిగండ పూర్తి | కౌలవ ప 1-22 | రా 7-15 ల 9-03 వ | స్కంద షష్ఠి, కుమారస్వామికి దమనపూజ భౌమ షష్ఠి |
| 17 | ౨౭ | సప్తమి తె 4-59 | బుధ | ఆర్ద్ర ప 12-47 | అతిగండ ఉ 6-26 | గరజి ప 3-48 | రా 2-12 ల 3-59 వ | అర్కవ్ర॥ (నక్తమశనం), అశ్వి 2 రవిః ప 11-13 శ్రీహైమాలయ వార్షికోత్సవం - జిల్లేళ్ళమూడి |



**(4) శుక్రచారః**

**2014 సం॥**

| | | | | |
|---|---|---|---|---|
| మార్చ్ | 2 | ఉ.షా. | 3 (మకరే) | గం. 21-29 |
| | 6 | ఉ.షా. | 4 | గం. 23-16 |
| | 10 | శ్రవ | 1 | గం. 19-41 |
| | 14 | శ్రవ | 2 | గం. 12-06 |
| | 17 | శ్రవ | 3 | గం. 25-25 |
| | 21 | శ్రవ | 4 | గం. 12-15 |
| | 24 | ధని | 1 | గం. 21-05 |
| | 27 | ధని | 2 | గం. 28-17 |
| మార్చ్ | 31 | ధని | 3 కుంభే శుక్రః | గం. 10-04 |
| ఏప్రిల్ | 3 | ధని | 4 | గం. 14-44 |

**(5) శని చారః**

మార్చ్ 2 శని వక్రారంభః గం. 21-50
(తత్కాల స్ఫుటః 209°-16')

మే 1 విశా 2 గం. 12-24

**(6) రాహు కేతుచారౌ**

మార్చ్ 8 చిత్రా 4 రాహుః, అశ్వి 2 కేతుః } గం. 27-33

శ్రీ విజయనామ సంవత్సర గ్రహచారములు సంపూర్ణము

## నవగ్రహ శాంతి చక్రము

| నవగ్రహములు | నవ ధాన్యములు | నవ రత్నములు | నవ సమిధలు | నవగ్రహ జపసంఖ్య |
|---|---|---|---|---|
| 1. రవి | గోధుమలు | మాణిక్యము | జిల్లేడు | 7,000 |
| 2. చంద్రుఁడు | వడ్లు | ముత్యము | మోదుగు | 11,000 |
| 3. కుజుఁడు | కందులు | పగడము | చండ్ర | 10,000 |
| 4. బుధుఁడు | పెసలు | గరుడపచ్చ | ఉత్తరేణి | 9,000 |
| 5. గురువు | సెనగలు | పుష్యరాగము | రావి | 19,000 |
| 6. శుక్రుఁడు | అలచందలు | వజ్రము | మేడి* | 16,000 |
| 7. శని | నువ్వులు | నీలము | జమ్మి | 23,000 |
| 8. రాహువు | మినుములు | గోమేధికము | దూర్వ | 18,000 |
| 9. కేతువు | ఉలవలు | వైడూర్యము | దర్భలు | 17,000 |

**నవధాన్యములు :** శ్లో॥ గోధూమశ్శాలిరాఢకీ, ముద్గశ్చణకయావకౌ ।
తిల మాషకులుత్థాశ్చ, నవధాన్యాని జజ్ఞిరే ॥ (అ.కృ.శ.)

* ఔదుంబరము

## గ్రహములకు అష్టవిధ గతులు

శ్లో॥ వక్రానువక్రా కుటిలా, మందా మందతరా సమా ।
శీఘ్రా శీఘ్రతరా జ్ఞేయా, గ్రహాణా మష్టధా గతిః ॥ (సూర్యసిద్ధాంతము)

# దేశాంతర సంస్కార చక్రము

ఈ పంచాంగములో శ్రీ విజయ సం॥ లగ్నసారణిలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యపట్టణమైన హైదరాబాద్ నగరమునకు, మేషాది లగ్నాంత కాలములు వ్రాయఁబడినవి; ఇవి యెట్టి వ్యత్యాసములును లేకుండా, 17° ఉత్తర అక్షాంశలపై నున్నట్టి రాజమండ్రి, ఏలూరు, అమలాపురం, విజయవాడ, కాకినాడ, ఖమ్మం, మహబూబ్‌నగర్, బీజపూర్, కొల్హాపూర్ నగర ప్రాంతములకు సరిపోవును. ఇతరములైన 92 నగర, పట్టణ ప్రాంతములకు దేశాంతర సంస్కారమును నిమిషములలో, యీ దిగువ పట్టికలో చూపియున్నాము.

| నగర, గ్రామ ప్రాంతములు | మేష | వృష | మిథు | కర్కా | సింహ | కన్యా | తుల | వృశ్చి | ధనుః | మకర | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. మైసూరు, సేలం, పాండిచ్చేరి, చిదంబరం, ధర్మపురి, పోర్ట్‌బ్లైయర్ (12°N) | +5 | +2 | –1 | –4 | –6 | –5 | –4 | –2 | +1 | +4 | +5 | +4 |
| 2. మద్రాసు, కంచి, బెంగుళూరు, మాంగళూరు, చిత్తూరు, ఉడుపి, వెల్లూరు, మహాబలిపురం, కోలార్, కవలూర్ (13°N) | +4 | +2 | –1 | –3 | –4 | –4 | –3 | –2 | +1 | +3 | +4 | +3 |
| 3. తిరుపతి, నెల్లూరు, కడప, గూడూరు, కాళహస్తి, హిందూపూర్, షిమోగా (14°N) | +3 | +1 | – | –2 | –4 | –3 | –2 | –2 | +1 | +2 | +3 | +2 |
| 4. అనంతపురం, ఒంగోలు, బళ్ళారి, హుబ్లీ ధార్వార్, పనాజీ (15°N) | +2 | – | – | –1 | –3 | –2 | –1 | –1 | – | +2 | +2 | +1 |
| 5. గుంటూరు, తెనాలి, బాపట్ల, చీరాల, బందరు, గుడివాడ, ఆదోని, కర్నూల్, బెల్గాం, రాయచూర్ (16°N) | +2 | – | – | –1 | –2 | –1 | –1 | +1 | – | +1 | +2 | – |
| 6. శ్రీకాకుళం, విశాఖపట్నం, విజయనగరం, వాల్తేరు, భద్రాచలం, అనకాపల్లి, వరంగల్లు, మెదక్, షోలాపూర్ (18°N) | – | – | – | – | – | +1 | –1 | – | – | – | – | –2 |



| నగర, గ్రామ ప్రాంతములు | మేష | వృష | మిథు | కర్కా | సింహ | కన్యా | తుల | వృశ్చి | ధనుః | మకర | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 7. ముంబాయి, పుణే, నాందేడ్, బెర్హంపూర్, నిజామాబాద్, కోరాపుట్ (19°N) | –1 | –1 | – | +1 | +1 | +2 | +2 | – | – | –1 | –1 | –2 |
| 8. పూరీ, భువనేశ్వర్, ఎల్లోరా, నాసిక్, అదిలాబాద్, కటక్ (20°N) | –2 | –2 | +1 | +2 | +2 | +3 | +2 | +1 | – | –2 | –2 | –4 |
| 9. ద్వారక, రాయఘర్, రాజ్‌కోట్, వడోదర, రూర్కేలా (22°N) | –3 | –2 | +1 | +3 | +4 | +5 | +4 | +1 | –1 | –3 | –4 | –5 |
| 10. కోల్కత, ఉజ్జయిని, రాంచీ, నవద్వీప్, గాంధీనగర్ (23°N) | –4 | –3 | +1 | +4 | +4 | +5 | +4 | +2 | –1 | –3 | –4 | –6 |
| 11. వారణాశి, అలహాబాద్, ఇంఫాల్ (25°N) | –6 | –4 | +2 | +5 | +6 | +8 | +7 | +3 | –1 | –5 | –7 | –8 |
| 12. లక్నో, మధుర, జైపూర్, గ్యాంగ్‌టక్, కాన్పూర్, ఐతానగర్ (27°N) | –8 | –4 | +2 | +7 | +8 | +10 | +8 | +4 | –2 | –6 | –8 | –10 |
| 13. ఢిల్లీ, ఘజియాబాద్, గుర్గాం, నైనిటాల్, మీరట్ (29°N) | –9 | –5 | +2 | +8 | +10 | +11 | +10 | +4 | –2 | –8 | –10 | –12 |
| 14. బద్రీనాథ్, హరిద్వార్, జలంధర్, లూథియానా, చండీఘర్, సిమ్లా (31°N) | –10 | –6 | +3 | +9 | +11 | +13 | +11 | +5 | –2 | –9 | –12 | –14 |
| 15. రామేశ్వరం, తిరువనంతపురం (9°N) | +7 | +3 | –1 | –5 | –8 | –7 | –6 | –4 | +2 | +5 | +8 | +6 |

**శ్రీ నందన/విజయ సం॥ర లగ్నసారణి - కలిగతం 5113, మీన మాసము (2013 AD), హైదరాబాద్ (ఆంధ్రప్రదేశ్)**

సూర్యోదయాస్తమయములు, (భుక్తి), లగ్నాంతకాలములును భారత కాలమానపు గంటలు, నిమిషములలో వ్రాయబడినవి.

| తేది | | ఉద॥ | అస్త॥ | అహస్సు | భుక్తి | మీన | మేష | వృష | మిథు | కర్కా | సింహ | కన్య | తుల | వృశ్చి | ధనుః | మకర | కుంభ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| నందన సం॥ 2013 మార్చి | 15 | 6-25 | 18-26 | 12-01 | 0-02 | 8-00 | 9-45 | 11-46 | 13-58 | 16-10 | 18-18 | 20-24 | 22-34 | 24-48 | 26-54 | 28-45 | 30-23 |
| | 16 | 6-24 | 18-26 | 12-02 | 0-05 | 7-56 | 9-41 | 11-42 | 13-54 | 16-06 | 18-14 | 20-20 | 22-30 | 24-44 | 26-50 | 28-41 | 30-19 |
| | 17 | 6-23 | 18-26 | 12-03 | 0-08 | 7-52 | 9-37 | 11-38 | 13-50 | 16-02 | 18-10 | 20-16 | 22-26 | 24-40 | 26-46 | 28-37 | 30-15 |
| | 18 | 6-22 | 18-26 | 12-04 | 0-12 | 7-47 | 9-32 | 11-33 | 13-45 | 15-57 | 18-05 | 20-11 | 22-21 | 24-35 | 26-41 | 28-32 | 30-10 |
| | 19 | 6-21 | 18-26 | 12-05 | 0-15 | 7-43 | 9-28 | 11-29 | 13-41 | 15-53 | 18-01 | 20-07 | 22-17 | 24-31 | 26-37 | 28-28 | 30-06 |
| | 20 | 6-21 | 18-27 | 12-06 | 0-18 | 7-40 | 9-25 | 11-26 | 13-38 | 15-50 | 17-58 | 20-04 | 22-14 | 24-28 | 26-34 | 28-25 | 30-03 |
| | 21 | 6-20 | 18-27 | 12-07 | 0-21 | 7-36 | 9-21 | 11-22 | 13-34 | 15-46 | 17-54 | 20-00 | 22-10 | 24-24 | 26-30 | 28-21 | 29-59 |
| | 22 | 6-19 | 18-27 | 12-08 | 0-24 | 7-32 | 9-17 | 11-18 | 13-30 | 15-42 | 17-50 | 19-56 | 22-06 | 24-20 | 26-26 | 28-17 | 29-55 |
| | 23 | 6-19 | 18-28 | 12-09 | 0-28 | 7-28 | 9-13 | 11-14 | 13-26 | 15-38 | 17-46 | 19-52 | 22-02 | 24-16 | 26-22 | 28-13 | 29-51 |
| | 24 | 6-18 | 18-28 | 12-10 | 0-31 | 7-24 | 9-09 | 11-10 | 13-22 | 15-34 | 17-42 | 19-48 | 21-58 | 24-12 | 26-18 | 28-09 | 29-47 |
| | 25 | 6-17 | 18-28 | 12-11 | 0-34 | 7-20 | 9-05 | 11-06 | 13-18 | 15-30 | 17-38 | 19-44 | 21-54 | 24-08 | 26-14 | 28-05 | 29-43 |
| | 26 | 6-16 | 18-28 | 12-12 | 0-37 | 7-16 | 9-01 | 11-02 | 13-14 | 15-26 | 17-34 | 19-40 | 21-50 | 24-04 | 26-10 | 28-01 | 29-39 |
| | 27 | 6-15 | 18-28 | 12-13 | 0-40 | 7-12 | 8-57 | 10-58 | 13-10 | 15-22 | 17-30 | 19-36 | 21-46 | 24-00 | 26-06 | 27-57 | 29-35 |
| | 28 | 6-14 | 18-28 | 12-14 | 0-44 | 7-07 | 8-52 | 10-53 | 13-05 | 15-17 | 17-25 | 19-31 | 21-41 | 23-55 | 26-01 | 27-52 | 29-30 |
| | 29 | 6-13 | 18-29 | 12-16 | 0-47 | 7-03 | 8-48 | 10-49 | 13-01 | 15-13 | 17-21 | 19-27 | 21-37 | 23-51 | 25-57 | 27-48 | 29-26 |
| | 30 | 6-12 | 18-29 | 12-17 | 0-50 | 6-59 | 8-44 | 10-45 | 12-57 | 15-09 | 17-17 | 19-23 | 21-33 | 23-47 | 25-53 | 27-44 | 29-22 |
| | 31 | 6-12 | 18-29 | 12-17 | 0-53 | 6-56 | 8-41 | 10-42 | 12-54 | 15-06 | 17-14 | 19-20 | 21-30 | 23-44 | 25-50 | 27-41 | 29-19 |
| ఏప్రిల్ | 1 | 6-11 | 18-29 | 12-18 | 0-56 | 6-52 | 8-37 | 10-38 | 12-50 | 15-02 | 17-10 | 19-16 | 21-26 | 23-40 | 25-46 | 27-37 | 29-15 |
| | 2 | 6-11 | 18-29 | 12-18 | 1-00 | 6-48 | 8-33 | 10-34 | 12-46 | 14-58 | 17-06 | 19-12 | 21-22 | 23-36 | 25-42 | 27-33 | 29-11 |
| | 3 | 6-10 | 18-29 | 12-19 | 1-03 | 6-44 | 8-29 | 10-30 | 12-42 | 14-54 | 17-02 | 19-08 | 21-18 | 23-32 | 25-38 | 27-29 | 29-07 |
| | 4 | 6-09 | 18-29 | 12-20 | 1-06 | 6-40 | 8-25 | 10-26 | 12-38 | 14-50 | 16-58 | 19-04 | 21-14 | 23-28 | 25-34 | 27-25 | 29-03 |
| | 5 | 6-08 | 18-30 | 12-22 | 1-09 | 6-36 | 8-21 | 10-22 | 12-34 | 14-46 | 16-54 | 19-00 | 21-10 | 23-24 | 25-30 | 27-21 | 28-59 |
| | 6 | 6-07 | 18-30 | 12-23 | 1-12 | 6-32 | 8-17 | 10-18 | 12-30 | 14-42 | 16-50 | 18-56 | 21-06 | 23-20 | 25-26 | 27-17 | 28-55 |
| | 7 | 6-06 | 18-30 | 12-24 | 1-16 | 6-27 | 8-12 | 10-13 | 12-25 | 14-37 | 16-45 | 18-51 | 21-01 | 23-15 | 25-21 | 27-12 | 28-50 |
| | 8 | 6-05 | 18-31 | 12-26 | 1-19 | 6-23 | 8-08 | 10-09 | 12-21 | 14-33 | 16-41 | 18-47 | 20-57 | 23-11 | 25-17 | 27-08 | 28-46 |
| | 9 | 6-04 | 18-31 | 12-27 | 1-22 | 6-19 | 8-04 | 10-05 | 12-17 | 14-29 | 16-37 | 18-43 | 20-53 | 23-07 | 25-13 | 27-04 | 28-42 |
| | 10 | 6-04 | 18-31 | 12-27 | 1-25 | 6-16 | 8-01 | 10-02 | 12-14 | 14-26 | 16-34 | 18-40 | 20-50 | 23-04 | 25-10 | 27-01 | 28-39 |
| విజయ సం॥ | 11 | 6-03 | 18-31 | 12-28 | 1-28 | 6-12 | 7-57 | 9-58 | 12-10 | 14-22 | 16-30 | 18-36 | 20-46 | 23-00 | 25-06 | 26-57 | 28-35 |
| | 12 | 6-03 | 18-32 | 12-29 | 1-32 | 6-08 | 7-53 | 9-54 | 12-06 | 14-18 | 16-26 | 18-32 | 20-42 | 22-56 | 25-02 | 26-53 | 28-31 |
| | 13 | 6-02 | 18-32 | 12-30 | 1-35 | 6-04 | 7-49 | 9-50 | 12-02 | 14-14 | 16-22 | 18-28 | 20-38 | 22-52 | 24-58 | 26-49 | 28-27 |



## ఆంధ్రప్రదేశ్ - హైదరాబాద్ నగరమునకు లగ్న ప్రమాణములు - పుష్కరాంశలు

ప్రకృతము అయనాంశలు రమారమి 24 (6-12-2009 ఆదివారము ఉ.గం.5-29 ని॥లకు నికరముగా 24° స్ఫుట అయనాంశలు) అయినందున, తదనుగుణముగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమునకు (హైదరాబాద్ అక్షాంశ 17-26 ఉ॥) లగ్న ప్రమాణములు పుష్కరాంశలును, గం. ని.లలో ఈ దిగువ చూపబడినవి. ఇవి 80 సంవత్సరముల వరకు, అనగా క్రీ॥శ॥ 2090 వరకు సరిపోవును.

| లగ్నము | ప్రమా॥ | పుష్క॥ | లగ్నం | ప్రమా॥ | పుష్క॥ |
|---|---|---|---|---|---|
| మేష | 1-45 | 1-13 | తుల | 2-10 | 1-44 |
| వృష | 2-01 | 0-56 | వృశ్చి | 2-14 | 0-31 |
| మిథు | 2-12 | 1-46 | ధను | 2-06 | 1-28 |
| కర్కా | 2-12 | 0-31 | మకర | 1-51 | 0-52 |
| సింహ | 2-08 | 1-30 | కుంభ | 1-38 | 1-18 |
| కన్య | 2-06 | 0-59 | మీన | 1-37 | 0-23 |

**పుష్కరాంశలు :** మేష, సింహ, ధనుస్సులలో 21, వృషభ కన్యా మకరములలో 14, మిథున తులా కుంభములలో 24, కర్కట వృశ్చిక మీనములలో 7ను పుష్కరాంశలు :

శ్లో॥ ఏకవింశో మనుశ్చైవ, చతుర్వింశతి సప్త చ ।
మేషాది మీన పర్యన్తం పుష్కరాంశాః ప్రకీర్తితాః ॥

### కొన్ని ముఖ్య నగరములకు లగ్న ప్రమాణములు (ఘ॥వి॥లలో)

| | లగ్నము | చెన్నయి 13°-04' ఉ | ముంబాయి 18°-58' ఉ | కోల్కత 22°-35' ఉ | ఢిల్లీ 28°-39' ఉ |
|---|---|---|---|---|---|
| 1. | మేష | 4-32 | 4-20 | 4-13 | 4-00 |
| 2. | వృష | 5-07 | 5-00 | 4-56 | 4-51 |
| 3. | మిథు | 5-28 | 5-31 | 5-33 | 5-36 |
| 4. | కర్కా | 5-23 | 5-33 | 5-39 | 5-50 |
| 5. | సింహ | 5-09 | 5-22 | 5-30 | 5-45 |
| 6. | కన్య | 5-06 | 5-19 | 5-28 | 5-43 |
| 7. | తుల | 5-18 | 5-29 | 5-36 | 5-49 |
| 8. | వృశ్చి | 5-30 | 5-36 | 5-39 | 5-45 |
| 9. | ధను | 5-18 | 5-15 | 5-13 | 5-10 |
| 10. | మకర | 4-44 | 4-35 | 4-29 | 4-18 |
| 11. | కుంభ | 4-15 | 4-03 | 3-55 | 3-40 |
| 12. | మీన | 4-10 | 3-57 | 3-49 | 3-33 |

# సూర్య సిద్ధాన్తీయ నిరయణ మధ్య గ్రహాదులకు బీజ సంస్కారము

**క్రీ.శ.2013సం॥ మార్చినెల22వతేదీ ఉ.గం.5-30ని॥లకు(భారతకాలమానము)**

**(శ్రీ విజయ సం॥) మధ్యమ అయనాంశలు : 24°-02'-43".9**

| | సూర్య సిద్ధాంతరీత్యా మధ్య గ్రహాదులు | | | | బీజ సంస్కారము | | | ఆధునిక గ్రహ గణిత రీత్యా మధ్య గ్రహాదులు | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | రా | ° | ' | " | ° | ' | " | రా | ° | ' | " |
| మధ్య రవి | 11 | 05 | 17 | 26.7 | +0 | 19 | 56.5 | 11 | 05 | 37 | 23.2 |
| రవి శీఘ్రోచ్ఛ (రవి మందోచ్ఛ +180°) | 8 | 17 | 17 | 41.9 | +1 | 49 | 52.7 | 8 | 19 | 07 | 34.6 |
| మధ్య చంద్రుఁడు | 3 | 06 | 21 | 27.8 | +0 | 09 | 13.2 | 3 | 06 | 30 | 41.0 |
| చంద్ర శీఘ్రోచ్ఛ (చంద్ర మందోచ్ఛ +180°) | 8 | 03 | 03 | 10.1 | -5 | 49 | 22.9 | 7 | 27 | 13 | 47.2 |
| రాహువు | 6 | 29 | 14 | 02.9 | -3 | 55 | 14.6 | 6 | 25 | 18 | 48.3 |
| బుధ శీఘ్రోచ్ఛ* | 6 | 14 | 28 | 30.4 | -6 | 13 | 20.2 | 6 | 08 | 15 | 10.2 |
| శుక్ర శీఘ్రోచ్ఛ* | 11 | 12 | 24 | 20.3 | -8 | 23 | 47.1 | 11 | 04 | 00 | 33.2 |
| మధ్య కుజుఁడు | 11 | 10 | 05 | 59.5 | +1 | 47 | 02.1 | 11 | 11 | 53 | 01.6 |
| మధ్య గురువు | 1 | 26 | 20 | 23.7 | -4 | 38 | 21.4 | 1 | 21 | 42 | 02.3 |
| మధ్య శని | 6 | 01 | 33 | 28.0 | +6 | 13 | 12.1 | 6 | 07 | 46 | 40.1 |

* బుధ, శుక్రుల మధ్యస్థానములు, వాని శీఘ్రోచ్ఛల వద్ద సాధింపబడుచున్నవి.
(శీఘ్రోచ్ఛ = Perigee)

**అక్షర సంధిగల పేర్లు :** కృష్ణ - మృగ 3, హృష్ణ - స్వాతి 1, శ్రీధర - చిత్త 4, క్షేత్రపాల - హస్త 2, జ్ఞాన - ఆర్ద్ర 3, భీమ - మూల 4, భైరవ - పూ.షా. 3, బ్రహ్మ - చిత్త 3, ప్రభాకర - చిత్త 4; ద్రోణ, ద్రౌపది - స్వాతి 3, ఫణి - ఉ.ఫ. 3.



## జననశాంతి విషయములు

అశ్వి 1, భర 4, కృత్తిక 3, పుష్యమి 2-3, మఘ 3, ఉత్తర 1, ఉ.షా. 1, ఈ నక్షత్రపాదములందు పురుషజననమైనచో పితృగండము, స్త్రీజననమైనచో మాతృగండము. అశ్విని 1, మఘ 2, రేవతి 4 ఈ నక్షత్రపాదములందు జన్మించిన శిశువునకు బాలారిష్టము. హస్త 3, చిత్త 1-2, పూషా 3, రోహిణి 1-2 పాదములు తల్లికిని మేనమామకును గండములు. రోహిణీ నక్షత్రమునందు సాధారణముగ మేనమామకు గండము. 1-2 పాదములు తల్లికిని, 3-4 పాదములు మేనమామకు గండమును సూచించును. ఆశ్లేష 2వ పాదము శిశువునకు, 3వ పాదము తల్లికిని, 4వ పాదము తండ్రికిని గండము. విశాఖలో పురుషజన్మయైన మేనమామకు, స్త్రీజన్మయైన పినతండ్రికి అరిష్టము. జ్యేష్ఠా నక్షత్రము మిక్కిలి అరిష్టప్రదమయినది. 3-4 పాదములు విశేషముగా దుష్ఫలము నిచ్చును. మూల 1వ పాదము తండ్రికిని, 2వ పాదము తల్లికిని గండము.

జన్మలగ్నమునకు రవి 5ట, చంద్రుడు 8ట, అంగారకుడు 7ట, బుధుడు 4ట, గురువు 3ట, శని లగ్నమున, రాహువు 9ట, కేతువు 1టను ఉన్నచో బాలారిష్టము కలుగును. మఱియు లగ్నసంధులలో, అనగా కర్కట వృశ్చిక మీనరాసులందు చివరి అర్ధభాగలో జననమైనచో, శిశువునకు ప్రబల గండము. బాలారిష్టము ఒక 'బృహస్పతి భగణము' లేక 12 సంవత్సరము లుండును.

దుష్టనక్షత్రమున శిశువు జన్మించిన యెడల నవగ్రహ జపము, రుద్రాభిషేకము, మృత్యుంజయ జపము, దానములు శాస్త్రోక్తవిధిగా చేసినచో బాలారిష్టము తొలగి శిశువునకు పూర్ణాయువు కలుగును. శిశువును 21వ రోజున ఊయలలో వేయవలెను.

## ప్రథమ రజస్వలకు ఫలము

చవితి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి, అమావాస్య - ఈ తిథులందును, ఆది మంగళ శని వారములందును, భరణి కృత్తి ఆర్ద్ర పుబ్బ చిత్త జ్యేష్ఠ పూషా పూభా నక్షత్రములందును ప్రథమ రజస్వల యైనచో శాంతి చేయవలయును. విష్కంభ, అతిగండ, శూల, గండ, వ్యాఘాత, వజ్ర, వ్యతీపాత, పరిఘ, వైధృతి యోగములందును; బవ, గరజి, విష్టి, శకుని, చతుష్పద, కింస్తుఘ్న కరణములందును రజస్వలయైనచో శాంతి గావింపవలయును. అపరాహ్ణము, సాయంకాలము, సంధ్యలందును, అర్ధరాత్రి, నిశాంత సమయమందును; గ్రామ బహిఃప్రదేశములందును, పరగృహము లందును మంచిది కాదు. జీర్ణ మలిన వస్త్రములు, రక్తవస్త్రము, నల్లనివస్త్రములు ధరించినను, దిగంబరియై యున్నను అశుభము. మేష, కర్కట, వృశ్చిక, ధనుః పూర్వార్థ, మకర లగ్నములు మంచివి కావు. యథావిధిగా శాంతి చేయవలెను.

## మృతి విషయములు

మరణకాలపు తిథి చెడ్డదైనచో స్వల్పదోషము, వారము దుష్టమైనచో అల్పదోషము, తిథి నక్షత్రములు రెండును చెడ్డవియైనచో అర్ధదోషము. వార నక్షత్రములు చోడ్డవియైనచో త్రిపాదదోషమగును. తిథి, వార, నక్షత్రములు మూడును చెడ్డవియైనచో సంపూర్ణ దోషము.

1, 2, 6, 7, 11, 12 (నంద, భద్ర తిథులు); ఆది, మంగళ, శుక్రవారములు; ద్విపాది, త్రిపాది నక్షత్రములు, ధనిష్ఠా పంచకము (ధని, శత, పూభా, ఉభా, రేవ); గండ, వ్యాఘాత, వ్యతీపాత, అతిగండ, వైధృతి, బ్రహ్మ, పరిఘ యోగములు; శకుని, చతుష్పద, విష్టి, కింస్తుఘ్న కరణములు - వీనిలో మరణము సంభవించినచో అరిష్టములు గలుగును.

కృత్తికా నక్షతమునందు మరణము సంభవించినచో 3 మాసములును, రోహిణి 5 మాసములు, మృగశిర 2 మాసములు, పునర్వసు 3, మఘ 5, ఉత్తరఫల్గుని 2, చిత్త 2, విశాఖ 2, పూర్వాషాఢ 3, ధనిష్ఠ 6, శతభిషము 6, పూర్వాభాద్ర 6, ఉత్తరాభాద్ర 6, రేవతి 6 మాసములు మరణ గృహమును విడువలెను. చనిపోయిన ద్రేశమును మూసిపెట్టియు, సంచారములేకయు నుంచి, ఒక అహోరాత్ర మైనను అఖండమును (నువ్వుల నూనె దీపమును) ప్రకాశింపజేయవలయును.

## అశౌచ నిర్ణయము

శిశువు ప్రాణముతో (బుట్టి, నాభిచ్ఛేదనకు పూర్వము మృతినొందినచో తల్లికి దశరాత్రములు జాతాశౌచము. తండ్రికి, జ్ఞాతులకును త్రిరాత్రము జాతాశౌచము. తక్కిన వారికి మృతాశౌచము స్నామాత్రముచే శుద్ధి యగును. మృత ప్రసవమైనను, నాభిచ్ఛేదన తరువాత శిశువు మరణించినను తల్లిదండ్రులకు జ్ఞాతులకు పది దినములు జాతాశౌచము, మృతాశౌచము స్నానమాత్రమున శుద్ధి. శిశువు పది దినములలోగా నెపుడుమరణించినను స్నానమాత్రముతో మృతాశౌచమును శుద్ధి చేసికొని, జననాదిగా పది దినములు జాతాశౌచమును పూర్తిగా పట్టవలెను. పది దినములు దాటిన తరువాత పదియవ మాసములోగా శిశువు మరణించిన యెడల, తల్లిదండ్రులకు త్రిరాత్రా శౌచమును; జ్ఞాతులకు స్నానమాత్రము. పదియవ మాసము మొదలు నాలుగేండ్లు పూర్తియగు రోజులోగా శిశువు మరణించినచో మాతాపితరులకు మూడుదినములు, జ్ఞాతులకు ఒక దినమును అశుచి. పదవ సంవత్సరము మొదలు ఉపనయన మయ్యెడులోగా బాలుడు, వివాహమయ్యెడు లోగా కన్య మరణించినచో తల్లి దండ్రులకు జ్ఞాతులకు మూడు దినములు అశౌచము. ఇంత వఱకు అతిక్రాంతాశుచి లేదు. అన్ని వర్ణముల వారికి జాతాశుచి పదిదినములే. మృతాశుచి బ్రాహ్మణులకు 10, క్షత్రియులకు 12, వైశ్యులకు 15, శూద్రులకు 30 దినములు. ఐదవ సంవత్సరములోపు మరణాశుచి అన్ని వర్ణముల వారికి సమానము.



ఐదవ వర్షము మొదలు ఉపనయనములోగా క్షత్రియ, వైశ్య బాలకుల మృతి యందును వివాహమగులోగా సర్వవర్ణ కుమారీ మరణమందును, 16 సంవత్సరముల వయస్సులోగా శూద్ర కుమారుల మరణమందును - అందఱకు త్రిరాత్రశుచి. గర్భిణి స్త్రీకి 3-4 మాసముల గర్భస్రావమందు మాససంఖ్యా తుల్య దినముల శుచి, భర్తకు స్నానమాత్రము. గర్భిణికి 5వ మాసముపై గర్భహతమైనపుడు, ఆమెకు మాస సంఖ్యాతుల్య దినములశుచి, భర్తకు త్రిరాత్రము జాతశుచి. జ్ఞాతులలో ఏకగ్రామ వాసులకు మూడు దినములును, అన్యగ్రామవాసులకు ఒక దినము జాతాశుచి.

గర్భిణి 7వ నెలపైన నెప్పుడు ప్రసవించినను సామాన్యముగా అందఱకును పది దినములు జాతాశుచి. వివాహమైన స్త్రీలకు తల్లిదండ్రులకు, సోదర, సోదరీలకు పరస్పర మృతియందు త్రిరాత్రాశుచి. మాతామహ మాతామహీలు, మేనత్తలు, మేనమామ, పినతల్లి, పెత్తల్లి, అత్తమామలు, అల్లుడు వీరల మరణమందు ఎచ్చుట నున్నను మూడు దినములు అశుచి. మేనత్త భర్త, మేనమామ భార్య, పినతల్లి పెత్తల్లు భర్త, మేనల్లుడు బావమఱది - వీరి మరణమందు సన్నిధిలో త్రిరాత్రము, అసన్నిధానమును పక్షిణి. స్త్రీలకు తమ తల్లిదండ్రులు, సవతి తల్లి సోదరుడు, కుమారై; అల్లుడు వీరల మృతియందు ఎచ్చట నున్నను త్రిరాత్రాశుచి. స్త్రీలు తమ సోదర, సోదరీ పుత్రులకు, పితామహీలకు, సవతి సోదర, సోదరీలకు మాతామహ మాతామహీలకు, మేనత్త మేనమామ, పినతల్లి పెత్తల్లులకు సన్నిధానమున ఒక రోజు, అసన్నిధానమున స్నానము మాత్రము.

పక్షిణి యన(గా రాత్రి మరణ విషయములో రెండు రాత్రులు, ఒక పగలు, పగటి మరణ విషయములో రెండు పగళ్ళు ఒక రాత్రియునని అర్థము. అసన్నిధానమున ఆయాకాలము దాటిన తరువాత వినిన, స్నానము మాత్రమే దశ రాత్రజ్ఞాతులు, దశాహానంతరము మూడు మాసములలోగా విన్నచో త్రిరాత్రమును, ఆఱు మాసములలోగా విన్నచో ఒక పక్షిణి, తొమ్మిది మాసములలోగా విన్నచో ఒక రోజును, ఆపైన స్నానమును - అతిక్రాంతాశుచి.

## బల్లిపాటునకు ఫలము

శిరస్సు మీద బల్లి పడిన కలహము. బ్రహ్మరంధ్రమునకు వెనుకబడిన లక్ష్మీ సంప్రాప్తి. నడినెత్తి రోగము, ముఖమున బంధుదర్శనము, మంగురుల మీద హాని, జడ మీద భర్తకు హాని, చెంపల పైన స్త్రీలకు శుభము. చెవి మీద దుర్వార్తాశ్రవణము, కుడి కన్ను మీద అపజయము, ఎడమకన్ను అవమానము, ముక్కు మీద కార్యహాని, మీసములపై అధికార లాభము, గడ్డముపై అపమృత్యువు, గొంతు ఎముక మీద అనేక కష్టములు, ఱొమ్మున జయము, గుండె మీద అధైర్యము, పై కడుపున పుత్రలాభము, భుజములపై అన్యసహాయము, బొడ్డున భయము, అరచేతిపై ధనప్రాప్తి, మోచేతి మీద కలహము, మణికట్టుపై గర్వభంగము, వెన్నున శత్రుభయము, నడుమున వస్త్రలాభము, తొడ మీద అనారోగ్యము, లింగముపైన సంతానప్రాప్తి, మోకాలిపైన వాహన లాభము, పిక్కలయందు కార్యసాఫల్యము, పాదమున స్త్రీలాభము, కాలివ్రేళ్ళ మీద రోగము, అరికాలిమీద ఉద్యోగప్రాప్తి కలుగును.

## గ్రామార్వణ

గ్రామ నక్షత్రము మొదలుకొని నామనక్షత్రము వఱకు లెక్కింపగా 5 నక్షత్రములు గ్రామాధిదేవతకు శిరస్సగును. శిరోదేశమున నామనక్షత్రమున్నచో ధనలాభము కలుగును. తరువాత 2 నక్షత్రములు ముఖము ధననాశము, 5 హృదయప్రదేశము, ధనధాన్య లాభము, 6 పాదములు దరిద్రము, 1 పృష్ఠము దేహనాశము, 4 నాభి శుభము, 2 గహ్యము భయము, 1 దక్షిణ హస్తము శుభము, 1 వామహస్తము దరిద్రమును గలుగును.

గ్రామాధి దేవతకు తమ నామనక్షత్రము పృష్ఠ భాగమున నున్నచో అనగా 19వది ఐనచో అట్టి గ్రామవాసము అరిష్ట ప్రదమగును. ఇచట గ్రామశబ్దము పట్టణములు, పల్లెలు, నగరములు వీనికన్నింటికిని వర్తించును.

## ప్రయాణ విషయములు

అష్టమి, నవమి, బ॥ చతుర్దశి, అమావాస్యలు, సంక్రాంతి దినములు; ఆది, మంగళ, శనివారములును ప్రయాణమునకు మంచివి కావు. చర లగ్నములు మంచివి. తారాబలము, చంద్రబలములు చూచుకొనవలయును. తూర్పునకు సోమ, శనివారములు, ఆగ్నేయమునకు గురు, శని వారములు, దక్షిణమునకు గురువారము, నైఋతికి సోమ, శుక్రవారములు, పడమరకు ఆది, శుక్ర వారములు, వాయవ్యమునకు ఆది, మంగళవారములు, ఉత్తరమునకు బుధ, మంగళ వారములు, ఈశాన్యమునకు బుధవారము వారశూలలు. విదియ మంగళవారము, తదియ శుక్రవారము, చవితి ఆదివారము, పంచమి గురువారము, షష్ఠి శనివారము, సప్తమి సోమవారము, అష్టమి గురువారము ప్రయాణము చేయరాదు. మాసశూన్య నక్షత్రములలో ప్రయాణము చేసినచో ధన నష్టమగును. ప్రయాణమునకు పంచమశుద్ధి యుండవలెను.

## రాహు, గుళిక కాలములు

| వారము | రాహుకాలము | గుళికకాలము |
|---|---|---|
| 1. ఆదివారము | సా 4-30 ల 6-0 వ | ప 3-30 ల 4-30 వ |
| 2. సోమవారము | ఉ 7-30 9-0 | ప 1-30 3-0 |
| 3. మంగళవారము | ప 3-0 4-30 | ప 12-0 1-30 |
| 4. బుధవారము | ప 12-0 1-30 | ప 10-30 12-0 |
| 5. గురువారము | ప 1-30 3-0 | ఉ 9-0 10-30 |
| 6. శుక్రవారము | ప 10-30 12-0 | ఉ 7-30 9-0 |
| 7. శనివారము | ఉ 9-0 10-30 | ఉ 6-0 7-30 |

సూర్యోదయము నికరముగా 6 గంటలైనపుడు, ఇచట రాహు, గుళిక కాలములు చూపబడినవి. రాహుకాలము యాత్రా వివాహాదులకు వర్జింపవలెను.



## స్వప్నఫలములు

స్వప్నమొక నిద్రావైచిత్రి; అవస్థాత్రయములో నొకటి. జాగర, స్వప్న సుషుప్తి అనునవి మూఁడవస్థలు. స్వప్న జగత్తునందు మానవుఁడనేక విచిత్రములను చూచుచున్నాడు. రాత్రిభాగములో 3 జాములలోగా వచ్చిన స్వప్నములకు ఫలము లేదు. వేకువజామున సుమారు 3 గంటల నుండి సూర్యోదయం లోపల వచ్చిన స్వప్నములకు మాత్రమే ఫలము చూచుకొనవలెను. మంత్రోపాసకులకు, యోగసాధన చేయువారికి వచ్చు స్వప్నములకు ఫలము వేరుగ చెప్పవలెను. ఇచ్చట సర్వ సాధారణమైన స్వప్నఫలములు వ్రాయఁబడినవి.

సుస్వప్నములు : మేడలు, పర్వతములు, ఫలవృక్షములు, రథములు. ఏనుఁగులు, గుఱ్ఱములు, పల్లకీని ఎక్కినట్లు కలగనని ఉద్యో వ్యాపారదులలో అభివృద్ధి కలుగును. ప్రభువుతో మాట్లాడినట్లును, సూర్య, చంద్రులను జూచినట్లును, తెల్లని స్వచ్ఛమైన వస్తువు లగపడినను దేవతా స్త్రీలతో భోగించినట్లును. వివాహమైనట్లును. కుంకుమ మొదలగు అలంకారములు ధరించినట్లును, తాను మృతినొందినట్లును, వేదము లధ్యయనము చేసినట్లును, దేవతలను గోవులను చూచినట్లును, రక్తము చూచినను, ఇతర గృహములు కాలినట్లు కలలో కనపడినను శుభము. తాను ఏడ్చినట్లును, క్షీరపానము, మద్యపానము చేసినట్లు స్వప్నమైన విశేష ధనలాభము కలుగును.

దుస్స్వప్నములు : సర్పము, దున్నపోతు, పంది, గాడిద మొదలగు జంతువులు, తిలలు, నూనె, ఆముదము, ప్రత్తి, అగ్ని, ఇనుము, మురికినీళ్ళు చూచినట్లును, సముద్రమున బడుట, ప్రవాహమున కొట్టుకొనిపోవుట, బురదలో దిగబడుట, కారాగారము, వాహనాదుల నుండి క్రిందపడుట, శస్త్రఘాతము, క్షౌరము, మరణ వార్తాశ్రవణము, విధవను వైద్యుని చూచుట, మృగముతో రమించుట, మాంస భోజనము మొదలగు స్వప్నములు దరిద్రము, ధననష్టము, రోగములను కలిగించును. ముండ్లుగల చెట్లనెక్కుట, గాడిద, ఒంటె, దున్నపోతు, పులి వీనినెక్కినట్టు కల గనిని అపమృత్యు భయము కలుగును. అందువలన శాంతి జరుపుకొనవలెను. కలలో వేంకటేశ్వరుని, పాండురంగని విగ్రహములు చూచిన పై అధికారులతో విరోధము. పులిని స్వప్నమందు చూచిన బలవద్విరోధము కలుగును. కలలో పెండ్లి, భోజనములు, సంతర్పణలు చూచిన మరణవార్త వచ్చును. వ్రాసిన కాగితములు కలలో కనబడిన కష్టములు సంభవించును. అద్దము కలలో కన్పించిన దరిద్రులకు ధనలాభము, ధనవంతులకు ధననష్టము. బంగారపు ముద్దను చూచిన దారిద్ర్యమును, వెండి చూచిన కష్టములును కలుగును. దుస్స్వప్నమైన వెంటనే మేల్కాంచి, శిరస్స్నానము చేసి, గరికపోచలు శిరస్సున పెట్టుకొని, ఈ క్రింది శ్లోకమును 108 మార్లు పఠించినచో, దుస్స్వప్నదోషము పరిహారమగును.

శ్లో॥ సహస్రపరమా దేవి! శతమూలా శతాంకురా !
సర్వగ్ం హరతు మే పాపం, దూర్వా దుస్స్వప్ననాశినీ ॥

## ప్రయాణమునకు ఆనందాది యోగములు

| **ఆది** | **సోమ** | **మంగ** | **బుధ** | **గురు** | **శుక్ర** | **శని** | **యోగః** | **యోగఫలము** |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | అనూ | ఉ.షా | శత | ఆనందః | కార్యసిద్ధి |
| భర | ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | కాలదణ్డ* | మృత్యువు |
| కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | ధూమ్రః ౧ | కార్యభంగం |
| రోహి | పుష్య | ఉత్తర | విశా | పూషా | ధని | రేవ | ధాతృ | సౌభాగ్యం |
| మృగ | ఆశ్రే | హస్త | నూ | ఉషా | శత | అశ్వి | సౌమ్యః | సుఖము |
| ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర | ధ్వాంక్ష ౫ | ధనక్షయము |
| పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | కేతు | సౌభాగ్యం |
| పుష్య | ఉత్తర | విశా | పూషా | ధని | రేవ | రోహి | శ్రీవత్స | సంపత్తు |
| ఆశ్రే | హస్త | అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | వజ్రః ౫ | కార్యభంగం |
| మఘ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర | ఆర్ద్ర | ముద్గర ౫ | కార్యహాని |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | ఛత్రమ్ | రాజసన్మానం |
| ఉత్తర | విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | మిత్రమ్ | పుష్టి |
| హస్త | అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్రే | మానసమ్ | సర్వలాభం |
| చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర | ఆర్ద్ర | మఘ | పద్మః ౪ | లాభం |
| స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | లంబః ౫ | కార్యహాని |
| విశాఖ | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్తర | ఉత్పాత* | మృత్యువు |
| అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | మృత్యుః* | మృత్యువు |
| జ్యేష్ఠ | అభి | పూభా | భర | ఆర్ద్ర | మఘ | చిత్త | కాణః ౨ | క్లేశము |
| మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | సిద్ధిః | కార్యసిద్ధి |
| పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్తర | విశా | శుభమ్ | శుభము |
| ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | అనూ | అమృతమ్ | సర్వసిద్ధి |
| అభి | పూభా | భర | ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యేష్ఠ | ముసల ౨ | కార్యహాని |
| శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | గదః ౭ | బంధనము |
| ధని | రేవ | రోహి | పుష్య | ఉత్తర | విశా | పూషా | మాతంగః | వృద్ధి, లాభం |
| శత | అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | అనూ | ఉషా | రాక్షసః* | పీడ |
| పూభా | భర | ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యేష్ఠ | అభి | చరః | కార్యసిద్ధి |
| ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | స్థిరః | కార్యసిద్ధి |
| రేవ | రోహి | పుష్య | ఉత్తర | విశా | పూషా | ధని | వర్ధమానః | శుభము |

ఈ ఆనందాది యోగములలో ధ్రూమాది యోగములం దాయా గడియలు గడచిన పిమ్మట ప్రయాణమునకు మంచిది. మృత్యు, ఉత్పాత, కాలదండ, రాక్షస యోగములు మిక్కిలి హానికరము లగుటచే నెంత యావశ్యకమైన కార్యము లున్నను సంపూర్ణముగా బరిత్యజింపవలయును.



## గౌరీ పంచాంగము

గౌరీ పంచాంగమును ననుసరించి తిథి, వార, నక్షత్రదోషములను పాటింపకయే ప్రయాణములను చేయవచ్చును. సూర్యోదయాదిగ దినమునకు ముహూర్తములు 16, ఒక్కొక్క ముహూర్త ప్రయాణము సుమారు గం॥ 1-30. అహస్సును, రాత్రిని ఎనిమిదేసి భాగములు చేయగ ఈ ముహూర్తము లేర్పడును. గౌరీదేవి చెప్పియుండుటచే నిది 'గౌరీ పంచాంగము' అని జగత్ప్రసిద్ధి నొందియున్నది.

శ్లో॥ న తిథి ర్నచ నక్షత్రం న యోగః కరణం తథా
న హోరా యోగినీచక్రం న లగ్నం న తమోగుణాః ।
వ్యతీపాతే చ సంక్రాంతౌ భద్రాయా మశుభే దినే
శివా లిఖిత మాలోక్య సర్వత్ర విజయా భవేత్ ॥

| **ముహూర్తం** | | **ఆది** | **సోమ** | **మంగళ** | **బుధ** | **గురు** | **శుక్ర** | **శని** |
|---|---|---|---|---|---|---|---|---|
| పగలు | ౧ | ఉద్యోగం | అమృతం | రోగం | విషం | ఉద్యోగం | రోగం | విషయం |
| | ౨ | లాభం | విషం | ఉద్యోగం | అమృతం | విషం | జ్వరం | అమృతం |
| | ౩ | విషం | ఉద్యోగం | జ్వరం | శుభం | జ్వరం | అమృతం | జ్వరం |
| | ౪ | అమృతం | లాభం | లాభం | ఉద్యోగం | లాభం | కలహం | ఉద్యోగం |
| | ౫ | శుభం | జ్వరం | అమృతం | రోగం | అమృతం | లాభం | శుభం |
| | ౬ | ధనం | అమృతం | ఉద్యోగం | శుభం | విషం | శుభం | లాభం |
| | ౭ | అమృతం | ఆదాయం | విషం | ధనం | కలహం | ధనం | ధనం |
| | ౮ | విషం | ధనం | లాభం | అమృతం | జ్వరం | అమృతం | లాభం |
| రాత్రి | ౯ | శుభం | రోగం | జ్వరం | లాభం | శుభం | అమృతం | విషం |
| | ౧౦ | అమృతం | లాభం | ఉద్యోగం | రోగం | రోగం | జ్వరం | ఉద్యోగం |
| | ౧౧ | జ్వరం | ఉద్యోగం | కలహం | విషం | కలహం | కలహం | శుభం |
| | ౧౨ | రోగం | ధనం | లాభం | ఉద్యోగం | లాభం | లాభం | అమృతం |
| | ౧౩ | కలహం | రోగం | రోగం | జ్వరం | ఉద్యోగం | శుభం | కలహం |
| | ౧౪ | లాభం | అమృతం | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| | ౧౫ | ఉద్యోగం | విషం | ఉద్యోగం | ధనం | లాభం | అమృతం | అమృతం |
| | ౧౬ | రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యోగం | విషం | లాభం |

## నిర్ష్యముంచు విధము

నిషిద్ధ కాలములందు తప్పనిసరి ప్రయాణమైనచో ఆదివారము-బంగారమును, సోమ-వస్త్రం, మంగళ-ఆయుధము, బుధ-పుస్తకము, గురు-గొడుగు-టోపీ-తలపాగాలలో ఒకటి, శుక్ర-చెప్పులు లేదా వాహనము, శని-కంతమున ధరించు వస్తువును-ప్రయాణ మార్గమందలి యెవరి యింటనైనా నిర్ష్యముంచుకొని - అవసరవేళ శుభ శకునమున ప్రయాణమై వెళ్ళవచ్చును.

## పిండప్రదాన క్రమము

శ్లో॥ అదౌ పితా తథా మాతా సాపత్నీ జననీ తథా
మాతామహా స్సపత్నీకా ఆత్మపత్న్య స్త్వనంతరమ్ ।
సుతభ్రాతృపితృవ్యాశ్చ మాతులా స్సహభార్యకాః
దుహితా భగినీ చైవ దౌహిత్రో భాగినేయకః ।
పితృష్వసా మాతృష్వసా జామాతా భావుక స్నుషా
శ్వశురౌ శ్యాలక శ్చైవ స్వామినో గురు రిక్థినః ॥

వీరలకు శాస్త్రోక్తప్రకారము పిండప్రదానం బాచరించి పురాణవిహిత ప్రకారము ధర్మపిండముల నొసంగి, తిలోదకములనిచ్చి, పిండోద్వాసనకాలమందు షోడశ మహాదానములను చేసినట్టి పుణ్యశాలి, పితృదేవతల ఋణమును దీర్చినవాడై, ఆయురారోగ్య ఐశ్వర్యములను పొందును.

## తీర్థ శ్రాద్ధీయ పిండప్రదాన క్రమః

శ్లో॥ పితౄణాం పశ్చిమేభాగే మాతృపిండం విధీయతే ।
మాతామహాశ్చ తత్పూర్వే ఆత్మపత్నీ తదుత్తరే ॥
సుతభ్రాతృ పితృవ్యాశ్చ మాతాపిత్రోశ్చ మధ్యమే ।
మాతామహ మహీమధ్యే మాతులా స్సహభార్యకాః ॥
శ్వశ్రూశ్వశురయోర్మధ్యే శాలకస్య విధీయతే ।
దుహిత్రాది తతోఽన్యేషాం శేషం దక్షిణతో విధిః ॥
పుంపిండం వామతః స్త్రీణాం తత్పుత్రం సముపస్థితమ్ ।
అంగుష్ఠపరిమాణం తు గోత్రమన్యం నసంస్పృశేత్ ।
నిరాశాః పితరో యాంతి విపరీతే భవేద్యది ॥

## పిండ పరిమాణమ్

శ్లో॥ తీర్థశ్రాద్ధే గయాశ్రాద్ధే ధర్మశ్రాద్ధే మహాలయే ।
సేతుబంధే ప్రయాగాయాం కుర్యా దామలకోపమం ॥
ఏకోద్దిష్టే సపిండే తు కపిత్థం తు విధీయతే ।
నారికేళప్రమాణం తు ప్రత్యబ్దే మాసికే తథా ॥
తీర్థే దర్శే చ సంప్రాప్తే కుక్కుటాండప్రమాణతః ।
మహాలయే గయాశ్రాద్ధే కుర్యా దామలకోపమమ్ ॥

## తర్పణ విధిః

శ్లో॥ తీర్థశ్రాద్ధే గయా శ్రాద్ధే, ప్రత్యబ్దే చ మహాలయే ।
పరేహని ద్విజః కుర్యాత్, తర్పణం తిలసంయుతమ్ ॥



ఈ పిండ ప్రదానము ఒకదానికొకటి తగులకుండునట్లు (అన్యగోత్రము) ఒక అంగుళము దూరములో చేయవలెను. పిండము ఉసిరికాయంత పరిమాణములో నుండవలెను. క్రింది పటములో చూపిన ప్రకారము పిండప్రదానము చేయవలయును.

## పిండదానక్రమ వివరణము

తూర్పు

ఉత్తరము | దక్షిణము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | తల్లి సోదరి భర్త | | | | | |
| | తల్లి సోదరి కుమారుడు | | | | | |
| మాతామహవర్గము | తల్లి సోదరి | | | | | |
| మాతులః / మాతుల పత్ని | అల్లుడు | సోదరి భర్త | మేనత్త భర్త | | | |
| మాతామహీవర్గము | దౌహిత్రుడు | మేనల్లుడు భాగినేయకః | మేనత్త కుమారుడు | | | |
| పితృవర్గము | కుమార్తె | సోదరీలు | మేనత్త | శ్వశురః (మామగారు) | స్వామి రక్షకః | గురుః |
| [illegible] / [illegible] / [illegible] / [illegible] | | | | శ్యాలకః (భార్య సోదరులు) | | |
| మాతృవర్గము | | | | | | |
| సాపత్నిమాత | | | | శ్వశ్రూః (అత్తగారు) | | |

పశ్చిమము

## మాసముల రీత్యా స్త్రీ-పురుష నామములు

| మాసము | మగశిశువు | ఆడశిశువు |
|---|---|---|
| చైత్రము | కృష్ణః | భూదేవీ |
| వైశాఖము | ఆనందః | కల్యాణీ |
| జ్యేష్ఠము | అచ్యుతః | సత్యభామా |
| ఆషాఢము | చక్రి | పుణ్యవతీ |
| శ్రావణము | వైకుంఠః | రూపవతీ |
| భాద్రపదము | జనార్దనః | ఇందుమతీ |
| ఆశ్వయుజము | ఉపేంద్రః | చంద్రావతీ |
| కార్తికము | యజ్ఞేశ్వరః | లక్ష్మీ |
| మార్గశిరము | వాసుదేవః | వాగ్దేవీ |
| పుష్యము | హరనాథః | పద్మావతీ |
| మాఘము | గోవిందః | శ్రీదేవీ |
| ఫాల్గునము | పుండరీకాక్షః | సావిత్రీ |

## జ్వర నివృత్తిదిన ప్రమాణము

అశ్వినీ నక్షత్రములో జ్వరము తగిలినచో 9 రోజులలో తగ్గిపోవును. భరణిలో వచ్చినచో 11 రోజులలోను, కృత్తికలో 9 రోజులలోను నిమ్మళించును. రోహిణి 7, మృగశిర 5, ఆర్ద్ర 13, పున 7, పుష్య 7, ఆశ్లే 9, మఘ 21, పుబ్బ 60, ఉత్తర 15, హస్త 15, చిత్త 15, స్వాతి 60, విశా 20, అనూ 10, జ్యేష్ఠ 5, మూల 9, పూ.షా. 8, ఉ.షా. 7, శ్రవ 10, ధని 19, శత 11, పూ.భా. 30, ఉ.భా. 8, రేవతి 7 - ఇవి జ్వరము నివృత్తియగు దినములు.

పై నక్షత్రము లందును, 1-4-6-9-12-15-30 ఈ తిథులందు, ఆది-శని-మంగళవారము లందును, విషఘటికా ద్యవయోగము లున్నచో, రోగికి దీర్ఘవ్యాధియు, మృత్యుభయమును కలుగును. వ్యాధి నివారణకు క్రొత్త ప్రమిదయందు ఆముదము 1 భాగము, నూనె 1 భాగము, నేయి 1 భాగము పోసి, అందు మూఁడు రంగులు నూలు పోగులతో చేసిన వత్తిని చేసి, ప్రమిద క్రింద నవధాన్యములను పోసి, దానికి 3 దినములు దీపారాధన చేసిన యెడల - అది మృత్యుభయ నివారక దీపారాధన యగును. అందువలన మృత్యుభయము తొలగి, దీర్ఘాయువు కలుగును.

## అవయవములు అదరుట వలన ఫలితములు

పురుషులకు కుడిభాగము, స్త్రీలకు ఎడమభాగము అదరినచో శుభము కలుగును. శిరస్సున భూలాభము, నొసలు అదరిన శుభము, కుడిచెంప అదరిన రాజదండన, ఎడమచెంప ఉద్యోగలాభము. కుడికన్ను అదరిన పురుషులకు శుభము, ఎడమకన్ను అదరిన స్త్రీలకు శుభము. ముక్కు అదరిన రోగము, పై పెదవి కలహము, క్రింది పెదవి భోజన లాభము, గడ్డము అదరిన లాభము, కుడిచెక్కిలి ధనలాభము, ఎడమచెక్కిలి చోరభయము. స్త్రీలకు ఎడమభుజము ఆనందము, పురుషులకు కుడి భుజము స్త్రీసౌఖ్యము. బొమ్మ ధనప్రాప్తి, హస్తము లదరిన ధనలాభము, అరచెయ్యి సంతానప్రాప్తి, కుడితొడ ధనలాభము, ఎడమ తొడ రాజభయము, వీపున అపజయము, మోకాళ్ళు జాడ్యము, పార్శ్వము లదరిన సంతోషము, మీగాళ్ళు ధనాగమము, అరికాళ్ళు సౌఖ్యము.

## గృహప్రవేశ విషయమైన చక్రములు

| వృషభచక్రం రవిభాత్ | | కలశ చక్రం రవిభాత్ | |
|---|---|---|---|
| 3 మృత్యువు | 4 అర్థకృత్ | 1 శీర్షచ్ఛేదం | 4 నిర్ధనం |
| 4 దుర్దశ | 4 ధాన్యం | 4 ప్రవాసం | 4 గర్భస్రావం |
| 4 స్థైర్యం | 3 సంపద | 4 అభయం | 3 శ్రియం |
| 3 భ్రమణం | 3 పశువృద్ధి | 4 ధాన్యం | 3 శతాయువు |



## నక్షత్ర రాశి గణకూటాది చక్రమ్

| నక్షత్రములు | రాశి | వర్ణం | వశ్యం | యోని | గణం | నాడి | రాశీశః | ద్రవ్య |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మేష | క్షత్రి | చతు | అశ్వ | దేవ | ఆది | కుజ | స్వర్ణ |
| భర | మేష | క్షత్రి | చతు | గజ | మను | మధ్య | కుజ | స్వర్ణ |
| కృత్తి 1పా | మేష | క్షత్రి | చతు | మేక | రాక్ష | అంత్య | కుజ | స్వర్ణ |
| కృత్తి 2-3-4 | వృష | వైశ్య | చతు | మేక | రాక్ష | అంత్య | శుక్ర | స్వర్ణ |
| రోహి | వృష | వైశ్య | చతు | సర్ప | మను | అంత్య | శుక్ర | స్వర్ణ |
| మృగ 1-2 | వృష | వైశ్య | చతు | సర్ప | దేవ | మధ్య | శుక్ర | స్వర్ణ |
| మృగ 3-4 | మిథు | శూద్ర | మను | సర్ప | దేవ | మధ్య | బుధ | స్వర్ణ |
| ఆర్ద్ర | మిథు | శూద్ర | మను | శునక | మను | ఆది | బుధ | రజిత |
| పున 1-2-3 | మిథు | శూద్ర | మను | మార్జా | దేవ | ఆది | బుధ | రజిత |
| పున 4వ పా॥ | కర్కా | బ్రాహ్మ | జలచర | మార్జా | దేవ | ఆది | చంద్ర | రజిత |
| పుష్య | కర్కా | బ్రాహ్మ | జలచర | మేక | దేవ | మధ్య | చంద్ర | రజిత |
| ఆశ్రే | కర్కా | బ్రాహ్మ | జలచర | మార్జా | రాక్ష | అంత్య | చంద్ర | రజిత |
| మఘ | సింహ | క్షత్రి | చతు | మూష | రాక్ష | అంత్య | రవి | రజిత |
| పూ.ఫ. | సింహ | క్షత్రి | చతు | మూష | మను | మధ్య | రవి | రజిత |
| ఉఫ 1వ పా॥ | సింహ | క్షత్రి | చతు | గోవు | మను | ఆది | రవి | రజిత |
| ఉఫ 2-3-4 | కన్య | వైశ్య | మను | గోవు | మను | ఆది | బుధ | రజిత |
| హస్త | కన్య | వైశ్య | మను | దున్న | దేవ | ఆది | బుధ | రజిత |
| చిత్ర 1-2 పా॥ | కన్య | వైశ్య | మను | వ్యాఘ్ర | రాక్ష | మధ్య | బుధ | రజిత |
| చిత్ర 3-4 పా॥ | తుల | శూద్ర | మను | వ్యాఘ్ర | రాక్ష | మధ్య | శుక్ర | రజిత |
| స్వాతి | తుల | శూద్ర | మను | దున్న | దేవ | అంత్య | శుక్ర | రజిత |
| విశాఖ 1-2-3 | తుల | శూద్ర | మను | వ్యాఘ్ర | రాక్ష | అంత్య | శుక్ర | లోహ |
| విశాఖ 4వ పా॥ | వృశ్చి | బ్రాహ్మ | కీట | వ్యాఘ్ర | రాక్ష | అంత్య | కుజ | లోహ |
| అనూ | వృశ్చి | బ్రాహ్మ | కీట | లేడి | దేవ | మధ్య | కుజ | లోహ |
| జ్యేష్ఠ | వృశ్చి | బ్రాహ్మ | కీట | లేడి | రాక్ష | ఆది | కుజ | లోహ |
| మూల | ధను | క్షత్రి | మను | శునక | రాక్ష | ఆది | గురు | లోహ |
| పూ.షా. | ధను | క్షత్రి | చతు | వానర | మను | మధ్య | గురు | తామ్ర |
| ఉషా 1వ పా॥ | ధను | క్షత్రి | చతు | ముంగిస | మను | అంత్య | గురు | తామ్ర |
| ఉషా 2-3-4 | మకర | వైశ్య | చతు | ముంగిస | మను | అంత్య | శని | తామ్ర |
| శ్రవ | మకర | వైశ్య | చతు | వానర | దేవ | అంత్య | శని | తామ్ర |
| ధని 1-2 | మకర | వైశ్య | జలచర | సింహ | రాక్ష | మధ్య | శని | తామ్ర |
| ధని 3-4 | కుంభ | శూద్ర | మను | సింహ | రాక్ష | మధ్య | శని | తామ్ర |
| శత | కుంభ | శూద్ర | మను | అశ్వ | రాక్ష | ఆది | శని | తామ్ర |
| పూ.భా.1-2-3 | కుంభ | శూద్ర | మను | సింహ | మను | ఆది | శని | తామ్ర |
| పూ.భా.4వ పా॥ | మీన | బ్రాహ్మ | మను | సింహ | మను | ఆది | గురు | తామ్ర |
| ఉ.భా. | మీన | బ్రాహ్మ | జలచర | గోవు | మను | మధ్య | గురు | తామ్ర |
| రేవ | మీన | బ్రాహ్మ | జలచర | గజ | దేవ | అంత్య | గురు | స్వర్ణ |

## వధూ-వర గుణమేళన చక్రము (వర నక్షత్రము)

| వధూ నక్షత్రం | అశ్వి | భ | కృ 1 | కృ 3 | రో | మృ 2 | మృ 2 | ఆర్ద్ర | పున 3 | పున 1 | పుష్య | ఆశ్లే | మ | పు | ఉఫ 1 | ఉఫ 3 | హ | చి 2 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 28 | 33 | 27 | 18 | 21 | 22 | 26 | 17 | 18 | 22 | 31 | 27 | 21 | 26 | 17 | 11 | 9 | 13 |
| భరణి | 34 | 28 | 29 | 19 | 22 | 15 | 18 | 26 | 26 | 30 | 23 | 24 | 21 | 19 | 28 | 21 | 19 | 6 |
| కృత్తిక 1 | 27 | 27 | 28 | 17 | 9 | 15 | 19 | 20 | 21 | 25 | 26 | 23 | 17 | 21 | 22 | 15 | 15 | 18 |
| కృత్తిక 3 | 18 | 18 | 19 | 28 | 19 | 25 | 16 | 17 | 18 | 22 | 23 | 20 | 19 | 23 | 24 | 21 | 21 | 23 |
| రోహిణి | 23 | 23 | 10 | 19 | 28 | 36 | 27 | 23 | 23 | 27 | 26 | 13 | 12 | 26 | 28 | 25 | 26 | 20 |
| మృగ 2 | 22 | 13 | 15 | 27 | 34 | 28 | 20 | 25 | 23 | 26 | 19 | 22 | 21 | 17 | 25 | 23 | 27 | 13 |
| మృగ 2 | 27 | 18 | 21 | 18 | 25 | 20 | 28 | 33 | 31 | 19 | 10 | 15 | 24 | 20 | 28 | 30 | 34 | 21 |
| ఆర్ద్ర | 19 | 27 | 21 | 18 | 24 | 26 | 34 | 28 | 25 | 13 | 20 | 13 | 23 | 29 | 22 | 24 | 24 | 27 |
| పున 3 | 19 | 26 | 22 | 19 | 23 | 24 | 32 | 24 | 28 | 16 | 23 | 16 | 22 | 27 | 21 | 23 | 24 | 25 |
| పున 4 | 21 | 28 | 23 | 20 | 24 | 25 | 19 | 10 | 14 | 28 | 35 | 28 | 15 | 20 | 14 | 18 | 18 | 20 |
| పుష్య | 30 | 21 | 26 | 23 | 24 | 17 | 10 | 18 | 21 | 35 | 28 | 30 | 18 | 14 | 23 | 26 | 27 | 12 |
| ఆశ్లేష | 25 | 23 | 22 | 19 | 12 | 21 | 13 | 12 | 15 | 28 | 28 | 28 | 15 | 15 | 17 | 20 | 20 | 26 |
| మఘ | 21 | 21 | 17 | 18 | 11 | 19 | 22 | 22 | 21 | 16 | 18 | 16 | 28 | 30 | 26 | 16 | 16 | 22 |
| పుబ్బ | 27 | 19 | 21 | 22 | 25 | 17 | 20 | 28 | 27 | 22 | 16 | 16 | 30 | 28 | 34 | 24 | 22 | 8 |
| ఉ.ఫ. 1 | 18 | 27 | 22 | 23 | 27 | 25 | 28 | 21 | 21 | 16 | 25 | 18 | 26 | 34 | 28 | 18 | 16 | 14 |
| ఉ.ఫ. 3 | 13 | 21 | 16 | 21 | 25 | 23 | 30 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 25 | 19 | 28 | 25 | 24 |
| హస్త | 11 | 20 | 16 | 21 | 26 | 26 | 33 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 22 | 17 | 26 | 28 | 27 |
| చిత్త 2 | 13 | 6 | 19 | 25 | 20 | 12 | 19 | 26 | 24 | 20 | 12 | 26 | 23 | 9 | 15 | 24 | 27 | 28 |
| చిత్త 2 | 22 | 15 | 28 | 23 | 20 | 12 | 13 | 20 | 18 | 20 | 12 | 26 | 25 | 10 | 17 | 17 | 20 | 21 |
| స్వాతి | 27 | 29 | 17 | 12 | 16 | 27 | 27 | 26 | 26 | 28 | 28 | 15 | 13 | 25 | 25 | 25 | 27 | 21 |
| విశాఖ 3 | 22 | 22 | 20 | 15 | 10 | 18 | 19 | 21 | 21 | 22 | 21 | 19 | 17 | 19 | 18 | 17 | 18 | 27 |
| విశాఖ 4 | 16 | 16 | 14 | 19 | 14 | 22 | 13 | 14 | 14 | 19 | 18 | 15 | 21 | 23 | 21 | 18 | 19 | 28 |
| అనూ | 24 | 14 | 19 | 24 | 27 | 20 | 11 | 16 | 21 | 26 | 18 | 21 | 24 | 20 | 29 | 26 | 27 | 12 |
| జ్యేష్ఠ | 12 | 18 | 24 | 29 | 22 | 22 | 13 | 3 | 6 | 10 | 20 | 26 | 31 | 23 | 16 | 13 | 12 | 25 |
| మూల | 12 | 20 | 24 | 19 | 13 | 14 | 21 | 15 | 12 | 8 | 17 | 24 | 25 | 19 | 9 | 13 | 13 | 27 |
| పూ.షా. | 27 | 20 | 19 | 13 | 20 | 12 | 18 | 26 | 26 | 23 | 13 | 17 | 21 | 19 | 27 | 27 | 26 | 11 |
| ఉ.షా.1 | 25 | 27 | 14 | 8 | 11 | 18 | 24 | 26 | 26 | 23 | 24 | 9 | 11 | 27 | 28 | 28 | 27 | 20 |
| ఉ.షా.3 | 28 | 29 | 16 | 14 | 17 | 22 | 20 | 22 | 22 | 27 | 28 | 13 | 6 | 22 | 23 | 26 | 25 | 17 |
| శ్రవణం | 27 | 26 | 13 | 10 | 17 | 26 | 23 | 21 | 23 | 28 | 26 | 15 | 17 | 18 | 20 | 23 | 25 | 18 |
| ధనిష్ఠ 2 | 20 | 10 | 26 | 23 | 20 | 12 | 8 | 17 | 17 | 22 | 13 | 28 | 18 | 5 | 12 | 16 | 18 | 16 |
| ధనిష్ఠ 2 | 20 | 11 | 26 | 30 | 27 | 19 | 10 | 19 | 19 | 14 | 5 | 20 | 25 | 11 | 19 | 17 | 21 | 18 |
| శతభిషం | 15 | 21 | 28 | 32 | 25 | 25 | 18 | 10 | 10 | 7 | 15 | 20 | 26 | 20 | 13 | 11 | 8 | 26 |
| పూ.భా.3 | 18 | 25 | 20 | 24 | 31 | 31 | 24 | 17 | 17 | 13 | 20 | 14 | 19 | 25 | 17 | 15 | 17 | 18 |
| పూ.భా.4 | 14 | 21 | 16 | 19 | 26 | 26 | 25 | 18 | 18 | 18 | 25 | 18 | 16 | 22 | 14 | 16 | 18 | 19 |
| ఉ.భా. | 24 | 15 | 18 | 21 | 25 | 17 | 16 | 25 | 27 | 26 | 19 | 20 | 17 | 15 | 25 | 27 | 26 | 9 |
| రేవతి | 25 | 24 | 11 | 14 | 17 | 26 | 25 | 24 | 25 | 24 | 27 | 13 | 12 | 22 | 22 | 24 | 26 | 20 |

**పొంతనములు :** వధూవరులకు పొంతనములు చూచునపుడు బ్రాహ్మణులకు గ్రహమైత్రి, క్షత్రియులకు గణకూటము, వైశ్యులకు స్త్రీదీర్ఘము, శూద్రులకు యోని కూటమును ప్రధానముగా చూచుట పరిపాటి. 18 గణములకు అధికముగా వచ్చినచో శుభప్రదము. అంతేగాక, అనేక యితరాంశములను, కుజ దోషము, పరస్పర గ్రహ కుండలులలోని గ్రహ సంపత్తును పరిశీలించి వివాహము నిశ్చయించుకొనవలయును.



## వధూ-వర గుణమేళన చక్రము (వర నక్షత్రము)

| వధూ నక్షత్రం | చి 2 | స్వా | వి 3 | వి 1 | అను | జ్యే | మూ | పూ | ఉషా 1 | ఉషా 3 | శ్ర | ధ 2 | ధ 2 | శ | పూభా 3 | పూభా 1 | ఉభా | రే |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 22 | 26 | 22 | 19 | 26 | 15 | 13 | 27 | 24 | 26 | 24 | 21 | 21 | 15 | 16 | 14 | 24 | 26 |
| భరణి | 14 | 29 | 22 | 19 | 17 | 19 | 20 | 20 | 27 | 28 | 26 | 10 | 10 | 20 | 24 | 22 | 16 | 28 |
| కృత్తిక 1 | 27 | 15 | 19 | 16 | 20 | 26 | 24 | 19 | 14 | 15 | 10 | 25 | 25 | 27 | 19 | 17 | 19 | 11 |
| కృత్తిక 3 | 22 | 10 | 14 | 21 | 25 | 31 | 20 | 13 | 9 | 14 | 10 | 23 | 29 | 31 | 23 | 20 | 22 | 14 |
| రోహిణి | 19 | 15 | 9 | 16 | 30 | 24 | 14 | 20 | 11 | 17 | 18 | 20 | 26 | 24 | 30 | 27 | 26 | 19 |
| మృగ 2 | 10 | 25 | 17 | 23 | 22 | 25 | 15 | 11 | 18 | 21 | 24 | 13 | 19 | 27 | 29 | 26 | 17 | 27 |
| మృగ 2 | 14 | 27 | 19 | 14 | 11 | 13 | 23 | 18 | 24 | 20 | 25 | 12 | 13 | 21 | 23 | 27 | 17 | 27 |
| ఆర్ద్ర | 20 | 27 | 20 | 13 | 17 | 4 | 16 | 27 | 27 | 22 | 22 | 17 | 18 | 11 | 16 | 19 | 27 | 27 |
| పున 3 | 18 | 27 | 21 | 13 | 20 | 5 | 13 | 26 | 27 | 27 | 23 | 17 | 18 | 11 | 17 | 19 | 27 | 28 |
| పున 4 | 20 | 27 | 20 | 19 | 26 | 10 | 8 | 20 | 21 | 28 | 27 | 21 | 12 | 7 | 11 | 17 | 25 | 25 |
| పుష్య | 11 | 26 | 21 | 20 | 19 | 22 | 17 | 11 | 22 | 26 | 25 | 13 | 4 | 14 | 18 | 24 | 18 | 27 |
| ఆశ్లేష | 25 | 11 | 16 | 15 | 20 | 26 | 22 | 16 | 8 | 12 | 13 | 27 | 18 | 18 | 12 | 18 | 20 | 12 |
| మఘ | 25 | 11 | 17 | 24 | 26 | 34 | 24 | 21 | 11 | 5 | 4 | 18 | 24 | 25 | 18 | 17 | 18 | 12 |
| పూ.ఫ. | 11 | 25 | 19 | 26 | 24 | 24 | 19 | 19 | 27 | 21 | 18 | 4 | 11 | 19 | 24 | 23 | 16 | 24 |
| ఉ.ఫ. 1 | 17 | 26 | 17 | 24 | 32 | 19 | 10 | 27 | 28 | 22 | 20 | 11 | 18 | 12 | 16 | 15 | 26 | 24 |
| ఉ.ఫ. 3 | 16 | 25 | 16 | 18 | 27 | 13 | 15 | 28 | 29 | 26 | 25 | 16 | 16 | 10 | 14 | 18 | 29 | 27 |
| హస్త | 19 | 36 | 17 | 19 | 26 | 12 | 14 | 26 | 27 | 23 | 24 | 19 | 19 | 7 | 14 | 19 | 27 | 27 |
| చిత్త 2 | 20 | 19 | 26 | 28 | 11 | 25 | 28 | 13 | 21 | 17 | 19 | 18 | 18 | 24 | 18 | 22 | 11 | 21 |
| చిత్త 2 | 28 | 27 | 34 | 24 | 7 | 21 | 28 | 13 | 21 | 25 | 27 | 26 | 20 | 26 | 20 | 15 | 4 | 13 |
| స్వాతి | 28 | 28 | 20 | 10 | 23 | 18 | 23 | 26 | 18 | 22 | 23 | 27 | 21 | 20 | 25 | 19 | 20 | 13 |
| విశాఖ 3 | 34 | 18 | 28 | 18 | 17 | 21 | 28 | 21 | 13 | 17 | 17 | 32 | 26 | 26 | 22 | 16 | 13 | 5 |
| విశాఖ 4 | 23 | 8 | 17 | 28 | 27 | 31 | 23 | 17 | 9 | 12 | 12 | 27 | 27 | 26 | 22 | 21 | 18 | 9 |
| అనూ | 7 | 22 | 17 | 28 | 28 | 31 | 16 | 14 | 22 | 25 | 26 | 12 | 12 | 22 | 24 | 24 | 18 | 27 |
| జ్యేష్ఠ | 20 | 17 | 20 | 31 | 20 | 28 | 15 | 17 | 17 | 20 | 20 | 25 | 25 | 18 | 11 | 9 | 21 | 21 |
| మూల | 27 | 21 | 27 | 24 | 26 | 16 | 28 | 27 | 25 | 15 | 15 | 21 | 25 | 21 | 11 | 17 | 25 | 27 |
| పూ.షా. | 11 | 26 | 19 | 18 | 18 | 19 | 27 | 28 | 34 | 24 | 23 | 8 | 15 | 22 | 29 | 32 | 23 | 32 |
| ఉ.షా.1 | 20 | 19 | 12 | 11 | 25 | 19 | 25 | 34 | 28 | 18 | 15 | 15 | 22 | 22 | 28 | 31 | 32 | 23 |
| ఉ.షా.3 | 24 | 23 | 16 | 14 | 28 | 22 | 16 | 25 | 19 | 28 | 25 | 25 | 17 | 17 | 33 | 30 | 32 | 23 |
| శ్రవణం | 25 | 23 | 16 | 14 | 28 | 23 | 17 | 25 | 15 | 24 | 28 | 30 | 20 | 18 | 23 | 32 | 31 | 24 |
| ధనిష్ఠ 2 | 24 | 26 | 30 | 28 | 14 | 28 | 21 | 9 | 16 | 25 | 21 | 28 | 18 | 23 | 21 | 26 | 15 | 22 |
| ధనిష్ఠ 2 | 19 | 22 | 25 | 28 | 12 | 26 | 29 | 16 | 13 | 18 | 21 | 20 | 28 | 33 | 28 | 18 | 7 | 14 |
| శతభిషం | 26 | 19 | 26 | 26 | 21 | 19 | 22 | 23 | 23 | 18 | 18 | 25 | 33 | 28 | 19 | 9 | 17 | 16 |
| పూ.భా.3 | 19 | 28 | 21 | 21 | 27 | 12 | 15 | 30 | 29 | 24 | 25 | 20 | 27 | 19 | 28 | 18 | 23 | 20 |
| పూ.భా.4 | 12 | 20 | 14 | 21 | 27 | 11 | 15 | 31 | 30 | 28 | 30 | 25 | 17 | 7 | 16 | 28 | 33 | 30 |
| ఉ.భా. | 3 | 19 | 12 | 19 | 20 | 22 | 24 | 22 | 31 | 29 | 29 | 14 | 6 | 16 | 21 | 33 | 28 | 34 |
| రేవతి | 13 | 11 | 5 | 12 | 27 | 22 | 27 | 30 | 21 | 19 | 22 | 22 | 14 | 16 | 18 | 29 | 33 | 28 |

గణకూటము విషయమై, ఏకగణముత్తమము. స్త్రీ దీర్ఘము - వధువు నక్షత్రము నుండి వరుని నక్షత్రము వరకు 13 గాని, అంతకుపైన గాని యుండుట ప్రశస్తము. యోని కూటములో విరోధ జంతువులు కూడదు. ప్రసిద్ధమైన విరోధ జంతువులే గాక - లేడికి పిల్లికిని కుక్క పులి పరస్పర విరోధ జంతువులు. కోతికి కుక్క, గొఱ్ఱె విరోధ జంతువులు. గుఱ్ఱము - ఎద్దు విరోధ జంతువులు.

# వధూవరుల పొంతనములు

| షష్టాఽష్టములు | | ద్విర్, ద్వాదశకములు | |
|---|---|---|---|
| శుభం | అశుభం | శుభం | అశుభం |
| మేష, వృశ్చి | మేష, కన్య | మీన, మేష | కుంభ, మీన |
| మిథు, మకర | తుల, మీన | సింహ, కన్య | మేష, వృష |
| సింహ, మీన | మిథు, వృశ్చి | కర్క, సింహ | మిథు, కర్క |
| తుల, వృష | మకర, సింహ | మకర, కుంభ | తుల, వృశ్చి |
| ధనుః, కర్క | కుంభ, కర్క | కన్య, తుల | మకర, ధను |
| కుంభ, కన్య | ధనుః, వృష | వృశ్చి, ధనుః | |
| | | వృష, మిథు | |

| నవ పంచకములు | |
|---|---|
| శుభం | అశుభం |
| మేష, సింహ | కర్క, వృశ్చి |
| వృష, కన్య | కన్య, మకర |
| మిథు, తుల | కుంభ, మిథు |
| సింహ, ధనుః | మీన, కర్క |
| తుల, కుంభ | |
| వృశ్చి, మీన | |
| ధనుః, మేష | |
| మకర, వృష | |

### ఏకనాడీదోష పరిహారము

శ్లో॥ ఉత్తరా శతతారా చ, పూర్వాభాద్ర పునర్వసూ।
రౌద్ర మూలాఽశ్వినీ సప్త, ఏకనాడీ న దోషభాక్ ॥

### మధ్యైకనాడీదోష పరిహారము

శ్లో॥ తోయాఽనురాధా వసు పుష్యచిత్రాః
భగేందుభే యస్య నరస్య సప్త ।
మధ్యైకనాడీ నహి నాడిదోషా
అరుంధతీ మేవ యథా వసిష్ఠః ॥

### పార్శ్వనాడీదోష పరిహారము

శ్లో॥ వహ్నిర్విశాఖ స్సార్పా చ, శ్రవణే చ మఘా తథా ।
ఉత్తరాషాఢ రోహిణ్యాం, పార్శ్వనాడీ నదోషభాక్ ॥

### గ్రహముల మిత్ర - శత్రు - సమత్వ నిర్ణయ చక్రము

| గ్రహములు | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| మిత్రులు | చ-కు-గు | ర-బు | ర-గు-చ | ర-శు | ర-చ-కు | బు-శ | బు-శు |
| సములు | బు | కు-గు-శు-చ | శు-శ | కు-గు-శ | శ | కు-గు | గు |
| శత్రులు | శు-శ | లేరు | బు | చ | బు-శ | ర-చ | ర-చ-కు |



# వాస్తుశాస్త్ర విషయములు

ప్రస్తుత కాలంలో వాస్తు విశేష ప్రచారములోనికి వచ్చినది. జ్యోతిశ్శాస్త్రప్రవేశము లేనివారు కూడ వాస్తు సిద్ధాంతులుగా బయల్దేరి హోరెత్తించుచున్నారు. అసలు, "సిద్ధాన్తి' అంటే గ్రహగణితము, పంచాంగరచన చేయునట్టి జ్యోతిష్కుఁడని అర్థము. వాస్తు ప్రకరణము జ్యోతిశ్శాస్త్రములో నొక భాగము. వేదములో వాస్తును గుఱించి ఒక ఉపనిషత్తే కలదు. అది పరమ ప్రమాణమైనది.

వాస్తుశాస్త్ర ప్రకారము నిర్మించిన నివాసగృహములు, ఆలయములు, పాఠశాలలు, వైద్యారోగ్యసంస్థలు, అపార్ట్‌మెంట్లు, కాలనీలు, గ్రామములు, పట్టణాలు, నగరములును అందు నివసించువారికి ఆయురారోగ్యములను కలిగించును. గృహనిర్మాణ విషయమై స్థలపరీక్ష జరిపి, వాస్తుప్రకారము ప్లాన్ గీసి, కట్టుబడి చేయవలసి యుండును.

ఇల్లు కట్టుటకు ముందు దిక్సాధన చేయవలసి యున్నది. శుద్ధప్రాచీని సాధించిన తర్వాత, ఈశాన్య మూలను శంకుస్థాపన చేయవలయును. ఇంటి చుట్టు గోప్రదక్షిణము నకు వీలగునట్లు ఖాళీస్థలమును వదలవలెను. ఇంటికి వీధిశూల, స్తంభశూల, వృక్షశూల, గర్త(గొయ్యి), దేవాలయశూల, వెన్నుశూల మొదలగునవి యుండరాదు. అయము ప్రకారము ఇంటి గదులు నిర్మించవలెను.

అర్వణము : యజమాని నామరాశికి సంబంధించిన దిక్కునందు యిల్లు కట్టరాదు. దీనిని గ్రామార్వణమందురు. ఇతరములైన దిక్కులందు గృహమును నిర్మించుకోనవచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| ఈశా | | తూర్పు | | ఆగ్నే |
| | కుంభ | వృశ్చి | మీన | |
| ఉత్తర | మేష | వృష, మకర, సింహ, మిథున | కన్య | దక్షిణ |
| | తుల | ధనుః | కర్క | |
| వాయ | | పశ్చిమ | | నైరృ |

ఉదా : వృశ్చికరాశి వారు గ్రామమునకు తూర్పుదిక్కున నివసింపరాదు. వృషభరాశి వారు గ్రామమధ్యమున నివసింపరాదు.

## ఆయములు

ఇంటియొక్క పొడవును వెడల్పుచే గుణించి, ఎనిమిదిచే భాగింపఁగా వచ్చిన శేషము 1 ఐన ధ్వజాయమ - ధనము, కీర్తి, 2 ధూమాయము - శోకప్రదము, 3 సింహాయము - జయప్రదము, 4 శునకాయము - వైరము, 5 వృషభాయము - ధనయోగము, 6 ఖరాయము - దరిద్రము, 7 గజాయము - సుఖము, 8 కాకాయము - రోగములు. ఆయా నక్షత్రరాసుల వారికి, బ్రాహ్మణాది వర్ణముల వారికిని, వారి వృత్తియుద్యోగాదులకును తగినట్లు ఆయములను నిర్ణయించవలెను. అంతేగాని, వాస్తు బలమున్నచో, గ్రహబలమేల? అనగూడదు. తూర్పు స్నానశాల, ఆగ్నేయమున వంటశాల, దక్షిణమున శయనగృహము, నైరృతి పురీషశాల (టాయిలెట్), పడమర పశుశాల, వాయువ్యము ఆఫీసు, ఉత్తరము ధనాగారము, ఈశాన్యము పూజా గృహమును - ఇవి సామాన్య సూత్రములు. ఒక్కొక్క అపార్ట్‌మెంట్స్ భవనములో దాదాపు 36 నుండి 72 వఱకును ఫ్లాట్లు కట్టుచున్న యీ కాలములో అన్నింటికిని ఆగ్నేయమున వంటిల్లు, ఈశాన్యమున పూజాగృహములు రావు. కాఁబట్టి, వారివారి జాతకములు, నక్షత్రరాసుల ననుసరించి వాస్తునిర్ణయము చేయుట శాస్త్ర సంప్రదాయము. (ఇతరాంశములకు పంచాంగకర్తతో సంప్రదింపవచ్చును.)

## నవరత్న ధారణ విధానము

రత్నధారణము వల్ల కష్టములు తొలఁగి, అదృష్టము వరించునని అనేకులు నేటి కాలమున విశ్వసించుచున్నారు. కాని, ఎవరు ఏ రత్నమును ధరించవలెనో జాతకరీత్యా గాని, వారివారి పేర్లను బట్టి గాని నిర్ణయింపవలసియున్నది. కొందఱు జ్యోతిష్కులు (బంగారపు కొట్లవారు కూడ) నవరత్నాల ఉంగరం ధరించినచో, "సర్వరోగ నివారిణి" వలె అన్ని గ్రహదోషములు తొలగిపోవునని ప్రచారము చేయుచున్నారు; అది సరి కాదు.

సూర్యాది నవగ్రహాలకు ప్రీతికరమైన రత్నములు శాస్త్రంలో చెప్పఁబడినవి.

1. మాణిక్యము (కెంపు) : ఇది సూర్యునకు ప్రీతికరమగు రత్నము. సూర్యుని నక్షత్రములలోను, సూర్యుని రాశిలోను, ఆదివారము నాడు, 1-10-19-28 తేదీలలోను, సూర్యాంశలోను, మధ్యాహ్నకాలమున జన్మించినవారును యీ రత్నమును ధరించవలెను.
2. ముత్యము : చంద్రుని రాశిలోను, చంద్రుని నక్షత్రములలోను, 2-11-20-29 తేదీలలోను జన్మించినవారు; చంద్రుఁడు జాతకరీత్యా బలాధిక గ్రహముగ గలవారును, పున్నమినాడు పుట్టినవారును ముత్యములను ధరించవలెను.
3. పగడము : అంగారకుని రాసులు, నక్షత్రములలోను, మంగళవారమునాడు, 9-18-27 తేదీలలోను, అంగారకుఁడు రాజ్యస్థానములో నుండగాను జన్మించిన వారు పగడమును ధరించవలెను.



4. గరుడపచ్చ : బుధుని నక్షత్రములు, లగ్నములలోను, బుధవారమునాడు, 5-14-23 తేదీలలోను పుట్టినవారు పచ్చలను ధరించవలెను.
5. పుష్యరాగము : బృహస్పతి నక్షత్రములు, లగ్నములలోను, పుష్యమిలోను, గురువారమునాడు, 3-12-21-30 తేదీలలోను, గురువు 1-5-9 స్థానములలోను, గురుపూర్ణమి రోజునను పుట్టినవారు, వేదశాస్త్రములను చదివిన వారును, ఆచారవంతులు, సత్యధర్మపరాయణులును యీ రత్నమును ధరింపవలెను.
6. వజ్రము : శుక్రుని నక్షత్రములలోను, లగ్నములలోను, శుక్రవారమునాడు, 6-15-24 తేదీలలోను, శుక్రోదయ కాలమునందును, శుక్రమౌఢ్యము లేని కాలమందును జన్మించినవారు, కవులు, గాయకులు, నాట్యశాస్త్రవేత్తలు, సౌందర్యవంతులును యీ రత్నమును ధరించవలెను.
7. నీలము : సాధారణముగా నీలమణి అదృష్టమునివ్వదు. అయినను, శని నక్షత్రములు లగ్నములలోను, శనివారము నాడు, 8-17-26 తేదీలలోను శని ఉషస్సులోను, శని ప్రదోషకాలములోను, శని ఆయుః స్థానములోనున్నను, శనిత్రయోదశినాడు పుట్టినవారును ఈ రత్నమును ధరించుట మంచిది.
8. గోమేధికము : రాహు నక్షత్రములలోను, రాహుకాలములోను, సింహరాశిలో రాహు వుండగాను, దశమములో రాహు వుండగాను, 4-13-22-31 తేదీలలోను పుట్టినవారు గోమేధికరత్నమును ధరించవచ్చును.
9. వైడూర్యము : కేతు నక్షత్రములలోను, కేతువు లాభముననుండగాను, 9-18-27 తేదీలలోను పుట్టినవారీ రత్నమును ధరించవలెను.

నవగ్రహముల ప్రీతి కొఱకు, ఆయా గ్రహములకు చెప్పఁబడిన మంత్ర జపములు, హోమములు చేయించి, సంతర్పణము చేసి, నవరత్నములను దానము చేయవలెనని శాస్త్రములో చెప్పఁబడినది గాని, ఆ రత్నములను ధరించవలెనని యెచ్చటను గానరాదు. ఐనను, రత్నపుటుంగరములను ధరించుట తప్పుకాదు.

వెనుక చెప్పినట్లు నవరత్నపుటుంగరమును గాని, వారి జాతకరీత్యా ఒక్క రత్నమును గాని బంగారముతో చేయించి ధరించవలెను. రత్నపుటుంగరము నందు ఆయా గ్రహదేవతల నావాహనచేసి, పూజా-జప-దానములు సలిపి ఉంగరమును ధరించినచో మేలు కలుగును. అవి చేయింపక, వట్టిగా ధరించినచో నిష్ఫలమగునని తెలియవలెను.

(వారివారి జాతకరీత్యా ఏ ఉంగరము ధరించవలెనో తెలియగోరువారు, పంచాంగకర్తను సంప్రదించవచ్చును.)

# వివిధ సుముహూర్తములు

## నిశ్చయ తాంబూలాదులకు సుముహూర్త నిర్ణయము

**నిశ్చయ తాంబూలమునకు :** ఉభయ పక్షములందును విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి తిథులు; శుక్లపక్షమునందు ఏకాదశి, త్రయోదశి, పౌర్ణమి తిథులు, ఆది, బుధ, గురు, శనివారములందును, అశ్విని, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, శ్రవణ, ధనిష్ఠ, శతభిషం నక్షత్రములందు, లగ్నమునకు 5-9 స్థానములయందు పాపగ్రహములు లేనపుడు నిశ్చయ తాంబూలాలు పుచ్చుకోవలెను.

**పెండ్లికుమారుని, పెండ్లికుమార్తె చేయుటకు :** అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు, ఆది, బుధ, గురు, శని వారములు, మంచి తిథులయందు చేయవలెను.

సోమ, శుక్రవారములయందు పెండ్లికుమారుని, పెండ్లికూతురుని చేయుట మధ్యమపక్షము. మంగళవారము పగలు వివాహ విషయమునందు నిషేధము.

కొత్త పెండ్లికూతురు పెండ్లి అయిన మొదటి సం॥లో చైత్రమాసంలో పుట్టింట నున్న తండ్రికి దోషము. జ్యేష్ఠమాసములో అత్తింటనున్న బావగార్కి, ఆషాఢమాసంలో అత్తగార్కి, పుష్యమాసంలో మామగార్కి, అధికమాసంలో భర్తగార్కి, క్షయమాసంలో తనకు కీడు కలుగును.

**పెండ్లిపీట :** 6 అంగుళముల ఎత్తు, 5 అంగుళములు వెడల్పు, 37 అంగుళములు పొడవు సైజులు నుండవలెను.

**వివాహమునకు శుభకాలము :** ఉభయపక్షములయందు విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి; శుక్లపక్షమునందు త్రయోదశి, పౌర్ణమి; కృష్ణపక్ష పాడ్యమి తిథులు, బుధ-గురు-శుక్రవారములు మంచివి. రోహిణి, మృగశిర, మఘ, ఉత్తరాత్రయం, హస్త, స్వాతి అనూరాధ, మూల, రేవతి నక్షత్రములు; వృషభ, మిథున, కర్కాటక, కన్య, తుల, ధనుర్, మీన లగ్నములును మంచివి.

సప్తమము (7) గ్రహ వర్జితమై యుండవలెను. అష్టమశుద్ధి ప్రధానము. చంద్రుడు 6, 8, 12 లలోను, ఏ గ్రహముతోను కలిసియుండకూడదు. రవి మీనములో నుండగా వచ్చిన చైత్రమాసమునందు చేయరాదు.

కూతురునకు కొడుకునకు ఒకే లగ్నమందు పెండ్లి చేయకూడదు. ముందుగ కుమార్తె వివాహము, తర్వాత కుమారుని వివాహము చేయవలెను. ఏకోదరులకు



ఆరునెలల లోపు వివాహము చేయరాదు. కాని ఫాల్గునమాసమునందు ఒకరికి, చైత్రమాసమునందు రెండవవారికి చేయవచ్చును.

**పునర్వివాహము :** భార్య గతించిన వారు, పునర్వివాహము చేసికొనదలచిన యెడల, గతించిన భార్యయొక్క సంతానము జీవించియున్నచో బేసి సంవత్సరము, బేసి మాసములందును; సంతానము లేనిచో సరి సంవత్సరము, సరి మాసము లందును వివాహము చేసికొనవలెను.

**నవ వధూ గృహప్రవేశము :** వివాహము అయిన 16 రోజుల లోపల తిథి, వార, నక్షత్రములను చూడక సరిదినములలో గృహప్రవేశము చేయవచ్చును. 16 రోజులు అనంతరమైనచో ద్వాదశ శుద్ధి, విషము, వర్జ-మాసము చూడవలెను. 2, 3, 5, 7, 10 తిథులు; బుధ, గురు, శుక్రవారములు; అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, జ్యేష్ఠ, శ్రవ, ధని, శతభిష నక్షత్రములు; రవి కేంద్రములలో లేకుండునపుడు రాత్రికాలమున ప్రవేశింపవలెను.

**గాజులు :** గర్భము ధరించిన బేసినెలలు 5 లేదా 7 నెలలయందు తొడిగింప వలెను.

**గర్భవతియైన స్త్రీని పురిటికి తెచ్చుటకు :** బేసి నెలలైన 7 లేదా 9వ మాసమున మంచిరోజున తీసుకురావలెను. మొదటి రెండు పురుళ్ళు పుట్టింట, మూడవ పురుడు అత్తింట పోయవలెను. 3వ పురుడు పుట్టింట పోసిన శిశువుకు హాని.

**బాలింతరాలికి పత్యమునకు :** బుధ, గురు, శుక్రవారములు; 2, 3, 5, 7, 9, 10, 11, 13, 15 తిథులు; రోహిణి, మృగ, పున, పుష్య, అనూ, శ్రవ, ధని, శత, రేవతి, ఉత్తరాత్రయము మంచివి. లగ్నాత్ పదవయింట పాపగ్రహము గాని వీక్షణ గాని లేకుండ చూడవలెను.

**బాలింత స్నానము :** పురుడయిన 11వ రోజు చేయింపవలెను. కుదరనిచో ఆది, మంగళ, గురువారములు; అశ్విని, రోహిణి, మృగశిర, ఉత్తరాత్రయం, హస్త, స్వాతి, అనూరాధ, రేవతి నక్షత్రములందు చేయింపవలెను.

**శిశువునకు మొలత్రాడు కట్టుటకు :** పురిటి శుద్ధి నాడు కట్టుట మంచిది. కుదరనిచో అశ్విని, రోహి, మృగ, ఉత్తరాత్రయము, పుష్య, హస్త, అనూ, మూల, రేవతీ తారలతో కూడిన మంగళవారము, శుభ తిథి యందు, 5వ నెలలో మొలత్రాడు కట్టుట మంచిది. పసుపు, తెలుపు లేదా వెండి, బంగారు త్రాడునకు రాగికాణి, నల్లపూసలు, పురిటివేళ తీసిన శిశువు బొడ్డుగాని కట్టినచో గాలి, ధూళి, దిష్టి దోషములు తగలక యుండును.

**శిశువును ఇల్లు కదుపుటకు :** సోమ, బుధ, గురు, శుక్రవారములు; 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు; అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, అనూ, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములు; మేష, వృష, కర్కట, తుల, ధనుర్, మీన లగ్నములు మంచివి. శిశువు పుట్టిన 3వ మాసములో మొదట దేవాలయ దర్శనము చేసి, అటుపైన మేనమామ యింటికి తీసుకువెళ్ళవలెను.

**సూర్యచంద్రుల దర్శనము :** శిశువు జన్మించిన 3వ మాసములో మంచి రోజున దర్శనము చేయింపవలెను.

**శిశువును భూమిపై కూర్చుండబెట్టుటకు :** జననాది 5వ మాసమునందు కుంచెడు ధాన్యము రాశిగా పోసి, నూతన వస్త్రము పరచి, అశ్వి, మృగ, పుష్య, జ్యేష్ఠ నక్షత్రములందు కూర్చుండబెట్టి, పెద్దలచే ఆశీర్వచనము చేయించవలెను.

**పురుడు తరువాత శిశువుతో అత్తవారింటికి వెళ్ళుటకు :** సోమ, బుధ, గురు, శనివారములు; 2, 3, 5, 7, 10, 13 తిథులు; అశ్విని, రోహిణి, మృగ పున, పుష్య, మఘ, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములు మంచివి. తారాబల, ఆనందాదియోగ, వారశూలలు చూడవలెను. తారాబలము శిశువుకు, తల్లికి కూడా సరిపోవలెను. శిశువు జననాది 3, 5, 7, 9, 11 నెలలందు గాని, నెలలోపున బేసిరోజులయందు గాని వెళ్ళవచ్చును.

**దత్త స్వీకారమునకు :** బుధ, గురు, శుక్రవారములు; 2, 3, 5, 7, 10, 13, శుద్ధ ఏకాదశి, రోహి, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, స్వాతి, అనూ, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములు మంచివి. లగ్నమునకు శుభగ్రహదృష్టి, శుభగ్రహస్థితి మంచిది.

**యజ్ఞోపవీత ధారణ :** శ్రావణ పౌర్ణమి, గ్రహణ మోక్షము, మృత జాతాశౌచా నంతరములందు క్రొత్త జంధ్యము ధరించవలెను.

## విద్యా సుముహూర్తముల నిర్ణయము

**బహు బాషా విద్యలకు :** ఆది, మంగళ, శని వారములు; భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్లేష, మఘ, పుబ్బ, విశాఖ, జ్యేష్ఠ, పూ.షా., ఉ.షా., శతభిష, పూ.భా., రేవతి నక్షత్రములు, చంద్రుడు స్థిర లగ్నమందుట మంచిది.

**కంప్యూటర్, గణిత శాస్త్రములకు :** బుధ, గురు వారములు; రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, హస్త, అనూ, శత, పూ.భా., రేవతి నక్షత్రములు మంచివి.

**వేద విద్య నేర్చుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులు; అశ్వి, రోహి, ఆర్ద్ర, పున, పుష్య ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, రేవతి నక్షత్రములు, ద్విస్వభావ లగ్నములు మంచివి.



**వ్యాకరణమునకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10 తిథులు; అశ్వి, రోహి, మృగ, ఆర్ద్ర, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ నక్షత్రములు మంచివి.

**వైద్య విద్యకు :** ఆది, సోమ, మంగళ వారములు; విదియ, పంచమి, సప్తమి, దశమి తిథులు; అశ్వి, మృగ, ఆర్ద్ర, పున, పుష్య, ఆశ్లే, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, జ్యేష్ఠ, మూల, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములు మంచివి.

**న్యాయశాస్త్రమునకు :** సోమ, బుధ, గురు వారములు; అశ్వి, రోహి, పున, పుష్య, హస్త, స్వాతి, శ్రవ, శతభిష నక్షత్రములు మంచివి.

**ధర్మశాస్త్ర, పురాణాది విద్యలకు :** అశ్వి, మృగ, పుష్య, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, ధని, శత, రేవతి నక్షత్రములు మంచివి.

**సంగీత నాట్యములకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; ఉత్తరాత్రయము, ఆర్ద్ర, పుష్య, హస్త, అనూరాధ, జ్యేష్ఠ, ధని, రేవతి నక్షత్రములు మంచివి.

**వీణ, ఫిడేలు, మాండలీను వాద్యములకు :** బుధ, గురు, శుక్ర వారములు, 5, 10, 13, 15 తిథులు; రోహి, మృగ, పుష్య, ఉత్తర, హస్త, అనూరాధ, ఉ.షా., శత, ఉ.భా., రేవతీ నక్షత్రములు మంచివి.

**తబలా, మద్దెల మొ॥ వాద్యములకు :** బుధ, గురు, శుక్ర వారములు; 3, 5, 8, 10, 13, 15 తిథులు; అశ్వి, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, ధని, శత, రేవతీ నక్షత్రములు మంచివి.

**చిత్రలేఖనమునకు :** ఆది, సోమ, గురు, శుక్ర వారములు; 2, 5, 7, 11 తిథులు; అశ్వి, భర, రోహి, మృగ, పున, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, ఉ.షా., శ్రవ, పూ.భా., రేవతీ నక్షత్రములు మంచివి.

**ఉద్యోగములో చేరుటకు :** బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు; అశ్వి, పున, పుష్య, హస్త, చిత్త, అనూ, రేవతీ నక్షత్రములు మంచివి. రవి, కుజులు 10, 11 స్థానములో నుండగా శుభలగ్నములలో చేరవలెను.

**క్షురకర్మకు నిషిద్ధ నక్షత్రములు :** మఘయందు 5 మార్లు, కృత్తికయందు 6 మార్లు, రోహిణియందు 8 మార్లు, అనూరాధయందు 3 మార్లు, ఉత్తరయందు 4 మార్లు క్షౌరము చేసికొన్నవాఁడు, బ్రహ్మతో సమానుడైనను ఒక సంవత్సరము జీవింపడు. జన్మనక్షత్రము, జన్మవారములయందును క్షురకర్మ చేయించుకొనఁ గూడదు.

## బంగారు, వెండి పాత్రలు వాడుటకు సుముహూర్త నిర్ణయము

**బంగారం, వెండి, స్టీలు పాత్రలు వాడుటకు :** బుధ, గురు, శుక్ర వారములు; అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, శత, రేవతి నక్షత్రములందు, అమృతయోగ గడియలందును భుజించుట మంచిది.

**కార్లు, లారీలు, స్కూటర్లు, సైకిళ్లు, క్రొత్త వాహనాలు ప్రారంభించుటకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులు; అశ్వి, రోహి, పున; పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి అనూరాధ, జ్యేష్ఠ, శ్రవ, రేవతి నక్షత్రములు; వృష, మిథున, కర్కాటక, కన్య, తుల, ధనుః, మీన లగ్నముల యందు అష్టమశుద్ధి గల పగటి భాగమునందు ప్రారంభించవలెను. రాత్రి ప్రారంభించరాదు.

**గ్యాస్ స్టవ్, ఫ్రిజ్, మిక్సీ గ్రైండర్, వాషింగ్‌మెషీన్ వంటి ఆధునిక పరికరములు వాడుటకు :** మంగళ, బుధ, గురు, శుక్ర, శని వారములు; 2, 3, 5, 7, 10, 11, 13 తిథులందు వర్జ్యము, దుర్ముహూర్తము లేని కుజహోర యందు ప్రారంభించిన చాలకాలము మన్నిక నిచ్చును.

**మంచము, కుర్చీలు, టేబుల్స్ వగైరా ఫర్నిచర్ వాడుటకు :** బుధ, గురు, శుక్ర వారములు; 1, 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు; అశ్వి, రోహి, మృగ, పున పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, అనూ, శ్రవ, శత, రేవతి నక్షత్రములు మంచివి.

**కొత్తజోళ్ళు కొనుటకు, వాడుటకు :** బుధ, శని, ఆది వారములు; కృత్తిక, ఆర్ద్ర, మృగశిర, మఘ, పుబ్బ, ఆశ్లేష, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, రేవతి నక్షత్రములు మంచివి.

## తలంటు, మంచము నేయుట, నూతన వస్త్రధారణమునకు వార ఫలములు

| వారములు | తలంటు | మంచమునేత | వస్త్రధారణ |
|---|---|---|---|
| ఆదివారము | సంతానము | ధనలాభము | చిరుగుట |
| సోమవారము | శాంతి | సౌఖ్యము | చింత |
| మంగళవారము | అల్పాయువు | దుఃఖము | శుభహాని |
| బుధవారము | ధనలాభము | పీడ | ధనప్రాప్తి |
| గురువారము | ధననష్టము | సౌఖ్యము | జ్ఞానవృద్ధి |
| శుక్రవారము | సౌఖ్యహాని | రాజ్యలాభము | మిత్రప్రాప్తి |
| శనివారము | సర్వలాభము | నాశనము | మాలిన్యము |



## వర్తక, వ్యాపార సుముహూర్తముల నిర్ణయము

**బంగారం, వెండి నగల వర్తకమునకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి తిథులు; అశ్వి, రోహి, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, ఉత్తరాత్రయం, అనూ, శ్రవ, ధని, రేవతి నక్షత్రములు మంచివి.

**వస్త్రముల వ్యాపారమునకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10 తిథులు; అశ్వి, రోహి, పున, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, ధని, రేవతి నక్షత్రములు మంచివి.

**కిరాణా వ్యాపారమునకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; రోహి, మృగ, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, అనూ, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములు; 2, 3, 5, 7, 10 తిథులు మంచివి.

**ఎలక్ట్రికల్, గాజు వ్యాపారమునకు :** సోమ, మంగళ, బుధ, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10, 15 తిథులు; రోహి, మృగ, పుష్య, హస్త, చిత్త, అనూ, ఉ.భా. నక్షత్రములు మంచివి.

**రేడియో, టివి మొదలగు ఎలక్ట్రానిక్ వ్యాపారములకు :** సోమ, బుధ, శని వారములు; 2, 3, 5, 7, 10 తిథులు; మృగ, హస్త, చిత్త, స్వాతి, అనూ, పూ.షా., శ్రవ, ఉ.భా. నక్షత్రములు మంచివి.

**ఇనుము, స్టీలు వ్యాపారమునకు :** సోమ, బుధ, శని వారములు; 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు; శుక్ల పక్ష చతుర్దశి, అశ్వి, రోహి, మృగ, పుష్య, అనూ, స్వాతి, ఉ.భా. నక్షత్రములు మంచివి.

**ఫ్యాన్సీ వ్యాపారమునకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10 తిథులు; రోహి, మృగ, ఉత్తర, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా., ధని మంచివి.

**మందుల దుకాణమునకు :** మంగళ, బుధ, ఆది వారములు; 2, 3, 5, 7, 10, 11 తిథులు; రోహి, మృగ, ఉత్తర, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా., ధని మంచివి.

**పేపరు, పుస్తకములు, స్టేషనరీ :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10 తిథులు; రోహి, మృగ, హస్త, స్వాతి, అనూ, ఉ.షా., శ్రవ, ఉ.భా. మంచివి.

**పండ్ల దుకాణమునకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు; రోహి, మృగ, పున, పుష్య, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, శ్రవ, ధని, పూ.భా., ఉ.భా., రేవతి నక్షత్రములు మంచివి.

**పువ్వుల వ్యాపారమునకు :** సోమ, గురు, శుక్ర వారములు; రోహి, మృగ, పుష్య, హస్త, చిత్త, స్వాతి, ఉ.షా., శ్రవ, శత, ఉ.భా., రేవతి నక్షత్రములు మంచివి.

**గృహ ఫర్నీచరు దుకాణమునకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు; రోహి, మృగ, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, శత, రేవతి నక్షత్రములు, స్థిర లగ్నములు మంచివి.

**కాఫీ హోటల్స్, స్వీట్స్ షాపులకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10 తిథులు; అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, మఘ, ఉత్తరాత్రయం, హస్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములు, తృతీయ శుద్ధి గల శుభలగ్నములు మంచివి.

**రైస్‌మిల్లు ప్రారంభమునకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10, 11 తిథులు; అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, రేవతి నక్షత్రములు; చతుర్థ, అష్టమ శుద్ధి గల స్థిర లగ్నములు మంచివి.

**చిట్‌ఫండ్ వ్యాపారమునకు :** బుధ, గురు వారములు; 2, 5, 7, 10, 11 తిథులు; అశ్వి, రోహి, మృగ, ఉత్తరాత్రయం, స్వాతి, అనూ, శ్రవ, రేవతీ నక్షత్రములు, సప్తమమందు బలీయమైన శుభ గ్రహమున్నట్టి వృష, మిథున, కర్కట, తులా, ధనుర్, మీన లగ్నములు మంచివి.

**సినిమా ఫిలిం డిస్ట్రిబ్యూషన్ వ్యాపారమునకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులు; అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తర, స్వాతి, అనూ, ఉ.భా., రేవతీ నక్షత్రములు, శుక్రుడు బలముగా నుండి, సప్తమశుద్ధి గలిగిన శుభలగ్నమందు చేయుట మంచిది. శని బలముగా నుండవలెనని కొందరి మతము.

**మోటారు వాహన (ఫైనాన్స్) వ్యాపారమునకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10 తిథులు; మేష, వృశ్చిక లగ్నములు మంచివి. అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, మఘ, ఉత్తరాత్రయం, హస్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ధని, శత, రేవతీ నక్షత్రములు, స్థిర లగ్నములును మంచివి.

**అప్పులు ఇచ్చుటకు, పుచ్చుకొనుటకు :** అశ్వి, పున, పుష్య, స్వాతి, విశా, శ్రవ, ధని, శతభిష నక్షత్రములందు; అష్టమశుద్ధి కల లగ్నమందు; 5-9 స్థానములలో శుభులుండగాను చరలగ్నములలో అప్పులివ్వవచ్చును. బుధవారమునాడు అప్పు యివ్వరాదు. మంగళవారము, హస్తతో గూడిన ఆదివారము, సంక్రమణదినము లందును అప్పులు పుచ్చుకొనరాదు.

**జోళ్ళ షాపులకు :** కృత్తిక, మృగశిర, ఆర్ద్ర, ఆశ్లేష, మఘ, పూర్వాత్రయ నక్షత్రములు మంచివి.

**పేకాట క్లబ్బు (జూద గృహాలకు) :** మంగళ, శని, ఆది వారములు; 2, 7, 8, 10, 12, 13, 15 తిథులు; అశ్వి, మృగ, ఆర్ద్ర, పున, పుష్య, ఆశ్లే, హస్త, చిత్త, స్వాతి,



అనూ, మూల, శ్రవ, ధని, శతభిషా నక్షత్రములు; మేష, సింహ, వృశ్చిక, మకర, కుంభ లగ్నములు మంచివి.

**విస్కీ, బ్రాంది, లిక్కర్ వంటి మత్తు పానీయ వ్యాపారములకు :** మంగళ, శని, ఆది వారములు; 2, 3, 5, 7, 10, 11, 15 తిథులు; భరణి, ఆర్ద్ర, ఆశ్లేష, మఘ, పూర్వాత్రయం, జ్యేష్ఠ, మూల, శతభిషా నక్షత్రములు; తుల, ధనుః, మకర, కుంభ, మీన, మేష, వృషభ లగ్నములు మంచివి.

**బట్టలకు రంగు వేయు వ్యాపారమునకు :** ఆది, మంగళ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 7, 10 తిథులు; అశ్వి, పుష్య, పున, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూ, శ్రవ, ధనిష్ఠా నక్షత్రములు మంచివి.

## వ్యవసాయ సుముహూర్తముల నిర్ణయము

**క్రొత్తగా వ్యవసాయం ప్రారంభించుటకు :** ఆది, మంగళ, బుధ, శుక్ర వారములు మంచివి. సోమవారం సామాన్యం. 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులు; అశ్వి, రోహి, మృగ, మఘ, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, ధని, రేవతీ నక్షత్రములు మంచివి.

**దుక్కి దున్నుట, ఏరువాకకు :** ఆది, మంగళ, గురు, శుక్ర వారములు; అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, మఘ, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూ, మూల, పూ.షా., ఉ.షా., శ్రవ, ధని, శత, ఉ.భా., రేవతి నక్షత్రములు; వృష, మిథు, కన్యా, ధనుః, వృశ్చిక లగ్నములు మంచివి. మేష, కటక, సింహ, తుల, మకర, కుంభముల యందు దున్నరాదు.

**విత్తనములు చల్లుటకు :** చల్లబోయెడి రంగును బట్టి విత్తనముల రంగును బట్టి, ఆ రంగు ఏ గ్రహముదో, ఆ గ్రహవారములో చల్లుట మంచిది. మొత్తం ఈద అన్ని విత్తనములు 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు; అశ్వి, రోహి, మృగ, పుష్య, ఉత్తరాత్రయం, చిత్త, స్వాతి, అను, మూల, శ్రవణ, ధని, శత, రేవత నక్షత్రములు మంచివి. వీనికి కూడా ఏరువాక లగ్నములే మంచివి.

**పొలి పెట్టుటకు :** ఆది, గురు, శుక్ర వారములు, 3, 5, 8, 10, 13, 15 తిథులు, అశ్వి, రోహి, పున, పుష్య, మఘ, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, రేవతి నక్షత్రములు మంచివి. (పొలిపెట్టుట అనగా : ఊరి జాతరలలో దేవతల పేర నైవేద్యము పెట్టుట).

**వరి కంకులు ఊడ్చుటకు :** మలకపై పైరు ఊడ్చుటకు, సోమ, బుధ, గురు, శుక్ర వారములు, 4, 5, 7, 9, 10, 11, 14 తిథులు, అశ్వి, రోహిణి, మృగ, పుష్య, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవణ, ధని ఉ.భా., రేవతి నక్షత్రములు మంచివి.

**పంటకుప్ప నూర్చుటకు, వేయుటకు :** బుధ, గురు, శుక్ర వారములు; 3, 5, 7, 10, 11, 15 తిథులు; అశ్వి, రోహి, మృగ, పుష్య, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ధని, ఉ.భా., రేవతి నక్షత్రములు, స్థిర లగ్నములు మంచివి.

**పొలము నుండి క్రొత్త ధాన్యము తెచ్చుటకు :** సోమ, గురు, శుక్ర వారములు; యజమానికి తారాబలము, చంద్రబలము చూచి వర్జ్య దుర్ముహూర్తములు లేని శుభ గ్రహ హోరలో ఇంటికి తెచ్చుకొనవలెను.

**కొత్త ధాన్యపు అన్నము భుజించుటకు :** శని, గురు వారములు; 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు; అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, మఘ, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూ, మూల, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములు, అష్టమ చంద్రుడు లేకుండ భుజించవలెను.

**అరటి, కొబ్బరి, మామిడి తోటలకు :** బుధ, గురు, శుక్ర వారములు; 3, 5, 8, 10, 13, 15 తిథులు; అశ్వి, మృగ, పుష్య, మఘ, అనూ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, ఉ.భా., రేవతీ నక్షత్రములు శుభము.

**తమలపాకు, చెరకు, గోధుమ, ఆయిల్ ఫాం తోటలకు :** ఆది, మంగళ, గురు, శుక్ర, శని వారములు; మేష, వృష, కర్కా, తుల, ధనుః, మకర, మీన లగ్నములు, అశ్వి, మఘ, మూల, భరణి, పుబ్బ, పూర్వాషాఢ, కృత్తిక, ఉత్తరాత్రయం, పుష్యమి, హస్త, స్వాతి, అనూ నక్షత్రములు మంచివి.

**పొగాకు, పత్తి తోటలు వేయుటకు :** ఆది, బుధ, గురు, శుక్ర వారములు; అశ్విని, భరణి, మృగ, పున, పుష్య, ఆర్ద్ర, హస్త, చిత్త, స్వాతి, మూల, రేవతి నక్షత్రములు; కన్యా మీన కర్కాటక లగ్నములు మంచివి.

**వరి, వేరుశనగ, మొక్కజొన్న, ప్రొద్దుతిరుగుడు పంటలకు :** ఆది, సోమ, బుధ, గురు, శుక్ర, వారములు; 2, 5, 7, 9, 10, 11, 13, 15 తిథులు; అశ్వి, భర, రోహి, ఆర్ద్ర, పుష్య, హస్త, స్వాతి, మఘ, అనూ, ఉ.భా., రేవతీ నక్షత్రములు మంచివి.

**పెసర, కంది, సెనగ, మినుము, నువ్వులు పంటలకు :** బుధ, గురు, శుక్ర, వారములు; 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులు; రోహి, పున, ఉత్తరాత్రయం, స్వాతి, అనూ, మూల, శ్రవ, ధని, రేవతీ నక్షత్రములు; కర్కట, ధనుః, తుల, వృషభ, సింహ, వృశ్చిక లగ్నములు మంచివి.

**పసుపు, మిరప, ఉల్లి, వెల్లుల్లి, అల్లం పంటలకు :** ఆది, మంగళ, బుధ, గురు, శని వారములు; మేష, మిథున, కర్కాటక, కన్యా, వృశ్చిక, మకర, కుంభ లగ్నములు; అశ్వి, రోహి, మఘ, హస్త, శ్రవ, పుష్య, చిత్త, అనూ, మూల, ఉ.భా., ధని నక్షత్రములు మంచివి.

**కాకర, బీర, దోస, పొట్ల, చిక్కుడు, గుమ్మడి పంపాదులకు :** బుధ, గురు, శుక్ర వారములు; అశ్విని, భరణి, విశాఖ, రోహిణి, మృగశిర, పునర్వసు, హస్త, చిత్త, స్వాతి, అనూ, పూర్వాత్రయం, ఉత్తరాషాఢ, శ్రవణం, ఉ.భా., రేవతి నక్షత్రములు మంచివి.



**బొప్పాయి, మునగ, కరివేపాకు పంటలకు :** సోమ, బుధ, గురు శుక్ర వారములు; 2, 3, 5, 7, 10, 11, 15 తిథులు; అశ్వి, మఘ, మూల, భరణి, పూర్వాత్రయం, పున, విశాఖ, ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతీ నక్షత్రములు; మేష, వృష, కర్కాటక, సింహ, తుల, కుంభ, మీన లగ్నములు మంచివి.

**శీతాఫల, ఖర్జూర, రేగు, ద్రాక్షపళ్ళ పంటలకు :** బుధ, గురు, శుక్ర వారములు; శుభ తిథులు, అశ్విని, మృగ, పుష్య, హస్త, అనూ మూల నక్షత్రములు మంచివి.

**నిమ్మ, దానిమ్మ, కమల, బత్తాయి, జామ పంటలకు :** బుధ, గురు, శుక్ర, శని, ఆది వారములు; శుభ తిథులు. అశ్వి, భరణి, రోహిణి, ఆరుద్ర, పున, ఆశ్లేష, పూర్వాత్రయం, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, ధని, రేవతి నక్షత్రములు మంచివి.

**సీడ్ (రొయ్య విత్తనం), చేప చెరువులో వేయుటకు :** 2, 3, 4, 5, 7, 9, 10, 11, 12, 15 తిథులు; అశ్వి, భర, రోహి, మృగ, పున, ఆశ్లే, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, శ్రవ, రేవతీ నక్షత్రములు మంచివి.

## పశుపాలన విషయములు

**పశువులు కొనుటకు :** బుధ, గురు, శుక్ర వారములు; అశ్విని, పున, పుష్య, హస్త, పూర్వాషాఢ, ధనిష్ఠ, పూ.భా., రేవతీ నక్షత్రములు మంచివి.

**పశువులను క్రొత్తగా ఇంటికి తెచ్చుటకు :** ఆది, మంగళ, శని వారములు; భరణి, కృత్తిక, మృగ, ఆర్ద్ర, పున, మఘ, చిత్త, స్వాతి, అనూ, మూల, నక్షత్రములు మంచివి.

**పశుశాల వేయుటకు :** సోమ, బుధ, గురు, శుక్ర వారములు; 2, 3, 5, 6, 7, 10, 11, 13 తిథులు; అశ్వి, మృగ, పుష్య, హస్త, మూల, పూర్వాభాద్ర నక్షత్రములు మంచివి. పుష్యమీ నక్షత్రమున్నట్టి గురువారమునాడు వృషభలగ్నమందు, వృషభ నవాంశలో పశుశాల వేసిన, మృగ చోరభయములు గలుగక, పశువృద్ధి యుండును.

**పశువులకు బంధము వేయుటకు :** ఆది, గురు, శుక్ర వారములు; అశ్విని, మృగశిర, పుష్యమి, పుబ్బ, మూల, రేవతీ నక్షత్రములు మంచివి.

**పశువులను అమ్ముటకు :** సోమ, బుధ, గురు, శని వారములు; అశ్వి, మృగ, ఆశ్లేష, మఘ పూర్వాత్రయం, విశాఖ, జ్యేష్ఠ, ధనిష్ఠ, రేవతీ నక్షత్రములు మంచివి.

**పశువులను పశువులశాలలో కట్టుటకు :** అశ్విని, మృగశిర, పుష్యమి, హస్త, మూల, పూర్వాభాద్ర నక్షత్రములందు క్రొత్తగా పశువులను కట్టిన పశువృద్ధి కలుగును.

**దూడలను దుక్కికి పంపుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిథులందునూ; అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి,

మఘ, ఉత్తర, హస్త, స్వాతి, విశాఖ, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, రేవతీ నక్షత్రములందు; ఆది, సోమ, గురు, శుక్ర వారములందు మంచిది.

**క్రొత్తగా పశువులను కాడి పూన్చుటకు :** అశ్విని, భరణి, రోహిణి, పునర్వసు, హస్త, విశాఖ, జ్యేష్ఠ, శతభిషము, రేవతీ నక్షత్రములందు; ఆది, గురు వారములందు మంచిది.

**పోతులను పూన్చుటకు :** చవితి, అష్టమి, నవమి, చతుర్దశి, అమావాస్య తిథులందును, భరణి, రోహిణి, చిత్త, ఉత్తర, ఉత్తరాషాఢ, శ్రవణము, ఉత్తరాభాద్ర నక్షత్రములందు; శని, ఆది వారములందును పూన్చుట మంచిది.

**గాలము ముహూర్తము :** 1, 2, 3, 4, 5, 7, 10, 13, 15 తిథులు; రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పుష్య, పూర్వాత్రయం, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూ, శ్రవ, ధని, శతభిషం, రేవతీ నక్షత్రములు; వృషభ, మిథున, కర్కట, తులా, మకర, మీన, కుంభములును శుభము.

**పడవలు, ఓడలు నీటిలో దింపుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13 బ. 1 తిథులు; సోమ, బుధ, గురు, శుక్ర వారములు; అశ్వి, మృగ, ఆశ్లే, మఘ, పూర్వాత్రయం, హస్త, చిత్త, స్వాతి, విశా, మూల, రేవతీ నక్షత్రములు; మేష, మిథున, కర్కట, తులా, మకర, మీన లగ్నములు మంచివి.

## జ్యోతిష, ముహూర్త విజ్ఞానము

**మూఢము :** గురు, శుక్రులు రవితో కలిసి యుండెడి కాలమును మూఢము లేదా మౌఢ్యము అందురు. వారు శుభఫలములనీయరు. కావున వివాహాది శుభ కార్యాలు చేయరాదు. ఆశ్లేషాది గండ నక్షత్రములకు శాంతి, హోమ, జప, అభిషేకములు మాత్రమే చేయవలెను.

**గోధూళికా ముహూర్తము :** సూర్యుడున్నట్టి లగ్నము నుండి 7వది గోధూళిక మనబడును. మేతకు వెళ్ళిన గోవులు మరలివచ్చెడి - సూర్యాస్తమయ పూర్వవేళ అన్ని ప్రయాణాలకు మంచిది.

**వివిధ యాత్రలకు :** స్త్రీ యాత్రకు వృషభ, కన్యా, మిథున రాసులు; గోయాత్రకు తులా, వృషభ, మేష, సింహ, మకర లగ్నములు; ధనార్థులకు కుంభ, కర్కట, మీన, మకర రాసులు; యుద్ధయాత్రకు మేష, వృషభ, సింహ, ధనుర్ లగ్నములు జయప్రదములు.

**తిథి సంధి :** అమావాస్యకు శుద్ధ పాడ్యమికి నడుమ; పంచమి, షష్ఠీల మధ్య; దశమీ ఏకాదశుల నడుమ, 4 గడియల కాలము తిథిసంధి.



**నక్షత్ర సంధి :** రేవతీ అశ్వినుల మధ్యను, ఆశ్లేషా మఘ మధ్యను, జ్యేష్ఠా మూల తారల మధ్యను - 4 గడియల కాలము నక్షత్ర సంధి.

**లగ్న సంధి :** మీన మేషములు, కర్కట సింహములు. వృశ్చికల ధనుస్సులు - వీని నడుమ 1 గడియ లగ్న సంధి.

**కనుములు :** మరణము, శవదహనము, సపిండీకరణము, జాతర, సంక్రమణము, గ్రహణము - ఇవి జరిగిన మఱుసటి రోజును 'కనుము' అందురు. కనుము రోజున ప్రయాణములు చేయరాదు.

**నిషిద్ధ నవమీ త్రయము :** ఏదైనను ఒక ప్రయాణము చేసిన 9వ రోజున గాని, ఆ తిథికి 9వ తిథిన గాని, ప్రవేశము చేయరాదు. ప్రవేశించిన నాటి 9వ నాడు గాని, 9వ తిథిని గాని - అటునుండి బయలుదేరరాదు. వీనినే ప్రయాణ నవమి, ప్రవేశ నవమి, ప్రత్యక్ష నవమి అందురు. ఈ మూడు నవములు తిరుగు ప్రయాణమునకు నిషిద్ధములు.

**పక్షచ్ఛిత్ర తిథులు :** 4, 6, 8, 9, 12, 14 - తిథులు.

**పరామర్శకు :** ద్విపాద త్రిపాద తారలు, ధనిష్ఠా పంచకము పనికిరావు. సంఘటించినదాది సంవత్సరము లోపల ఏదో ఒక బేసినెల పరామర్శకు శుభము.

**తిస్రోష్టకలు :** మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గున మాసములలోను, కృష్ణ పక్షమున వచ్చు 7, 8, 9, తిథులతో కూడిన దినములను తిస్రోష్టకము లందురు. ఇవి అనధ్యాయములు.

**విసర్జించవలసిన కాలము :** గ్రహణాది 7 రోజులు, లగ్నాంతమున 1/2 గడియ, నక్షత్రాంతపు 2 1/2 గడియలు, మాసాంతపు 3 రోజులు, సంవత్సరాంతమున 15 రోజులు వర్జనీయాలు; శుభకార్యములు చేయరాదు.

**చుక్క ఎదురు దోషము :** శుక్ర మూఢములో ప్రయాణమునే చుక్కెదురు దోషమందురు. నవవధువు, గర్భిణీ, బిడ్డతో కలసి బాలెంత - వీరు ముగ్గురును శుక్రాభిముఖముగా ప్రయాణము చేయరాదు. శ్రీవత్సగోత్రము వారికీ చుక్కెదురు (పురశ్శుక్ర) దోషము లేదు.

**శనుష్షః కాలము :** శనివారము సూర్యోదయమునకు ముందు (సుమారు 30 ని॥ల) సమయమును శనుష్యః కాలమందురు. ఈ సమయములో ప్రయాణమై వెళ్ళినను, మరి ఏ పని ప్రారంభించినను దిగ్విజయమగును.

**అభిజిత్ ముహూర్తము :** సూర్యోదయ లగ్నము నుండి నాల్గవ లగ్నము, సుమారు 12 గంటల వేళ అభిజిన్ముహూర్త మనబడును. ఇది సర్వదోష నివారణము, యత్న కార్యసిద్ధిని కలిగించును.

**పంచ పర్వములు :** బహుళ, అష్టమి, చతుర్దశి, అమావాస్య, పూర్ణిమ, సంక్రమణ ప్రవేశకాలపు తిథి - ఇవి పంచపర్వములు. వీనియందు స్త్రీసంగమము కూడదు.

# జాతకర్మాది సుముహూర్తములకు యోగ్యమైన తిథి, వార, నక్షత్రాదులు

| సుముహూర్తః | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | శుద్ధి-విశేషములు |
|---|---|---|---|---|---|
| జాతకర్మా నామకరణమ్ | 2, 3, 5, 7 10, 11, 13 | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, మఘ, ఉత్తరాత్రయం, హస్త, స్వాతి, అనూ, శ్రవ ధని, శత, రేవ | శుభ లగ్నములు | 11వ రోజు. అథవా 12, 16, 21, 22వ రోజున పూర్వాహ్నము, 2, 8 శుద్ధి |
| డోలారోహణమ్ | 2, 3, 5, 7 10, 11, 13 | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, రోహి, మృగ, పున, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, విశా, అనూ, మూల, రేవ | శుభ లగ్నములు | 1, 3, 5 మాసములలో చేయవలెను. అష్టమశుద్ధి |
| అన్నప్రాశనమ్ | 2, 3, 5, 7 10, 13 | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, ధని, శత | మేష, వృశ్చి, మీన లగ్నములు నిషేధము. తక్కిన లగ్నములు శుభప్రదము. | శుక్లపక్షము, పూర్వాహ్నము. పురుషశిశువులకు సరి, స్త్రీ శిశువులకు బేసి నెలలు. శుభగ్రహయుత లగ్నము. 10 శుద్ధి. 9బు, 8కు, 7శు నిషేధము. |
| కేశఖండనమ్ | 3, 5, 10, 13 15 | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, శ్రవ, ధని, శత, రేవ | శుభ లగ్నములు | ఉత్తరాయణము. పుం సరి, స్త్రీ బేసి నెలలలో పూర్వాహ్నము. అథవా బేసి సం॥ 8 శుద్ధి |
| కర్ణవేధః | 2, 3, 5, 7 10, 13 | సోమ, బుధ, గురు, శుక్ర | మృగ, అర్ద్ర, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, శ్రవ, ధని, రేవ | సింహ, వృశ్చి, కుంభ లగ్నములు నిషేధము | ఉత్తరాయణము. 6, 7, 8 నెలలలో, పూర్వాహ్నము. అష్టమశుద్ధి. |



| సుముహూర్తః | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | శుద్ధి-విశేషములు |
|---|---|---|---|---|---|
| చౌలమ్ (చూడాకర్మ) | 2, 3, 5, 7 10, 13 | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, ధని, శ్రవ, రేవ (రోహి, ఉత్తరాత్రయం, స్వాతి, అనూ, శత) | వృష, మిథు, కర్కా, కన్యా, తులా, మకర, మీన (కుంభము నిషేధము) | ఉత్తరాయణము. 3వ, 5వ సం॥ శుక్లపక్షము, పూర్వాహ్నము. నవమశుద్ధి, శిశువు తల్లి గర్భిణి కారాదు. |
| అక్షర స్వీకరణమ్ | 2, 3, 5, 7 10, 13, 15 | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, పున, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, రేవ (అర్ద్ర, పుష్య) | చర లగ్నములు | ఉత్తరాయణము. 5వ సం॥ 5వ మాసము, 5వ రోజు. గురు, శుక్రమౌఢ్యములు కూడదు. అష్టమశుద్ధి. |
| విద్యారంభః | 2, 3, 5, 7 10, 13, 15 | సో-బు-గు-శు (శస్త్రవిద్యకు ఆది, మంగళ) | అశ్వి, మృగ, అర్ద్ర, పున, పుష్య, ఆశ్లే, పూర్వాత్రయం, హస్త, చిత్త, స్వాతి, మూల, శ్రవ | చర లగ్నములు | ఉత్తరాయణము. గురు, శుక్రమౌఢ్య, అనధ్యాయములు కూడదు. 4, 8 శుద్ధి. |
| ఉపనయనమ్ | 2, 3, 5, 7, 10, 13 | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, శ్రవ, ధని, రేవ (అనూ) | శుభ లగ్నములు | మీనచైత్రము కూడ శుభము. అష్టమశుద్ధి, 11 ట రవి. అనధ్యాయములు కూడదు. |
| వివాహః | 2, 3, 5, 7 10, 13 | బు-గు-శు (ఆది-మం-సో)* | రోహి, మృగ, మఘ, ఉత్తరాత్రయం, హస్త, స్వాతి, అనూ, మూల, రేవ (శ్రవ, ధని, అశ్వి, పుష్య, పూఫ, చిత్త)* | శుభ లగ్నములు | మాఘపంచకము శుభము. మీనచైత్రము నింద్యము. 7 శుద్ధి *ద్వితీయ వివాహమునకు |
| గర్భాధానమ్ (నిషేకః) | 2, 3, 5, 7 10, 13 | సోమ, బుధ గురు, శుక్ర | రోహి, ఉత్తరాత్రయం, హస్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, శత, రేవ (అశ్వి, మృగ, పున, పుష్య, చిత్త, ధని) | వృష, మిథు, కర్క, సింహ, కన్యా, తులా, ధనుర్మీన, కుంభ | లగ్న, అష్టమ శుద్ధులు. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| పుంసవనమ్ | 2, 3, 5, 7 10, 13, 15 | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ధని, శత, రేవ | మిథు, కర్కా, కన్యాలగ్నములు నిషేధము | అష్టమశుద్ధి గల లగ్నమున 3వ మాॱॱలో భర్తృసన్నిధి యందు చేయవలెను. |
| సీమంతమ్ | 2, 3, 5, 7 10, 13, 15 | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ధని, శత, రేవ | సింహ, వృశ్చిక లగ్నములు నిషేధము | నవమశుద్ధి గల లగ్నమున, 5-7-9 మాॱॱలలో భర్తృసన్నిధి యందు చేయవలెను. లగ్నములో చంద్రుడు, 5-8-12లలో చంద్రుడు పాపగ్రహములుండరాదు. |
| గృహారంభః (శంకుస్థాపనమ్) | 2, 3, 5, 7 10, 13, 15 | సోమ, బుధ, గురు, శుక్ర | రోహి, మృగ, ఉఫ, హస్త, చిత్త, జ్యేష్ఠ, ఉషా, మూల, శ్రవ (అశ్వి, పుష్య, స్వాతి, అనూ, శత, ఉభా, రేవ) | వృష, మిథు, సింహ, కన్యా, వృశ్చిక, ధనుః, కుంభ | కర్తరీ, మౌఢ్యములు కూడదు. 4, 8 శుద్ధి. సూర్యుడు స్థిర రాసులలో నుండవలెను. |
| గృహప్రవేశః | 2, 3, 5, 7, 10, 13, 15 | సోమ, బుధ, గురు, శుక్ర | రోహి, మృగ, ఉత్తరాత్రయం, చిత్త, అనూ, పూషా, ధని, రేవ (పుష్య, జ్యేష్ఠ) | గురు, శుక్రలగ్నములు (సింహ, వృశ్చి, కుంభ). జన్మరాశి, లగ్నాత్ 3, 6, 10, 11 (1) | మాఘపంచకము శుభము. (మార్గ, కార్తి). శుక్లపక్షము, పగలు-రాత్రి శుభము. కేంద్రములందు శుభ గ్రహములు. 4, 8 శుద్ధి. వాస్తుపూజ, బ్రాహ్మణభోజనము |
| నూతులు, బోరింగులు త్రవ్వుటకు | 2, 3, 5, 7 10, 11, 13, 15 | సోమ, బుధ, గురు, శుక్ర | రోహి, మఘ, పుష్య, ఉభా, హస్త, అనూ, శ్రవ, రేవ | కర్కాటక, మకర, మీన (వృష, కుంభ) | ఈశాన్యము ఉత్తమము. తూర్పు, ఉత్తరము మధ్యమము. |



| | | | | | |
|---|---|---|---|---|---|
| దేవతా ప్రతిష్ఠ | 2, 3, 5, 7, 8 10, 12, 15 | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, ధని, శత, రేవ | వృషభ, వృశ్చిక, సింహ, మిథునం, కన్య, ధనుః, కుంభ, మీన | సర్వదేవతలకు ఉత్తరాయణము (ఉగ్ర దేవతలకు దక్షిణాయణము) |
| యాత్ర | 2, 3, 6, 7 10, 11, 13 | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, అనూ, (రోహి, ఉత్తరాత్రయం, మూల, శత) శ్రవ, ధని, రేవ | చర లగ్నములు (రాజులకు ద్విస్వభావములు) | వార, నక్షత్ర శూలలు కూడవు. ఉక్తనక్షత్రపు 4 పా. శుభం. (యుద్ధయాత్రకు 11 శుద్ధి) |
| హలకర్మ | 2, 3, 5, 7 10, 11, 13, 15 | ఆది, మంగళ, బుధ, గురు, శుక్ర | అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, మఘ, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, విశా, అనూ, మూల, శ్రవ, ధని, శత, రేవ | వృష, మిథున, కన్య, వృశ్చిక, ధనుః, మీన | కర్తరి కూడదు. |
| క్రయ, విక్రయ వాణిజ్యారంభం | 2, 3, 5, 7, 10, 11, 13, 15 | ఆది, సోమ, బుధ, గురు, శుక్ర, శని | అశ్వి, భర, కృత్తి, రోహి, మృగ, (ఆర్ద్ర), పున, ఆశ్లే, పూర్వాత్రయం, హస్త, ఉత్తరాత్రయం, చిత్త, స్వాతి (విశా), అనూ, శ్రవ, శత, రేవ | కుంభ లగ్నము నిషేధము. | శుభయుత లగ్నములు. అష్టమశుద్ధి 12, 2, 11 శుద్ధి. |
| ఔషధసేవ | 2, 3, 5, 8, 10, 13 | ఆది, మంగళ, గురు, శుక్ర | అశ్వి, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ధని, శత, రేవ | చర లగ్నములు | తృతీయశుద్ధి |
| నూతన వస్త్రధారణ | 2, 5, 7, 8, 10, 13 | బుధ, గురు, శుక్ర | అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, విశా, అనూ, శ్రవ, ధని, శత, రేవ | శుభ లగ్నములు | షష్ఠ శుద్ధి |

సుముహూర్తములకు మహాదోషములు : నిష్కంభం, అతిగండ, శూల, గండ, వ్యాఘాత, వ్యతీపాత, పరిఘ, వైధృతి యోగములు; విష్టి, శకుని, చతు, నాగ, కింస్తుఘ్నములు; సంక్రాంతి, అయన దినములు; పాపాక్రాంత, పాపదృష్ట లగ్నములు, 8 కుజుడు, 6 శుక్రుడు, పాపగ్రహకర్తరి, జన్మలగ్న చంద్రలగ్నములకు అష్టమ లగ్నము. 6-8-12లలో చంద్రుడు, సగ్రహ చంద్రుడు, వేధక్రాంతలు, గ్రహణ నక్షత్రము, వర్జ్య దుర్ముహూర్తములు, తిథినక్షత్ర లగ్న సంధులు, మహాపాతలు - విడువదగినవి.

**సర్వార్థ సాధక చక్రము :** ఈ దిగువ చక్రము ప్రకారము వార నక్షత్రములున్నచో సర్వకార్యారంభములకును శుభప్రదము.

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| అశ్వి | శ్రవ | అశ్వి | - | అశ్వి | అశ్వి | శ్రవ |
| పుష్య | పుష్య | ఆశ్లే | - | పుష్య | - | - |
| ఉత్తర | రోహి | - | రోహి | - | - | రోహి |
| హస్త | - | - | హస్త | రేవ | రేవ | - |
| మూల | మృగ | - | మృగ | పున | పున | - |
| ఉ.షా. | - | కృత్తి | కృత్తి | - | - | స్వాతి |
| ఉ.భా. | - | ఉ.భా. | అనూ | అనూ | అనూ | - |

## శ్రీరామ చక్రము

| ౧ | ౧౫ | ౧౪ | ౪ |
|---|---|---|---|
| ౧౨ | ౬ | ౭ | ౯ |
| ౮ | ౧౦ | ౧౧ | ౫ |
| ౧౩ | ౩ | ౨ | ౧౬ |

౧ - స్థాననాశో భవేద్రామాత్, ౨ - సీతాయా దుఃఖసంభవః
౩ - లక్ష్మణాత్కార్యసిద్ధిస్స్యాత్, ౪ - తథైవస్యా ద్విభీషణాత్
౫ - మరణం కుంభకర్ణేన, ౬ - రావణేన కులక్షయః
౭ - అంగదేన ధ్రువం రాజ్యం, ౮ - సుగ్రీవా ద్బంధుదర్శనమ్
౯ - కల్యాణంస్యాదింద్రజితః, ౧౦ - దీర్ఘాయుష్యం చ జాంబవాత్
౧౧ - హర్షోదర్కంచాంజనేయాత్, ౧౨ - కైకేయ్యాః కార్యనాశనమ్
౧౩ - కౌసల్యాయాః కార్యసిద్ధిః, ౧౪ - శూర్పణఖ్యా మహద్భయమ్
౧౫ - భరతాత్సఫలంకార్యం, ౧౬ - గుహేన ప్రీతిసంభవః.

## తాంబూల ప్రశ్న

ప్రశ్న కొఱకై తెచ్చెడు దక్షిణ తాంబూలముల యొక్క సంఖ్యను ౫-చే గుణించి ౬-చే భాగింపగా నిలిచిన శేషమున (౧) లాభము, (౨) నష్టము, (౩) సుఖము, (౪) దుఃఖము, (౫) సంపద, (౬) మరణము అని ఈ రీతిగా ఫలమును చెప్పవలయును.

## గర్భస్థ స్త్రీ, పురుష శిశునిర్ణయ ప్రశ్న

కం. తరుణీ నామాక్షరములు
స్థిరముగ నేడింటఁ బెంచి తిథితోఁ గూడన్
పరమేష్ఠి (9-చే) పాలు గొన్నను
సరి కూతుఁరు, బేసి కొడుకు చయ్యన గల్గున్.

ఆయా కాలముల ప్రశ్నయందు లగ్నమునకు స్థానములయందు రవి గురు కుజులు మాత్రము ఉన్నపుడు పురుషుడును ఇతర గ్రహములున్నపుడు స్త్రీయును కలుగును.



## దినాధిపతి - తారాబల, చంద్రబలములు చూచు విధము

నిత్య నక్షత్రమునకు, జన్మ లేక నామ నక్షత్రమునకు ఎదురు గడిలో ఉన్న దినాధిపతిని తెలుసుకొని, దినాధిపతి వద్ద నున్న అంకె ద్వారా తారాబలము తెలుసుకొనవలెను.

| పంచాంగములోని నక్షత్రములు → / జన్మనామ నక్షత్రము ↓ | | | అశ్విని మఘ మూల | భరణి పూ.ఫల్గుని పూ.షాఢ | కృత్తిక ఉత్తర ఉ.షాఢ | రోహిణి హస్త శ్రవణ | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ.భాద్ర | పుష్యమి అనూరాధ ఉ.భాద్ర | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మఘ | మూల | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 |
| భర | పుబ్బ | పూ.షా. | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 |
| కృత్తి | ఉత్తర | ఉ.షా. | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 |
| రోహి | హస్త | శ్రవణ | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 |
| మృగ | చిత్త | ధని | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 |
| ఆర్ద్ర | స్వాతి | శత | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 |
| పున | విశాఖ | పూ.భా. | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 |
| పుష్య | అనూ | ఉ.భా. | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 |
| ఆశ్లే | జ్యేష్ఠ | రేవ | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 |

**తారాబలం :** 1. జన్మతార, 2. సంపత్తార, 3. విపత్తార, 4. క్షేమతార, 5. ప్రత్యక్తార, 6. సాధనతార, 7. నైధనతార, 8. మిత్రతార, 9. పరమమిత్ర తార. ఈ తొమ్మిదింటిలో 1, 3, 5, 7 మంచివి కావు. 2, 4, 6, 8, 9 మంచివి. బహుళపక్షమున తారాబలము ముఖ్యము.

**చంద్రబలం :** శుక్లపక్షములో చంద్రుడు - జన్మరాశికి 2-5-9 స్థానాలలోను, కృష్ణ పక్షములో 4-8-12 స్థానాలలోనూ, ఉభయ పక్షములందూ, 1-3-6-7-10-11 రాసులయందు ఉన్న చంద్రుడు బలవంతుడు. శుద్ధపక్షమున చంద్రబలము ముఖ్యము.

## దినాధిపతుల ఫలములు

**1. రవి** : త్రిప్పట, అకాల భోజనము, పైత్య శరీరము, వ్యయం, కార్య వ్యతిరేకత, రాజకీయ చర్చలు, పరుల వలన ఆశాభంగం, మలిన వస్త్రధారణ, శ్రమతో కార్యలాభము.

**2. చంద్ర** : మనస్సు ప్రశాంతత, భక్తి, ఇష్టాన్న భోజనం, స్త్రీ సౌఖ్యం, గౌరవం, నిర్మలత్వం, క్రొత్త బట్టలు, పువ్వులు, వాడుట, ఆభరణం ధరించుట, అలంకరించుకొనుట, తల్లియందు అనురాగం, కార్యజయము.

**3. కుజ** : ఆకస్మిక కోపం, మానసికవేదన, భూవ్యవహారముల ఆలోచన, కఠిన మనస్సు, చెడు వార్తలు వినుట, ఆకస్మిక ప్రయాణం, కార్య వ్యతిరేకత, అపవాదులు, కలహము.

**4. బుధ** : శ్రమతో పని నెరవేరుట, శుభవార్త వినుటయు, జ్యోతిష గోష్ఠి, బంధు, మిత్ర దర్శనం, ఆరోగ్యాదులుండుట, మంచివారితో స్నేహం, స్వల్ప చికాకులు.

**5. గురు** : గౌరవాదులు, సుఖమయమైన భోజనం, ధనలాభం, కార్యజయం, శయ్యా భోగం, పండితగోష్ఠి, కుమారునితో మంచి ఆలోచనలు చేయుట, శుచిగా వుండుట, విద్యాభివృద్ధి.

**6. శుక్ర** : స్త్రీలపై ఆసక్తి, సుఖ భోగాదులు, నూతన వస్త్రములు ధరించుట, ఉద్యోగమునందు కార్యజయం, అప్పుల వసూలు, పరిమళ ద్రవ్యములు వాడుట, కళత్ర సౌఖ్యము.

**7. శని** : బుద్ధిమాంద్యము, బద్ధకము, ఒళ్ళు విరుచుట, తొందర మాటలు, అగౌరవము, నీచకార్యమునందాసక్తి, మనోవిచారము, చెడ్డమాటలు వినుట, చెడ్డవారితో స్నేహం, కష్టనష్టానుభవం, ఆకస్మిక ప్రమాదములు, ఋణబాధ, పొత్తికడుపునందు నొప్పి, ఎముకలు విరుగుట జరుగును.

**8. రాహు** : పుండ్ల సంబంధమయిన వ్యాధులు, స్మశాన దర్శనం, విరక్తి, అకాల భోజనం, దుస్వప్నాదులు, చెడ్డవారితో స్నేహం, ఆకస్మిక కలహాలు, మనోవ్యథ, నిందలు కలుగును.

**9. కేతు** : ప్రయాణము, శ్రమ, రాజభీతి, మనోచాంచల్యము, తీర్థయాత్రలు, పురాణ కాలక్షేపం, విష జంతు భీతి, అకారణ కోపం, అధికారులచే చీవాట్లు కలుగును.

**పంచకరహిత విషయము :** తిథి, వార, నక్షత్ర, లగ్న సంఖ్యలను కలిపి, 9చే భాగించగా - 3, 5, 7, 0 - శేషము వచ్చినచో పంచకరహితమనియు శుభమనియు తెలియవలెను. అట్లుగాక 1, 2, 4, 6, 8 శేషము వచ్చినచో దోషము. 1 శేషమైన మృత్యుపంచకము, 2 శేషించిన అగ్ని పంచకము, 4 రాజ పంచకము, 6 చోర పంచకము, 8 రోగ పంచకము అని తెలియవలెను. తప్పనిసరియైనచో అగ్నిపంచక, మృత్యుపంచక, రోగ పంచకములు లేకుండా చూసుకొని శుభకార్యములు జరుపుకొనవలెను.



## తారలకు అధిపతులు - శాంతులు

**1. జన్మతార :** సామాన్యం, అధిపతి రవి, వాహనం నెమలి, దోషకాలం గం. 2-48 నిమిషములు. అకుకూర శాంతి.

**2. సంపత్తార :** కార్యజయం, అధిపతి బుధుడు, ద్రవ్యలాభం, సుఖశాంతులు. గుఱ్ఱం వాహనము.

**3. విపత్తార :** కార్యనాశనం, అధిపతి రాహువు. కలహం, మేక వాహనం, బెల్లం దానం శాంతి గం.1-12 నిమిషములు దోషకాలము.

**4. క్షేమతార :** కుశలం. అధిపతి గురుడు, ధైర్యం, రాజ్యలాభం, సుఖశాంతులు, కార్యసిద్ధి, గజవాహనము.

**5. ప్రత్యక్తార :** కార్యహాని, అధిపతి కేతువు, మరణం, వాయస, వివాహనం, శాంతి : ఉప్పుదానం. దోషకాలం : గం. 3-12 నిమిషములు.

**6. సాధన తార :** కార్యసాధనం, అధిపతి చంద్రుడు, కీర్తి, సౌఖ్యం, ధనలాభం, నక్క వాహనము.

**7. నైధన తార :** నాశనం. అధిపతి శని, యుద్ధభయం, మరణం, వాహనం - సింహం, శాంతి: తిలసహిత సువర్ణదానము.

**8. మిత్రతార :** సుఖ సంపద, అధిపతి : శుక్రుడు, విశేష సౌఖ్యం, ధనలాభం, వాహనం - గరుడ.

**9. పరమిత్ర తార :** సుఖమును కలుగచేయుట, అధిపతి కుజుడు. ధనలాభం శ్రమమీద జయం. వాహనం - హంస.

1వ నవకమునందు జన్మతారయు, 2వ నవకములో విపత్తారయు, 3వ నవకమునందు ప్రత్యక్తారయు, మూడు నవకములందును నైధన తారయు పనికిరావు.

## వివాహ విషయమై ఏకరిక్ష దోషము

సాధారణముగా వధూవరుల జన్మనక్షత్రములు ఒకటే అగుట దోషము. అయితే, యీ క్రింది నక్షత్రములకు ఏకరిక్ష (ఒకే నక్షత్ర) దోషము లేదు :

**రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, మఘ, విశాఖ, శ్రవణము, ఉత్తరాభాద్ర, రేవతి.**

వధూవరులకు ఏక నక్షత్రమై రాశి భేదమున్నను, ఏకరాశియై యుండి భిన్న నక్షత్రములైనను శుభము.

## వివాహాది శుభకార్యనిషిద్ధమైన శూన్యమాసములు

శ్లో॥ మీనచైత్రో ధనుఃపుష్యో, మిథునాఽఽషాఢ ఏవ చ ।
కన్యాభాద్రపదశ్చైవ, శూన్యమాసాః ప్రకీర్తితాః ॥

కళింగదేశమునకు మాత్రమే మీన చైత్రము దోషమని చెప్పఁబడినది.

# గోచార ఫలదర్శన చక్రము

నవగ్రహములు లగ్నాది ద్వాదశ స్థానములందుండునపుడిచ్చు ఫలములీ క్రింది పట్టికలో చూపబడినవి.

| స్థానం | రవి | చంద్రుడు | కుజుఁడు | బుధుఁడు | గురువు | శుక్రుఁడు | శని | రాహు | కేతువు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | స్థానచలనము | సౌజన్యము | దుఃఖము | బంధనము | గమనము | ఆరోగ్యము | విపత్తు | భయము | భయము |
| 2 | భయము | వ్యయము | వ్యయము | లాభము | ధనలాభము | భాగ్యము | హాని | కలహము | విరోధము |
| 3 | సంపత్తు | లాభము | లాభము | వ్యయము | విపత్తు | సౌభాగ్యము | సంపద | సౌఖ్యము | సుఖము |
| 4 | మానభంగము | హాని | రిపుభయము | శుభము | వ్యయము | సుఖము | రోగము | మానహాని | మానహాని |
| 5 | భయము | కార్యనాశము | రిపుభయము | దరిద్రము | సంపద | పుత్రలాభము | సుతక్షయము | ధనవ్యయము | క్లేశము |
| 6 | రిపుహాని | శుభము | ధనలాభము | భూషణము | దుఃఖము | వ్యయము | సంపద | సుఖము | సంతోషము |
| 7 | దేహపీడ | లాభము | కలహము | వ్యసనము | ఆరోగ్యము | క్లేశము | రాజాగ్రహము | భయము | భీతి |
| 8 | రోగము | వ్యయము | భయము | సంతోషము | హాని | భయము | దుఃఖము | మృత్యువు | హాని |
| 9 | భయము | వ్యాకులము | వ్యయము | దుఃఖము | ధనాగమము | ధనలాభము | రోగము | సంతాపము | కలహము |
| 10 | లాభము | లాభము | చలనము | శుభము | హాని | సౌఖ్యము | జాడ్యము | కలహము | విరోధము |
| 11 | ఆరోగ్యము | శుభము | లాభము | సుఖము | సంతోషము | సౌఖ్యము | లాభము | లాభము | ధనాగమము |
| 12 | వ్యయము | దుఃఖము | రోగము | వ్యయము | పీడ | లాభము | క్లేశము | హాని | హాని |

గోచారము చూచు విధము : గోచారమునకు ఎల్లప్పుడు జన్మరాశిని బట్టి చూడవలెను. వృషభ, కర్కట రాసులవారు గోచారఫలమును జన్మరాశిని బట్టియే చూడవలెను. జన్మలగ్నమును బట్టి కూడ చూడవలెనని కొందఱి అభిప్రాయము :

శ్లో॥ ప్రాయేణ సర్వత్ర విలోకయన్తి చాంద్రం బలం గోచరతో విశుద్ధమ్ ।
లోకేషు యత్ చాంద్రబలం ప్రధానం శాస్త్రేషు ముఖ్యం ఖలు లగ్న మేవ ॥ (వసిష్ఠః)



# వింశోత్తరీ దశాక్రమము

| → మహాదశలు | రవి 6 | చంద్ర 10 | కుజ 7 | రాహు 18 | గురు 16 | శని 19 | బుధ 17 | కేతు 7 | శుక్ర 20 | మొత్తము 120 సం॥ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| భుక్తుల వివరణ ↓ | కృత్తిక ఉత్తర ఉ.షా. | రోహిణి హస్త శ్రవణం | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ.భా. | పుష్యమి అనూరాధ ఉ.భా | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి | అశ్విని మఘ మూల | భరణి పుబ్బ పూ.షా. | గ్రహ ప్రీతికర లోహాలు |
| | నె రో | నె రో | నె రో | నె రో | నె రో | నె రో | నె రో | నె రో | | |
| 1. రవి | 3 18 | 6 0 | 4 6 | 10 24 | 9 18 | 11 12 | 10 6 | 4 6 | 12 0 | తామ్రం |
| 2. చంద్ర | 6 0 | 10 0 | 7 0 | 18 0 | 16 0 | 19 0 | 17 0 | 7 0 | 20 0 | మణులు |
| 3. కుజ | 4 6 | 7 0 | 4 27 | 12 18 | 11 6 | 13 9 | 11 27 | 4 27 | 14 0 | బంగారం |
| 4. రాహు | 10 24 | 18 0 | 12 18 | 32 12 | 28 24 | 34 6 | 30 18 | 12 18 | 36 0 | చర్మం |
| 5. గురు | 9 18 | 16 0 | 11 6 | 28 24 | 25 18 | 30 12 | 27 6 | 11 6 | 32 0 | రజతం |
| 6. శని | 11 12 | 19 0 | 13 9 | 34 6 | 30 12 | 36 3 | 32 9 | 13 9 | 38 0 | ఇనుము |
| 7. బుధ | 10 6 | 17 0 | 11 27 | 30 18 | 27 6 | 32 9 | 28 27 | 11 27 | 34 0 | మిత్రం |
| 8. కేతు | 4 6 | 7 0 | 4 27 | 12 18 | 11 6 | 13 9 | 11 27 | 4 27 | 14 0 | శృంగం |
| 9. శుక్ర | 12 0 | 20 0 | 14 0 | 36 0 | 32 0 | 38 0 | 34 0 | 14 0 | 40 0 | సీసం |

నవరత్న ధారణ విధి : రవి ప్రీతికై మధ్యను మాణిక్యమును, శుక్రునకుఁ దూర్పున వజ్రమును, చంద్రున కాగ్నేయమున ముత్యమును, కుజునకు దక్షిణమునఁ బ్రవాళమును రాహువునకు నైరృతిని గోమేధికమును, శనికి పశ్చిమమున ఇంద్రనీలమును, కేతువునకు వాయువ్యమున వైడూర్యమును, గురునకు ఉత్తరమున పుష్యరాగమును, బుధునకు ఈశాన్యమున మరకతమును (గరుడపచ్చ) యథావిధిగఁ జేయించిన యంగుళీయకమును సదా ధరించుచుండిన గ్రహపీడలు తొలగి ఆయురారోగ్యైశ్వర్య ప్రాప్తి నొందుదురు.

# సదాచారము (మంచి అలవాట్లు)

## నిద్రనుండి లేవఁగానే చూడఁదగిన వస్తువులు

నిద్రనుండి మేలుకొనఁగానే తామరపువ్వు, బంగారు, దీపము, అద్దము, సూర్యుఁడు, మండనిప్పు, యెఱ్ఱచందనము, సముద్రము, పొలము, మేఘముచేఁ గప్పఁబడిన పర్వతము, దూడగల ఆవు, తనదు కుడిచేయి, భార్య, తనయందు ప్రేమ గలవారిని, తనకు ప్రేమ గలవారిని, మృదంగము, వీనియందు దేనైన నొకటిని చూచిన యెడల ఉత్తమము. అద్దము చూచుటచేత, వీర్యమును, సంతోషమును, సర్వవశ్యమును, జ్ఞానమును ఎక్కువగా నగును. మఱియును; ఉన్మత్తుఁడు, అడవి యేనుఁగు, నల్లకోడి, రాజదర్శనము, గోపురము వీనినిఁగూడ చూచుట ఉత్తమము.

## దంతధావనమును చేసికొను కాష్ఠములు

మఱ్ఱి ప్రకాశమును, కానుగు రణవిజయమును, జువ్వి ధనసంపత్తిని, చండ్ర సౌగంధ్యమును, మారేడు ధనమును, అత్తి వాక్శుద్ధిని, ఉత్తరేణి ధృతి మేధ ప్రజ్ఞాశక్తి దేహసౌష్ఠవము ఆయువు శీలము సంపత్తు మున్నగువానిని కలుగఁజేయును.

## స్నానమును చేయునపుడు ధ్యానము

"శ్లో॥ హరి ర్నారాయణో గంగా, గంగా నారాయణో హరిః ।
హరి ర్విశ్వేశ్వరో గంగా, గంగా విశ్వేశ్వరో హరిః ॥"

అని చెప్పుచు, (సూర్యోదయాత్పూరము నీటియందు విద్యుచ్ఛక్తి ఆవరించి యుండుటవలన అప్పుడు) స్నానమును చేయుట తేజస్కరము.

"శ్లో॥ గంగేచ యమునే కృష్ణే, గోదావరి సరస్వతి ।
నర్మదే సింధు కావేరి, జలేస్మిన్ సన్నిధింకురు ॥
గంగా గంగేతి యోబ్రూయా, ద్యోజనానాం శతైరపి ।
ముచ్యతే సర్వపాపేభ్యో, విష్ణులోకం సగచ్ఛతి ॥
నందినీ నలినీ సీతా, మాలినీ చ మహాపగా ।
విష్ణుపాదాబ్జసంభూతా, గంగా త్రిపథగామినీ ।
భాగీరథీ భోగవతీ, జాహ్నవీ త్రిదశేశ్వరీ ।
ద్వాదశైతాని నామాని, యత్ర యత్ర జలాశయే ।
స్నానకాలే పఠే న్నిత్యం, మహాపాతకనాశనమ్ ॥"

అని గంగను ప్రార్థించుచు, "శ్రీమహావిష్ణో, శ్రీమహావిష్ణో" అని ధ్యానించుచు శుభ్రవస్త్రమును (అనఁగా మడివస్త్రమును) కట్టుకొని ఉపవస్త్రమును పైన ధరించి సంధ్యావందన మాచరింపవలయును.



శ్లో॥ ఉత్తమం తు నదీస్నానం, తటాకే మధ్యమం స్మృతమ్ ।
కూపస్నానం తు సామాన్యం, భాండస్నానం వృథా భవేత్ ॥

గృహమునందు స్నానము చేయునపుడు సంకల్పమును చెప్పఁ బనిలేదు. గంగాధ్యానము మాత్రము చేయవలయును.

## వస్త్రధారణ నియమము

స్నానానంతరము మఱొక వస్త్రముచేత దేహమును తుడుచుకొనవలయును గాని స్నానము చేసిన వస్త్రముతోఁగాని, వట్టిచేతితోఁగాని దేహమును తుడుచుకొనఁ గూడదు. స్నానము చేసి వస్త్రమును ధరించిన పిదప, తలనుండి నీరు కారగూడదు. పశువులు నమలిన వస్త్రమును, కాలిన వస్త్రమును ధరింపఁగూడదు. ద్విజుఁడు స్వచ్ఛమైన తెల్లనివస్త్రమును ధరింపవలయును గాని రంగుగుడ్డలను ధరింపఁ గూడదు. రెండు వస్త్రములు లేనిది సంధ్యావందనాది శాస్త్రీయకర్మల నాచరింపఁ గూడదు. రెండు వస్త్రములు లభింపనియెడల, ఆ యుత్తరీయమునకు ప్రత్యామ్నాయము మఱొక ఉపవీతమును ధరింపవలయును. మఱియును; తడిగుడ్డకట్టుకొని గాని, కచ్చముడి వేయక గాని (పించగోచి కట్టక గాని) శాస్త్రీయకర్మల నాచరింపఁగూడదు. తడిబట్ట కట్టుకొని పెద్దమడి యని తలంచుట పొరబాటనియు, తడిబట్ట కట్టుకొనుట దిగంబరత్వముతో సమాన మనియు తెలియవలెను.

## విభూతిధారణ విధి

లాలాటము, వక్షఃస్థలము, భుజములు వీనియందు పంచాక్షరి మంత్రముతో విభూతిని ధరింపవలయును. నడిమివ్రేలు పవిత్రపువ్రేలు ఈ రెండు వ్రేళ్ళచే అనులోమము (యెడమనుండి కుడివైపునకు) భస్మమును ధరించి యీ రెండు విభూతిరేఖలమధ్య బొటనవ్రేలిచేత విలోమముగ (కుడినుండి యెడమవైపునకు) భస్మమును ధరింపవలయును.

## శ్రీచూర్ణధారణ ధ్యానము

రెండు కన్నులను మూసికొని, రెండుచేతులను జోడించుకొని, అంజలిహస్తుఁడై ధ్యానమును చేయవలయును.

"శ్లో॥ శంఖ చక్ర గదా పాణే, ద్వారకా నిలయాచ్యుత ।
గోవింద పుండరీకాక్ష, రక్ష మాం శరణాగతమ్ ॥"

అను ఈ మంత్రమును నోటఁజెప్పక మనస్సులోనే ధ్యానించి "ఓం నమో భగవతే వాసుదేవాయ" అను మంత్రమును ముమ్మాఱులు మనస్సున దలంచి, వెనుక, "శరణాగతరక్షకా! రక్షింపుము, రక్షింపుము" అని మనస్సున దలంచుచు; కేశవాది నామముల నుచ్చరించుచు శ్రీచూర్ణమును ధరింపవలయును. తర్వాత వేదోక్తవిధిగా సంధ్యావందన మాచరింపవలయును.

## స్త్రీ కుంకుమ ధారణ ధ్యానము

"శ్లో॥ ఓంకారపంజర శుకీం, ఉపనిషదుద్యాన కేళికలకంఠీమ్ ।
ఆగమవిపిన మయూరీం, ఆర్యా మంతర్విభావయే గౌరీమ్ ॥"

అను ఈ మంత్రమును చెప్పుచు స్త్రీలు కుంకుమమును ధరింపవలయును.

## జింకచర్మముపైఁ గూర్చుండి జపమును చేయుటవలన గలుగు ఫలము

ఒక అంగుళము యెత్తు గల పీఠముపై జింకతోలు పఱచి దానిపై తెల్లనిబట్టను మడతతో నమర్చి, ఉత్తరముఖముగా గూర్చుండి నిష్కామముతో (అనఁగా నేదియును గోరక) సంధ్యావందనమును చేయవలయును. అట్లు చేయక భూమిమీఁదను, బట్ట మీఁదను, పీఁటమీఁదను నదీతీరముననుు జింక చర్మమును లేకయే కూర్చుండి జపము చేసినయెడల, అయస్కాంతము సూదిని యీడ్చుకొనునట్లు, జపము యొక్క ఫలమును భూమి యీడ్చుకొనును. కాఁబట్టి జింకచర్మముపై గూర్చుండి జపము చేయవలయు నని శ్రీకృష్ణుఁడు చెప్పి యున్నాఁడు. ఇట్లు సంధ్యావందనము, జపము, పూజ చేయవలసి వచ్చినపుడు, జింకచర్మము ప్రతివారికిని ముఖ్యావశ్యకమై యుండును.

### జపమాలా విధి

"శ్లో॥ ప్రవాళ ముక్తా స్ఫటికై ర్జప్త్వా కోటిఫలప్రదమ్ ।
తులసీమణినా చైవ ఫలితం చాక్షయం భవేత్ ।
రుద్రాక్షమణినా చైవ హ్యనంతం ఫల మశ్నుతే ॥"

పగడపుమాల, ముత్యపుమాల, స్ఫటికమాలలచేతఁ జేసిన జపము కోటి ఫలప్రదము. తులసిమాలచేతఁ జేసిన జపము అక్షయ ఫలమును, రుద్రాక్షమాలచేతఁ జేసిన జపము అపరిమిత ఫలము నొసంగును.

## దేవతార్చన చేయు కారణము

దివారాత్రములు దేవునికి ఆరాధన మొనర్చిన వెనుక, పిల్లలు పెద్దలు మొదలగు వారు భోజనము చేయవలయును గాని అంతకుముందు చేయఁ గూడదు. ఎందు కనఁగా, ఒక్కొక్క పదార్థమునందు జీవుఁ డున్నాఁడు. ఆ పదార్థములను కోసి వంట చేయుటచే దోషము వచ్చుచున్నది. కావున ఆ పదార్థములను ఈశ్వరునకు అర్పణమును చేసినయెడల ఆ దోషము నివారణమగును.

## దేవతాదర్శనము చేయునపుడు ధ్యానశ్లోకములు

### గణపతిని దర్శించునపుడు పఠించు ధ్యానము

"శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం, శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయే, త్సర్వవిఘ్నోపశాంతయే ॥



### గరుడదర్శనము చేయునపుడు పఠించు ధ్యానము

శ్లో॥ కుంమాంకిత వర్ణాయ, కుందేందు ధవళాయ చ ।
విష్ణువాహ నమస్తుభ్యం, పక్షిరాజాయ తే నమః ॥

### కషాయమును పుచ్చుకొనునపుడు పఠించు ధ్యానము

శ్లో॥ శరీరే జర్జరీభూతే, వ్యాధిగ్రస్తే కళేబరే ।
ఔషధం జాహ్నవీతోయం, వైద్యో నారాయణో హరిః ॥

### సూర్యనమస్కార ధ్యానము

శ్లో॥ బ్రహ్మస్వరూప ముదయే, మధ్యాహ్నేంతు మహేశ్వరః ।
సాయం ధ్యాయే త్సదా విష్ణుం, త్రిమూర్తిస్తు దివాకరః ॥
వినతా తనయో దేవః, కర్మసాక్షీ సురేశ్వరః ।
సప్తాశ్వః సప్తరజ్జుశ్చ, అరుణో మే ప్రసీదతు ॥
ఆదిత్యస్య నమస్కారం, యే కుర్వంతి దినేదినే ।
జన్మాంతర సహస్రేషు, దారిద్ర్యం నోపజాయతే ॥

అని ఈ ప్రకారము, ప్రాతస్సాయంకాలములయందు సూర్యభగవానుని నమస్కరించి ధ్యానించినవారికి, ఆ సూర్యుఁడు వారువారు ప్రతినిత్యమును చేయునట్టి పాపములను నశింపఁజేసి, సత్కర్మములయం దాసక్తిని కలిగించి వారి వారి దారిద్ర్యమును, రోగ బాధలను నశింపఁజేయును.

### హరిహర అభేద స్మరణము

"శ్లో॥ శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే ।
శివస్య హృదయం విష్ణు, ర్విష్ణోశ్చ హృదయం శివః ॥
యథా శివమయో విష్ణు, రేవం విష్ణుమయ శ్శివః ।
యథాంతరం న పశ్యామి, తథా మే స్వస్తి రాయుషి ॥"

విష్ణుస్వరూపుఁ డయిన శివునికిని, శివస్వరూపుఁడైన విష్ణువునకును నమస్కారము. శివుని హృదయము విష్ణువు, విష్ణు హృదయము శివుఁడు. శివ స్వరూపుఁడు విష్ణువనియు, విష్ణుస్వరూపుఁడు శివుఁడనియు, శివ విష్ణువులకు భేదము లేదనియు ఏ మనుష్యుఁడు చూడఁగలడో, అతనికి ఆయుఃపర్యంతము శుభములు గలుగుచుండును.

### శివుని దర్శించునపుడు పఠించు ధ్యానము

"శ్లో॥ శాంతం పద్మాసనస్థం శశధరమకుటం పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం దక్షిణాంగే వహంతమ్ ।
నాగం పాశంచ ఘంటాం వర డమరుయుతం చాంకుశం వామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి॥"

"శ్లో॥ ఆత్మా త్వం గిరిజా మతిః పరిజనాః ప్రాణా శ్శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః ।
సంచారఃపదయోః ప్రదక్షిణవిధి స్తోత్రాణి సర్వాగిరో
యద్యత్కర్మ కరోమి తత్త దఖిలం శంభో తవారాధనమ్ ॥"

అని ఈ శ్లోకములచేత స్తోత్రము చేసి;

"శ్లో॥ సమస్త వేదవేదాంత, సారభూతం శివప్రదమ్ ।
శివనామామృతం దివ్యం, పేయం సర్వార్థసాధకమ్ ॥"

అని ఈ శ్లోకముచే శివాలయమును మూఁడుమాఱులు ప్రదక్షిణము చేసి;

శ్లో॥ నమస్తే నమస్తే మహాదేవ శంభో
నమస్తే నమస్తే ప్రపన్నైకబంధో ।
నమస్తే నమస్తే దయాసారసింధో ।
నమస్తే నమస్తే నమస్తే మహేశ ॥

అని ఈ ప్రకారముగాఁ జెప్పుచు చేతు లెత్తి నమస్కరించి స్తోత్రమును చేయవలయును. ఇట్లు 40 దినములు ధ్యానమునుచేసినవారలు శరీరరోగబాధలును, దారిద్ర్యబాధలును తొలంగి సుఖింతురు.

## పార్వతిని దర్శించునపుడు పఠించు ధ్యానము

"శ్లో॥ కైలాసాచలకందరాలయకరీ గౌరీ ఉమా శాంకరీ
కౌమారీ నిగమాంత గోచరకరీ ఓంకారబీజాక్షరీ ।
మోక్షద్వారకవాటపాటనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥"

అని ఈ శ్లోకమును పఠించుచు పార్వతిని ప్రదక్షిణము జేసి నమస్కరించినవారికి సౌభాగ్యము, శాశ్వతైశ్వర్యము, పుత్త్రప్రాప్తి మొదలగునవి కలుగును.

## నందీశ్వర ధ్యానము

శ్లో॥ నందీశ్వర నమస్తుభ్యం, శాంతానంద ప్రదాయక! ।
మహాదేవేశసేవార్థం, అనుజ్ఞాం దాతు మర్హసి ॥

శ్లో॥ వృషస్య వృషణం స్పృష్ట్వా, ఈశ్వర స్యావలోకనమ్ ।
శృంగమధ్యే శివం దృష్ట్వా, కైలాసం భవతి ధ్రువమ్ ॥

ఈశ్వరుని ధ్యానించి తిరిగి వచ్చునప్పుడు నందీశ్వరుని శిరస్సు మొదలు పాదములవఱకును తడవి, నందీశ్వరుని శృంగములపై తన ఎడమచేతి అంగుష్ఠతర్జనీ వ్రేళుల నుంచి ఈశ్వరుని దర్శింపవలయును. అట్లు దర్శించుటచే కైలాసమును చూచినవాఁడగును. తర్వాత కొంచెముసేపు కూర్చుండి మఱల నమస్కరించి రావలయును.



## భోజనమును చేయఁగానే పఠించు ధ్యానము

శ్లో॥ అగస్త్యం కుంభకర్ణం చ, రమ్యం చ బడబాలనమ్ ।
ఆహారపరిణామార్థం, స్మరామి చ వృకోదరమ్ ॥

## ఔషధము సేవించునపుడు పఠించు ధ్యానము

శ్లో॥ ధన్వంత్రిణం గరుత్మంతం, ఫణిరాజం చ కౌస్తుభమ్ ।
అచ్యుతం చాఽమృతం చంద్రం, స్మరే దౌషధకర్మణి ॥

## శ్రీ సుబ్రహ్మణ్యుని దర్శించునపుడు ధ్యానము

శ్లో॥ గాంగేయం వహ్నిగర్భం శరవణజనితం జ్ఞానశక్తిం కుమారం,
బ్రహ్మణ్యం స్కందదేవం గుహ మమలగుణం రుద్రతేజస్వరూపమ్ ।
సేనాన్యం తారకఘ్నం గురు మచలమతిం కార్తికేయం షడాస్యం,
సుబ్రహ్మణ్యం మయూరధ్వజరథసహితం దేవదేవం నమామి ॥

అని ధ్యానమును చేసినవారికి సమస్తపాపములును తొలగిపోవును. సమస్త ఐశ్వర్యములును కలుగును. పుత్త్రసంతానమును కలుగును.

## శ్రీ విష్ణువును దర్శించునపుడు పఠించు ధ్యానము

శ్లో॥ మేఘశ్యామం పీతకౌశేయవాసం, శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగమ్ ।
పుణ్యోపేతం పుండరీకాయతాక్షం, విష్ణుం వందే సర్వలోకైకనాథమ్ ॥
శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్ ।
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥

## శ్రీ వేంకటేశ్వర ధ్యానము

శ్లో॥ ఓం నమో వేంకటేశాయ, పురుషాయ మహాత్మనే ।
ప్రణత క్లేశనాశాయ, గోవిందాయ నమోనమః ॥

పరమపురుషుఁడును, మహాత్ముఁడును, నమస్కరించువారి కష్టములను నశింపఁజేయువాఁడును, భూమిని పొందినవాఁడును అగు శ్రీ వేంకటేశ్వరస్వామికి నమస్కారము.

## శ్రీ లక్ష్మిని దర్శించునపుడు పఠించు ధ్యానము

శ్లో॥ వందే లక్ష్మీం పరశివమయీం శుద్ధజాంబూనదాభాం
తేజోరూపాం కనకవసనాం స్వర్ణభూషోజ్జ్వలాంగీమ్ ।
బీజాపూరం కనకకలశం హేమపద్మం దధానాం
మాన్యాం శక్తిం సకలజననీం విష్ణునామాంకసంస్థామ్ ॥

అని ఈ శ్లోకమును ఎవరు పఠించుచుందురో వారు లక్ష్మీకటాక్షమును పొంది శోభిల్లుచుందురు.

## శ్రీరాముని దర్శించునపుడు పఠించు ధ్యానము

"శ్లో॥ శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపమ్ ।
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి ॥

"శ్లో॥ సీతామనోమానస రాజహంస
సంసారసంతాపహర క్షమాళో ।
శ్రీరామ దైత్యాంతక శాంతరూప
శ్రీతారకబ్రహ్మ నమో నమస్తే ॥"

అని మూఁడుసారులు ప్రదక్షిణము చేసినయెడల సమస్తపాపములు తొలఁగిపోవును.

## శ్రీకృష్ణుని దర్శించునపుడు పఠించు ధ్యానము

శ్లో॥ కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్ ।
సర్వాంగే హరిచందనంచ కలయన్ కంఠేచ ముక్తావళీం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః ॥

అని స్తోత్రమును చేయవలయును.

## శ్రీహనుమంతుని దర్శించునపుడు ధ్యానము

శ్లో॥ మనోజవం మారుతతుల్యవేగం, జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యం, శ్రీ రామదూతం శరణం ప్రపద్యే ॥

శ్లో॥ ఆంజనేయ మతిపాటలాననం, కాంచనాద్రి కమనీయవిగ్రహమ్ ।
పారిజాతతరుమూలవాసినం, భావయామి పవమాననందనమ్ ॥

శ్లో॥ సువర్చలాధిష్ఠిత వామభాగం, వామేతరస్థం కపిబృంద సేవ్యమ్ ।
స్వపాదమూలం శరణంగతానాం, అభీష్టదం శ్రీ హనుమన్త మీడే ॥

అని ఈ హనుమద్ధ్యానమును చేయువారు దేహదార్ఢ్యమును కలిగి సుఖింతురు. యత్నకార్యసిద్ధి యగును. భూతప్రేత పిశాచాదులు పరుగిడిపోవును.

## శ్రీ సరస్వతి ధ్యానము

శ్లో॥ యా కుందేందుతుషారహారధవళాయా శుభ్రవస్త్రాన్వితా
యా వీణావరదండమండితకరా యా శ్వేతపద్మాసనా ।
యా బ్రహ్మాచ్యుతశంకరప్రభృతిభి ర్దేవైస్సదా పూజితా
సా మాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా ॥"



శ్లో॥ నిత్యానందే నిరాధారే నిష్కలాయై నమోనమః ।
విద్యాధారే విశాలాక్షి శుద్ధజ్ఞానే నమోనమః ॥

అని ఈ శ్లోకమును పఠించుచు ధ్యానించి నమస్కారములు చేసినవారికి సమస్త విద్యలయందును సమర్థత గలుగుటయే గాక సంపూర్ణ పాండిత్యము గలుగును.

## సంధ్యాదీపమును దర్శించునపుడు ధ్యానము

"శ్లో॥ దీపంజ్యోతి పరబ్రహ్మ దీపం సర్వతమోపహమ్ ।
దీపేన సాధ్యతే సర్వం సంధ్యాదీపం నమోస్తుతే ॥"

## తులసీగ్రహణ ధ్యానము

శ్లో॥ తులస్యమృతజన్మాసి సదా త్వం కేశవప్రియే ।
కేశవార్థం లునామి త్వాం వరదా భవ శోభనే ॥
త్వదంగసంభవైః పత్రై పూజయామి యథా హరిమ్ ।
తథా కురు పవిత్రాంగం కలౌ మలవినాశినీ ॥"

అని స్తోత్రమును చేయుచు తులసిని పరిగ్రహించునది.

## శ్రీ దత్తాత్రేయ ధ్యానము

"శ్లో॥ జగదుత్పత్తికర్త్రే చస్థితి సంహార హేతవే ।
పాపనాశ విముక్తాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥
కర్పూరకాంతిదేహాయ బ్రహ్మమూర్తిధరాయచ ।
వేదశాస్త్రపరిజ్ఞాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥
అదౌ బ్రహ్మమధ్యే విష్ణు రంతే దేవ స్సదాశివః ॥
మూర్తిత్రయస్వరూపాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥

## నవగ్రహ నమస్కారశ్లోకము

"శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయచ ।
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః ॥"

అను ఈ మహామంత్రమును పఠించుచుండిన యెడల సమస్త అరిష్టములును నశించును.

## దశరథప్రోక్త శనిస్తోత్రము

"శ్లో॥ కోణస్థో పింగళో బభ్రుః కృష్ణో రౌద్రాంతకో యమః ।
సౌరీ శనైశ్చరో మందః పిప్పలాదేనసంస్తుతః ।
నమస్తే కోణసంస్థాయ పింగళాయ నమోఽస్తుతే ।
నమస్తే రౌద్రదేవాయ నమస్తే చాంతకాయచ ॥"

అను ఈ రహస్యస్తోత్రము నెల్లప్పుడును పఠించుచుండిన యెడల 75 సంవత్సరములు గలుగు శనిపీడ తొలఁగిపోవును.

# శ్రీ మహిషాసురమర్దిని స్తోత్రమ్



శ్లో॥ అయి గిరినందిని! నందితమోదిని! విశ్వవినోదిని! నందినుతే!
గిరివర వింధ్య శిరోఽధినివాసిని! విష్ణువిలాసిని జిష్ణునుతే!
భగవతి హే శితికంఠకుటుంబిని! భూరికుటుంబిని భూరికృతే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 1

శ్లో॥ సురవరవర్షిణి! దుర్ధర ధర్షిణి! దుర్ముఖమర్షిణి! హర్షరతే!
త్రిభువన పోషిణి! శంకరతోషిణి! కల్మషమోచని ఘోరరతే!
దనుజవిరోషిణి! దుర్మదశోషిణి! దుఃఖవినాశిని! సింధుసుతే !
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 2

శ్లో॥ అయి జగదంబ! కదంబవనప్రియ వాసవిలాసిని! వాసరతే!
శిఖరి శిరోమణి తుంగ హిమాలయ శృంగనిజాలయ మధ్యగతే!
మధుమధురే! మధుకైతవభంజని! కైటభ భంజని! రాసరతే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 3

శ్లో॥ అయి నిజహుంకృతి మాతృ నిరాకృతి ధూమ్రవిలోచని! ధూమ్రశిఖే!
సమర విశోణిత బీజసముద్భవ బీజలతాధిక బీజలతే!
శివ! శివ! శుంభ నిశుంభ మహాహవ తర్పిత భూత పిశాచపతే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 4

శ్లో॥ అయి భో శతమఖ ఖండిత కుండలి తుండిత ముండ గజాధిపతే!
రిపు గజగండ విదారణ ఖండ పరాక్రమ శౌండ మృగాధిపతే!
నిజ భుజదండ నిపాతిత చండ నిపాతిత ముండ భటాధిపతే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 5

శ్లో॥ హయరణ మర్మర శాత్రవ దోర్ధుర దుర్జయ నిర్జర శక్తిభృతే!
చతుర విచార ధురీణ మహాశివదూతకృత ప్రమథాధిపతే!
దురిత దురీహ దురాశయ దుర్మద దానవ దూత దురంతగతే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 6

శ్లో॥ అయి శరణాగత వైరి వధూ వరకీర వరాభయ దాయికరే!
త్రిభువన మస్తక శూల విరోధి నిరోధకృతామల తూలకరే!
దుర్మమితావర దుందుభి నాద ముహుర్ముఖరీకృత దీనకరే!
జయజయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 7



శ్లో॥ సుర లలనాతత థేయిత థేయిత తాల నిమిత్తజ లాస్యరతే!
కకుభాంపతి వర థోంగత తారక తాల కుతూహల నాదరతే!
ధిం-ధిం-ధిమికిట-ధిం-ధిమిత ధ్వని ధీర మృదంగ నినాదరతే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 8

శ్లో॥ ఝుణఝుణఝుణహింకృత సురనూపుర శింజిత మోహిత భూతపతే!
నటిత నటార్ధ నటీనట నాయక నాటిత నాటక నాట్యరతే
పదనత పాలిని! ఫాలవిలోచని! పద్మవిలాసిని! విశ్వధురే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 9

శ్లో॥ దనుజ సుసంగర రక్షణ సంగర పరిస్ఫురదంగ నటత్కటకే!
కనక నిషంగ పృషత్క నిషంగ రసద్భట భృంగ హటావటకే!
హత చతురంగబల క్షితిరంగ ఘటద్బహురంగ వలత్కటకే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 10

శ్లో॥ మహిత మహాహవ మల్లమతల్లిక వేల్ల కలేరక భిక్షురతే!
విరచిత వల్లిక వేల్లిత గల్లక మల్లిక భిల్లిక వర్గయుతే!
భృతికృత ఫుల్ల సముల్ల సితారుణ పల్లవ తల్లజ చారుతనో!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 11

శ్లో॥ అయి సుమనస్సు మనస్సు మనోహర కాంతిలసత్కల కాంతియుతే!
సుత రజనీ రజనీ రజనీ రజనీకర వక్త్ర విలాసయుతే!
నయన సువిభ్రమ విభ్రమద భ్రమర భ్రమరాధిప విశ్వనుతే
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 12

శ్లో॥ అవిరళ గండక మేదుర సమ్మద మత్త మతంగజ రాజగతే!
త్రిభువన భూషణ భూత కళానిధి రూప పయోనిధి రాజసుతే!
అయి సుదతీజన లాలస మానస మోహన మన్మథ రాజగతే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 13

శ్లో॥ కమల దళామల కోమల కాంతి కలా కలితాకుల బాలలతే!
సకల కలావిచయక్రమకేలి చలత్కల హంస కులాలికులే!
అలికుల సంకుల కువలయ మండిత మౌళి లసత్సమదాలికులే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 14

శ్లో॥ కల మురళీరవ వాజితకూజిత కోకిల మంజుల గానరతే!
మిళిత మిళింద మనోహర గుంఫిత రాజతశైల నికుంజగతే!
మృగ గణ భూత మహా శబరీగణ రింఖణ సంభృత కేళియుతే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 15

శ్లో॥ కటి తట నీత దుకూల విచిత్ర మయూఖ సురంజిత చంద్రకలే!
నిజ కనకాచల మౌళి పయోగత నిర్జర కుంజర చారురుచే!
ప్రణత సురాసుర మౌళి మణిస్ఫుర దంశు లతాధిక చంద్ర రుచే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 16

శ్లో॥ విజిత సహస్రకరైక సహస్ర సుధాకర రూప వరైక నుతే!
కృత సుత తారక సంగర తారక తారక సంగర సంగనుతే!
గజముఖ షణ్ముఖ రంజిత పార్శ్వ సుశోభిత మానస కంజపుటే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 17

శ్లో॥ పదకమలం కమలానిలయే! వరివస్యతి యోఽనుదినం సశివే
అయి కమలే! విమలే! కమలానిల శీకర సేవ్యముఖాబ్జ శివే!
తవ పదమధ్య హి శివదం దృష్టి పథం గత మస్తుచ తస్య శివే!
జయ జయ హే మహిషాసురమర్దిని! రమ్యకపర్దిని! శైలసుతే! 18

## ఫలశ్రుతి

శ్లో॥ స్తుతిమితి స్తిమితస్తు సమాధినా
నియమతో యమతోఽనుదినం పఠేత్ ।
పరమయా రమయా సతు సేవ్యతే
పరిజనోఽపి జనోఽపి చ తం భజేత్ ॥

ఇతి శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్య విరచితం
శ్రీ మహిషాసురమర్దిని స్తోత్రం సంపూర్ణమ్ ॥

శ్లో॥ కర్పూరగౌరం కరుణావతారం, సంసారసారం భుజగేంద్రహారమ్ ।
సదా వసంతం హృదయారవిందే, భవం భవానీసహితం నమామి ॥

కర్పూరము వంటి తెల్లని వర్ణము కలిగి, కంఠము నందు నాగహారమును ధరించిన అపార కరుణామూర్తి, విశ్వమునకు మూలకారణుడైన, నిత్యము హృదయ కమలము నందు వసియించు పార్వతీ సమేతుడైన పరమేశ్వరునకు నమస్కారము.



# శాస్త్ర విషయములు - విధి నిషేధములు

## తిథి, వార విశేషములయందు చేయఁగూడని పనులు

సప్తమినాడు తైలసేవ, నీలవస్త్రధారణ, ఇతరులతో కలహించుట, రాగి పాత్రతో నీరు త్రాగుట చేయగూడదు.

1, 6, 11 ఈ తిథులయందు, తలంటు (అభ్యంగనము) కూడదు.

3, 9, 14 ఈ తిథులయందు, క్షౌరము చేయించుకొనగూడదు.

4, 8, 13 ఈ తిథులయందు, శూద్రులు మాంసభక్షణ చేయగూడదు.

5, 10, 15, 30 ఈ తిథులయందు స్త్రీని సేవింపకూడదు.

ఆదివారము అభ్యంగనమును, మంగళవారమున క్షౌరమును, బుధవారమున స్త్రీ సేవయు కూడదు. చిత్త, హస్త, శ్రవణ నక్షత్రములందు తైలమును వదలవలెను. మఘ, కృత్తిక, ఉఫ, ఉషా, ఉభా లందు స్త్రీని సేవింపకూడదు. అష్టమినాడు కొబ్బరికాయను, నవమినాడు సొర (ఆనప) కాయను, దశమినాడు పొట్లకాయను, ఏకాదశినాడు అనుములును, ద్వాదశినాడు సెనగలను, త్రయోదశి నాడు వంకాయను భక్షింపకూడదు.

## కుజ దోషము

శ్లో॥ ధనే వ్యయే చ పాతాళే, జామిత్రే చాష్టమే కుజే ।
స్త్రీణాం భర్తృ వినాశాయ, పుంసాం భార్యా వినాశనమ్ ॥

వధూవరుల జన్మలగ్నములకు కుజుడు 2, 12, 4, 7, 8 స్థానములలో నున్నచో "కుజ దోషము". ఇద్దఱకు కుజదోషమున్నచో వివాహము చేయవచ్చును. అథవా, ఒకరికే ఉన్నచో, తక్కినవారికి మరణభయము చెప్పబడినది. కదాచిత్తు, కుజునకు గురు దృగ్యోగములున్నచో, దోషము లేదు.

## తండ్రి మొదలగువారు మరణించిన పిమ్మట వివాహమునకు దగినకాలము

తండ్రి చనిపోయిన యెడల ఒక సంవత్సరము, తల్లి మరణించిన ఆఱు మాసములును, భార్య గతించిన మూఁడు మాసములును, సహోదరులు గాని పుత్రులు గాని మృతిజెందిన ఒకటిన్నర మాసమును, ఇతర జ్ఞాతులు మరణించిన ఒక మాసమును విడిచి తరువాత వివాహము చేసికొనవలయును.

ఈ విధముగా విడిచిపెట్టుటకు వీలుగాక సంకటము తటస్థించిన యెడల విఘ్నేశ్వరశాంతిని చేసి శుభకార్యమును చేయవచ్చునని యాజ్ఞవల్క్యుఁడు వచించెను.

పెండ్లినాడు మొదలు నాల్గుదినములలోపల తద్దినముగాని, అమావాస్యగాని తటస్థించిన యెడల, ఆ కన్య విధవ యగును. ఒకవేళ భర్త బ్రతికినను సంతాన హీనురాలగును.

## దశవిధ సంస్కారములు

1. గర్భాధానమువలన గర్భమున విడువఁబడు వీర్య మమోఘమై గర్భము ధరింపఁబడును, కావున నిది గర్భాధాన మనఁబడును. ఈ సంస్కారమువలన బీజ దోషమును, గర్భదోషమును పరిహారమగును.
2. పుంసవనము చేయుటవలన పుత్త్రుఁడు కలుగును, కనుక పుంసవన మని చెప్పఁబడును. ఇదియును గర్భపాత్ర సంస్కారము.
3. సీమంతము చేయుట యనఁగా, సమానముగా నెత్తియెత్తుచు చేయునట్టి గర్భసంస్కారము.
4. జాతకర్మసంస్కారమువలన గర్భమునందు శిశువు చేయునట్టి గర్భజలపాన దోషము నివర్తించును.
5. నామకరణమువల్ల ఆయుర్వృద్ధి, లోకవ్యవహారమును సిద్ధించును.
6. అన్నప్రాశనము చేయుటవలన మాతృగర్భసంబంధ మగు మలవస్తు సేవనము వలని దోషము సైతము నివర్తించును.
7. కర్ణవేధనము వలన వేద-శాస్త్ర-పురాణాది శ్రవణ యోగ్యత కలుగును.
8. కేశఖండన (చౌల) సంస్కారమువలన, ఆయుస్తేజో బల వృద్ధులు కలుగును.
9. అక్షర స్వీకరణము వలన జ్ఞానము కలుగును. అనఁగా సదసద్వివేకము కలుగును.
10. ఉపనయన సంస్కారమువలన ప్రథమమున ద్విజత్వసిద్ధియు, పిదప వేదాధ్యయనాధికారమును సిద్ధించును.

ఈ దశవిధ సంస్కారములును తండ్రి యొనర్పఁదగినవి.

## ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రమ్

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాథం చ, శ్రీశైలే మల్లికార్జునమ్ ।
ఉజ్జయిన్యాం మహాకాలం, ఓంకారే పరమేశ్వరమ్ ॥
కేదారం హిమవత్పృష్ఠే, డాకిన్యాం భీమశంకరమ్ ।
వారాణస్యాం చ విశ్వేశం, త్ర్యంబకం గౌతమీతటే ॥

వైద్యనాథం చితాభూమౌ, నాగేశం దారుకావనే ।
సేతుబంధే తు రామేశం, ఘుశ్మేశం చ శివాలయే ॥

## మృత్యుంజయ స్తోత్రమ్

శ్లో॥ మృత్యుంజయాయ రుద్రాయ, నీలకంఠాయ శంభవే ।
అమృతేశాయ శర్వాయ, మహాదేవాయ తే నమః ॥



# ప్రాతఃకాల పఠనీయ శ్లోకములు

## తెల్లవాఋజామున చేయవలసిన ప్రార్థనలు

శ్లో॥ విఘ్నేశ్వరం విరూపాక్షం, పార్వతీం కార్తికేయకమ్ ।
కేశవం ప్రార్థయే భానుం, బ్రహ్మాణం చ శుభాప్తయే ॥

శ్లో॥ అంజనా సుప్రజాదేవ! ప్రాతఃసంధ్యాప్రవర్తతే ।
ఉత్తిష్ఠ కపిశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥

శ్లో॥ ఉత్తిష్ఠోత్తిష్ఠ వజ్రాంగ! ఉత్తిష్ఠ పవనాత్మజ ।
ఉత్తిష్ఠ భక్తమందార! త్రైలోక్యం మంగళం కురు ॥

శ్లో॥ అంజనేయం మహావీరం, బ్రహ్మ విష్ణు శివాత్మకమ్ ।
తరుణార్కప్రభం శాంతం, రామదూతం నమామ్యహమ్ ॥

శ్లో॥ సువర్చలాధిష్ఠిత వామభాగం, వామేతరస్థం కపిబృంద సేవ్యమ్ ।
స్వపాదమూలం శరణంగతానాం, అభీష్టదం శ్రీ హనుమన్త మీడే ॥

## ప్రాతఃకాలమున చేయవలసిన ప్రార్థన

1. కరాగ్రే వసతే లక్ష్మీః, కరమధ్యే సరస్వతీ ।
కరమూలే తు గౌరీస్యాత్, ప్రభాతే కరదర్శనమ్ ॥
2. సముద్రవసనే దేవి, పర్వతస్తనమండలే ।
విష్ణుపత్ని నమస్తుభ్యం, పాదస్పర్శం క్షమస్వమే ॥
3. బ్రహ్మ మురారి స్త్రిపురాంతకశ్చ, భాను శ్శశీ భూమిసుతో బుధశ్చ ।
గురుశ్చ శుక్రశ్శని రాహుకేతవః, కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్ ॥
4. భృగు ర్వశిష్ఠః క్రతు రంగిరాశ్చ, మనుః పులస్త్యః పులహశ్చ గౌతమః ।
రైభ్యో మరీచి శ్చ్యవనోఽథ దక్షః, కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్ ॥
5. సనత్కుమారశ్చ సనందశ్చ, సనాతనోఽప్యాసురి పింగళీ చ ।
సప్తస్వరా స్సప్తరసాతలాని, కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్ ॥
6. సప్తార్ణవా స్సప్త కులాచలాశ్చ, సప్తర్షయో ద్వీప వనాని సప్త ।
భూరాదిలోకాః భువనాని సప్త, కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్ ॥
7. పృథ్వీసగంధా సరసా స్తథాఽపః, స్పర్శశ్చ వాయు ర్జ్వలనం చ తేజః ।
నభస్సశబ్దం మహతాంసహైవ, కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్ ॥
8. గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ, తస్మై శ్రీగురవే నమః ॥

## శ్రీ నృసింహ మహా మంత్రమ్

శ్లో॥ ఉగ్రం వీరం మహావిష్ణుం, జ్వలంతం సర్వతో ముఖమ్ ।
నృసింహం భీషణం భద్రమ్, మృత్యుమృత్యుం నమామ్యహమ్ ॥

## నారాయణి స్తోత్రమ్

శ్లో॥ సర్వమంగళ మాంగళ్యే, శివే సర్వార్థసాధికే ।
శరణ్యే త్ర్యంబకే దేవి, నారాయణి నమోఽస్తుతే ॥

## అన్నపూర్ణా స్తోత్రమ్

శ్లో॥ అన్నపూర్ణే సదాపూర్ణే, శంకర ప్రాణవల్లభే ।
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం, భిక్షాం దేహి చ పార్వతి ॥

## భోజన సమయమున పఠించునవి

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా, ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాఽపాన సమాయుక్తః, పచామ్యన్నం చతుర్విధమ్ ॥

శ్లో॥ భిక్షాం దేహి కృపావలంబన కరీ మాతాన్న పూర్ణేశ్వరీ ॥

## గృహమునుండి వెలుపలికి వెడలునపుడు పఠించునవి

శ్లో॥ వనమాలీ గదీ శార్జీ, శంఖ చక్రీ చ నందకీ ।
శ్రీమన్నారాయణో విష్ణు, ర్వాసుదేవోఽభిరక్షతు ॥

## నిద్రించునపుడు పఠనీయ శ్లోకములు

శ్లో॥ అగస్తి ర్మాధవశ్చైవ, ముచికుందో మహాబలః ।
కపిలో మునిరస్తీకః, పంచైతే సుఖశాయినః ॥

శ్లో॥ అచ్యుతం కేశవం విష్ణుం, హరిం శంభుం జనార్దనమ్ ।
హంసం నారాయణం కృష్ణం, జపేత్ దుస్స్వప్న శాంతయే ॥

శ్లో॥ బ్రహ్మాణం శంకరం విష్ణుం, యమం రామం దనుం బలిమ్ ।
సప్తైతాన్ యః స్మరే న్నిత్యం, దుస్స్వప్నం తస్య నశ్యతి ॥





## 'సూర్య ఏకాకీ చరతి'

- అన్నపర్తి కృష్ణశర్మ సిద్ధాన్తి

సూర్య ఏకాకీ చరతి । చంద్రమా జాయతే పునః ॥ అని శ్రుతి (కృష్ణ యజుర్వేదము, సప్తమ కాండము, చతుర్థ ప్రశ్న, 45-వ అనువాకము; అధ్యా 23, మంత్రం 10) - "సూర్యుడు ఏకాకిగ, ఒంటరిగ స్వావలంబుఁడై స్వకక్ష్య యందు అనఁగా క్రాంతి వృత్తమున (Ecliptic) సంచరించుచున్నాఁడు; చంద్రుడు మఱల (మాటిమాటికి) ప్రకటితుఁడగుచున్నాడు" అని ఈ వేద మన్త్రార్థము. కాని పాశ్చాత్య ఖగోళ శాస్త్రజ్ఞులు (Western astronomers) సూర్యుడు స్థిరముగ నొకచోట నున్నాఁడనియు, ఇతర గ్రహములు భూగోళముతో సహా, అతని చుట్టును తమ తమ కక్ష్యలలో పరిభ్రమించుచున్నవని నిశ్చయించినారు. అంతేగాక, భూగోళము సూర్యుని చుట్టు తిరుగుటవలన సంవత్సరము అగుచున్నదనియును, తనచుట్టు తాను తిరుగుటవల్ల రాత్రింబవళ్ళు ఏర్పడుచున్నవనియును నిశ్చయించినారు.

పాశ్చాత్య విజ్ఞాన విమోహితులగు ఆధునికులు భూభ్రమణమే సత్యమని నమ్ముచున్నారు. ఈ వాదమును సమర్థించుటకై కొందఱు వేదపండితులు సయితము 'చర గతి భక్షయోః' - చరతి అను ధాతువునకు భక్షణార్థమును జెప్పుచున్నారు. అదెట్లనగ : సూర్య ఏకాకీ చరతి - సూర్యుడు ఒంటరిగ భక్షించును, అనఁగా కిరణముల ద్వారా రసమును (జలమును) గ్రహించును (పీల్చుకొనును). ఇట్లు చెప్పుటవలన శబ్దదోషము లేకపోయినను శ్రుత్యంతర విరోధము గలుగును: "తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్ । య ఉదగాత్ ॥" తై. ఆ. 7-4. 2-5 (9-11). "యోసౌ తపన్నుదేతి॥" తై. ఆ. 14-1-1. "చిత్ర న్దేవానా ముదగాత్ ॥" తై. ఆ 7-6-6. "వేదైః రశూన్య స్త్రిభిరేతి సూర్యః ॥" కాం. 3-9-1-8. ఈ వేదమంత్రములందు ఉదగాత్, ఉదేతి, ఏతి - ఇత్యాది గమనార్థ ధాతువు లుండుటచేత నచ్చటను, స్థాన ప్రామాణ్యముచే చరధాతువునకు గత్యర్థమునే స్వీకరింపవలయును.

సూర్య భగవానునిచే మయున కుపదేశింపఁబడిన సూర్యసిద్ధాన్తము నందును - భూమి స్థిరముగా బ్రహ్మాధారణ శక్తిచే ఆకాశమున చతుర్దశ భువనములకు మధ్యభాగమున నిలచి యున్నదనియును; సంవత్సరాత్మక చక్రమునందు సప్త ఛంధస్సులనబడు గుఱ్ఱములను బూన్చిన రథముపై నెల్లపుడు సూర్యుడు తిరుగుచున్నాడనియును జెప్పబడినది :-

శ్లో॥ మధ్యే సమన్తా ద్దండస్య భూగోలో వ్యోమ్ని తిష్ఠతి ।
బిభ్రాణః పరమాంశక్తిం బ్రహ్మణో ధారణాత్మికామ్ ॥
రథే విశ్వమయే చక్రం కృత్వా సంవత్సరాత్మకమ్ ।
ఛన్దాంస్యశ్వాః సప్తయుక్తాః పర్యటత్యేష సర్వదా ॥

అమరకోశము నందును "భూర్భూమి రచలాఽనన్తా" అని భూమి యొక్క అచలత్వము చెప్పబడియున్నది.

ఇప్పటికి సుమారు 1500 సంవత్సరముల క్రిందట, క్రీ.శ. 427 ప్రాంతమున ఆర్యభట్టను ఖగోళశాస్త్రజ్ఞుడు "నౌకలో ప్రయాణించుచున్నవానికి, నదియొడ్డున నున్న చెట్లు చేమలు వెనుకకు పరుగిడుచున్నట్లు అగుపడు రీతిగ, సూర్యుని చుట్టు పరిభ్రమించుచున్న భూగోళముపై నున్నవారికి సూర్యాది గ్రహ నక్షత్రములే పశ్చిమమునకుఁ బోవుచున్నట్లు కనబడుచున్నవ"ని వ్రాసెను :

శ్లో॥ అనులోమగతి ర్నౌస్థః పశ్యత్యచలం విలోమగం యద్వత్ ।
అచలాని భాని తద్వత్సమ పశ్చిమగాని లంకాయామ్ ॥
(ఆర్యభట్టీయే, కాలక్రియాపాదః)

తర్వాత క్రీ.శ. 1543 ప్రాంతమున పోలెండు దేశీయుఁడగు కోపర్నికస్ (Copernicus) అను ఖగోళ శాస్త్రజ్ఞుడు - గ్రహములన్నియు భూమితోగూడ సూర్యుని చుట్టు పరిభ్రమించుచున్నవని సిద్ధాంతీకరించి యున్నాఁడు. రైలులో ప్రయాణించు వారికి ప్రక్కననున్న తరు లతాదులు, గ్రామములును వెనుకకు పరుగిడుచున్నట్లు కనఁబడు రీతిని, తనచుట్టు తాను తిరుగుచున్న భూమిపై నున్నవారికి సూర్యాది గ్రహ నక్షత్రములే భూమిచుట్టు తిరుగుచున్నవను భ్రాంతి కలుగుచున్నదని నవీన ఖగోళ శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. భూమి తనచుట్టు నున్న వాయు, మేఘ మండలములను గూడ తనతో సమానమైన వేగముతో త్రిప్పుకొనుచుండుటచే భూమి స్థిరముగ నున్నట్లు భ్రాంతి కలుగుచున్నదని చెప్పుచున్నారు. భూమియొక్క అచలత్వమును, సూర్య గమనమును, జ్యోతిశ్చక్ర చలనమును ప్రతిపాదించిన శ్రుతులు, సూర్యాంశ పురుషుడును ప్రమాదభరితులా? లేక కించిజ్ఞులగు నేటి ఖగోళ శాస్త్రజ్ఞులు ప్రమాద భరితులా? ఓ విద్వాంసులారా! ఎయ్యేది శ్రుతి విరుద్ధమో, అది యసత్యమని తెలియుఁడు : "సంశయాత్మా వినస్యతి ॥" మఱియు, దివ్యాంశ సంభూతులు, నాత్మశక్తి సంపన్నులును, త్రికాల వేదులునగు మహర్షుల యొక్క సిద్ధాన్తములు నిత్యసత్య సిద్ధములు.

కావున శ్రుతి (వేద), స్మృతి, (జ్యౌతిష)శాస్త్ర, పురాణ, ఇతిహాస (రామాయణ, మహాభారత) సమ్మతమైన సిద్ధాన్తమేమన : భూమి జ్యోతిశ్చక్రమునకు ఆధారమై (కేంద్రమై) బ్రహ్మాండ సమమధ్య ప్రదేశమున బ్రహ్మధారణ శక్తిచే స్థిరముగా నున్నది. అశ్విన్యాది భచక్రము సూర్యాదిగ్రహములతోఁ గూడుకొని తూర్పు నుండి పశ్చిమమునకు దినమున కొకసారి నిరంతరము తిరుగుచున్నది. గ్రహములకు భచక్రవశాత్ గమనమే కాక, రాసులలో ప్రాగ్గమన మున్నది. అనఁగా నక్షత్ర చక్రము పశ్చిమగతి కలది. గ్రహములు మాత్రము భచక్రమున దిరుగుచున్నను, తమ తమ కక్ష్యలలో ప్రవహ వాయువుచే నెట్టబడుచు తూర్పునకు వెళ్ళుచున్నవి :

శ్లో॥ పశ్చాద్వ్రజంతోఽతీజవా న్నక్షత్రైః సతతం గ్రహాః ।
జీయమానాస్తు లంబంతే తుల్యమేవ స్వమార్గగాః ॥
ప్రాగతిత్వ మత స్తేషాం భగణైః ప్రత్యహం గతిః ।
పరిణాహ వశాద్భిన్నా తద్వశా ద్భాని భుంజతే ॥ (సూర్యసిద్ధాన్తము, అధ్యా 1)



ఇఁక భచక్ర సంచలనపు రీతి యెట్టిదనిన : చక్రవాళ పర్వతాగ్రమునందు వృశ్చిక స్వరూపమును దాల్చి - శింశుమారమూర్తి యనెడి పేరుతో శాస్త్రజ్ఞులచే వ్యవహరింపఁబడెడి శ్రీమన్నారాయణమూర్తి అందు నివసించుచు, తమ గిట్టలచేత నుదక్స్వస్తిక యామ్యస్వస్తిక మధ్యకీలమును గట్టిగా బట్టుకొని, తన పుచ్ఛాగ్రముతోఁ బలుమాఱులు ఊని త్రోయుటవలన ఈ భచక్రము (శింశుమార చక్రము) దినమున కొకమాఱు పశ్చిమముగాఁ జలించుచున్నది. మఱియు నీ యాదిపురుషుఁడైన శింశుమారమూర్తి యొక్క పుచ్ఛాగ్ర ప్రేరణవల్ల గలిగిన మహావాయువు "ప్రవహము" అని వ్యవహరింపబడుచున్నది :

శ్లో॥ వాసుదేవః పరంజ్యోతి శ్శింశుమార స్వరూపధృత్ ।
చక్రవాళ మధిష్ఠాయ మేరుమధ్యం సమాస్పృశన్ ॥
వార్శ్చికం రూపమాస్థాయ స్వపుచ్ఛానిల వేగతః ।
భ్రామయ న్కాలచక్రం తన్మేరుశైల ప్రదక్షిణమ్ ॥ (లలితోపాఖ్యానే, న్యాసఖండే)

అట్లయినచో, భూమి తిరుగుచున్నట్లు భ్రమ కలుగుటకు కారణమేమి? భూమికి పైనున్న అంతరిక్షము (భువర్లోకము) నందును, సువర్లోకము (స్వర్గలోకము) వఱకు - అనగా భూమి నుండి ధ్రువమండల పర్యంతమును గల ప్రవహ వాయువు యొక్క ప్రచండ వేగమున, మేఘమండలము గూడ భూమిచుట్టు పరిభ్రమించు చుండుట చేత - భూగోళమే తిరుగుచున్నదను భ్రమ కలుగుచున్నది. అజ్ఞానవశమున చక్షురింద్రియములకు సత్య మసత్యముగాను, అసత్యము సత్యముగాను తోచును. ఇట్టి విషయములు అతీంద్రియములును, జ్ఞాననేత్ర గోచరములును అగుటచే, నెల్లప్పుడు వేద ప్రామాణ్యమునే ఆర్యులంగీకరించుచున్నారు. లౌకికదృష్టిచే నాలోచించినను, భూమి పంచభూతాత్మికము, పార్థివభాగము (ఇసుక) అధికముగ నుండుటచే "పృథివి" అనఁబడుచున్నది - అందుచే భూ, జల పదార్థములతోఁ గూడి గొప్ప భారము (గురుత్వము) గలిగియున్నది. ఇఁక సూర్యగోళమన్ననో, తైజస వాయు తత్వాఽత్మకమై భార రహితమగుటచే సులభముగ జ్యోతిశ్చక్రముతోఁ బాటు పరిభ్రమించు చున్నది - భగవంతునకు మనము హారతినిచ్చు విధము దీనివల్ల తెలియుచున్నది. యథాఽర్థ మిట్లుండగా : నేఁటి కాలమున పాఠశాలలందు బాలురకు పాశ్చాత్యులు ప్రవేశపెట్టిన భూభ్రమణమను అసత్యమైనదియు, శ్రుతి విరుద్ధమయినదియునగు విషమును (విషయమును) పోయుచున్నారు (బోధించు చున్నారు). "ఉద్యన్త మస్తంయన్తం ఆదిత్యమభిధ్యాయన్..." - "ఉదయించుచు అస్తమించుచున్న ఈ సూర్యుఁడే పరబ్రహ్మమని" చెప్పి - మనము ప్రతినిత్యమును సూర్యున కర్ఘ్యమిచ్చుట లేదా? ఇంతకంటె వేఱుగ చెప్పనేల!

శ్లో॥ అపరోక్షాణి శాస్త్రాణి, వివాదా స్తేషు కేవలమ్ ।
ప్రత్యక్షం జ్యౌతిషం శాస్త్రం, చంద్రార్కౌ యత్ర సాక్షిణౌ ॥

## నవగ్రహ ధ్యాన శ్లోకములు

శ్లో॥ జపాకుసుమ సంకాశం, కాశ్యపేయం మహాద్యుతిమ్ ।
తమోఽరిం సర్వపాపఘ్నం, ప్రణతోఽస్మి దివాకరమ్ ॥ 1

శ్లో॥ దధి శంఖ తుషారాభం, క్షీరోదార్ణవ సంభవమ్ ।
నమామి శశినం సోమం, శంభో ర్మకుటభూషణమ్ ॥ 2

శ్లో॥ ధరణీగర్భ సంభూతం, విద్యుత్కాంచన సన్నిభమ్ ।
కుమారం శక్తి హస్తం చ, మంగళం ప్రణమామ్యహమ్ ॥ 3

శ్లో॥ ప్రియంగు కళికా శ్యామం, రూపేణాఽప్రతిమం బుధమ్ ।
సౌమ్యం సత్త్వ గుణోపేతం, తం బుధం ప్రణమామ్యహమ్ ॥ 4

శ్లో॥ దేవానాం చ ఋషీణాం చ, గురుం కాంచన సన్నిభమ్ ।
బుద్ధిమంతం త్రిలోకేశం, తం నమామి బృహస్పతిమ్ ॥ 5

శ్లో॥ హిమకుంద మృణాళాభం, దైత్యానాం పరమం గురుమ్ ।
సర్వశాస్త్ర ప్రవక్తారం, భార్గవం ప్రణమామ్యహమ్ ॥ 6

శ్లో॥ నీలాంజన సమాభాసం, రవిపుత్రం యమాఽగ్రజమ్ ।
ఛాయా మార్తాండ సంభూతం, తం నమామి శనైశ్చరమ్ ॥ 7

శ్లో॥ అర్ధకాయం మహావీరం, చంద్రాఽఽదిత్యాది మర్దనమ్ ।
సింహికాగర్భ సంభూతం, రాహుం తం ప్రణమామ్యహమ్ ॥ 8

శ్లో॥ పలాశపుష్ప సంకాశం, తారకాగ్రహ మస్తకమ్ ।
రౌద్రం రుద్రాత్మకం ఘోరం, తం కేతుం ప్రణమామ్యహమ్ ॥ 9